

# మన దేశము మన సంస్కృతి



రచన - ఇ. వేదవ్యా

# మనదేశము-మనసంస్కృతి

ఇ. వేదవ్యాస



**USCEFI** యుస్కెఫీ ప్రచురణ
3/57 Old Rajendra Nagar, New Delhi-60.

# A, USCEFI - Publication

"*Paper used for the printing of this book was m*
available by the Government of India at concessio
rates."








Ist Edition - 1970
2nd Edition - 1979

The Sale proceeds of this Publication are donated to the USCEFI, a Non Profit making Non-Political Non-Religious body :-

*Pubilshed by and Printed for* :

United Social Cultural & Educational Foundation
of India.

3/57 Old Rajendra Nagar, New Delhi - 60
Hyderabad, Madras.

# వి ష య సూ చి క

## ఈ పుస్తకం



## * వేద యుగం



## * పురాణ యుగం



## * బౌద్ధ యుగం



## * ఆధునిక యుగం

## "యుస్కోఫీ" గ్రంథములు లభించు శాఖలు :

1. సెక్రటరీ, "యుస్కోఫీ" 6-3-240/6 ప్రేమ్‌నగర్.
   ఖైరతాబాద్, హైదరాబాదు - 500004.
2. శ్రీ ఎ. పి. రాజు, సెక్రటరీ "యుస్కోఫీ" జ్యోతిర్‌నిలయ
   రాజాజీనగరు, బెంగుళూరు, 560012
3. శ్రీ జి. యస్. రాజు, సెక్రటరీ "యుస్కోఫీ" 3/57
   Old రాజేంద్రనగర్, న్యూఢిల్లీ 110060
4. శ్రీ ఎమ్. పార్ధసారధిరావు, సెక్రటరీ "యుస్కోఫీ"
   23/372/6 ఫతేఖాన్‌పేట్, సర్వోదయాకాలేజ్, వద్ద
   నెల్లూరు.
5. శ్రీ ఎ. రామజోగారావు, సెక్రెటరీ "యుస్కోఫీ"
   దీపక్ బుక్‌సెంటర్, మెయిన్‌రోడ్డు, రాజమండ్రి - 1
6. శ్రీ రెడ్డి రామమోహనరావు, సెక్రెటరీ "యుస్కోఫీ"
   C/o లక్ష్మి ఆయుర్వేదనిలయం, నిడదవోలు.
7. శ్రీ కె. వి. కృష్ణారావు, సెక్రెటరీ "యుస్కోఫీ"
   ధర్మాజీగూడెం (వయా) ఏలూరు.
8. శ్రీ కె. శ్రీహరిరావు, ఎడ్వకేట్ సెక్రెటరీ "యుస్కోఫీ"
   పెద్దిభొట్లవారివీధి,, గవర్నరుపేట, విజయవాడ.

# ఈ పుస్తకం

ప్రచురించినది USCEFI (యుస్కెఫీ).

అంటే అర్థం

"భారతీయాధ్యాత్మిక సంస్కృతి విద్యా

సముద్ధరణ సంస్థ"

ఇది స్వలాభం, వ్యాపారదృష్టి లేని ఒక ధర్మ సంస్థ. రాజకీయాలతో, కులమత తత్త్వాలతో, ముఠాతత్త్వాలతో సంబంధంలేకుండా వీటికి విరుద్ధమైన ఆదర్శసామాజిక చైతన్యంకోసం పాటుపడటమే ఈ (USCEFI) "ధర్మ సంస్థ" కార్యక్రమము. భారతీయుల ధర్మంమీద (Donations) ఆధారపడిన సంస్థ.

మన దేశంగురించి, మన ప్రాచీనవిజ్ఞానం గురించి-దేశభక్తిని, మంచినడతనూ నేడు సమాజంలో పెంపొందింపచేసి మంచికి అండగా నిలబడగలిగిన శీలవంతులు, నిర్భయంగా చెడును, ఎదుర్కొని-చెడును నిర్మూలింపగలిగిన ధైర్యవంతులను తయారుచేయుడం కోసం 'యు స్కె ఫీ' (USCEFI) ప్రచురణసంస్థ ఏర్పరచి-భారతీయ ఆధ్యాత్మిక, సాంఘిక, సంస్కృతులను గురించిన పుస్తకాలు ప్రచురించి మీకు అందించింది! ఇంకా కొన్ని అందిస్తోంది.

# ఆధ్యాత్మిక ప్రచురణలు

1. శుభవార్త: గురుదేవుల ఆధ్యాత్మిక ఉపన్యాసాలు ఓపికతో వ్రాసి స్వంతఖర్చుతో అచ్చువేయించి ఆధ్యాత్మిక సోదరులకోసం - సాధకులైన గృహిణులు మీకు అందించే పత్రిక! త్యాగంతో సాధకులైన "మహిళల సమాజం" మీకోసం అందిస్తున్న అమూల్యప్రచురణ!! ప్రతినెల మన సాధక మిత్రబృందానికి అందించే 'శుభవార్త' సాలు చందా రూ 12-00. శాశ్వతచందా రూ 116/- లు.

2. పురుషసూక్త రహస్యము :- ఇందు నాలుగు వేదాలలోని పురుషసూక్తం-పారాయణ విధానం - పూజా విధానం మరియు యజ్ఞపురుషుని వివరణ - అంతర్లీనమైన సామజిక పరిణామం-చాతుర్వర్ణ వ్యవస్థ మొదలైన వెన్నో పారమార్థిక రహస్యాలు కలవు.

యుస్కోఫీ ప్రచురణ। ధర రూ। 7-00 మాత్రం

3. యుగపురుషుడు :- సంస్కృత భారతంలోని శ్రీకృష్ణుని అపూర్వ వ్యక్తిత్వం, అయన నిత్యజీవితం, జ్యోతిషరీత్యా గుణించిన చారిత్రికకాలం (19-3-3772 BC.) ఆయన జాతకం, ఇంకా ఎన్నో ఆసక్తికరమైన విషయాలలో రచించిన గొప్ప పరిశోధనాగ్రంథం.

"శ్రీకృష్ణుడు భారతీయాత్మ, నవభారత జాతి నిర్మాత, యుగపురుషుడు". ప్రతి విద్యార్థి ఉపాధ్యాయుడు చదువవలసిన అపూర్వగ్రంథం !

యుస్కేఫీ ప్రచురణ ధర రూ॥ 6-00 లు.

4. విష్ణుసహస్రనామం - నారాయణతత్వం :

ఇది ఇంతకు పూర్వం అచ్చుకాని సాధనగ్రంథము. పెద్ద అచ్చులో తప్పులులేకుండా, తేలికగా చదువుకొనుటకు-అచ్చువేసిన అమూల్యమైన ఆధ్యాత్మిక "మంత్ర మాల" ఈ"విష్ణుసహస్రనామం", "నారాయణమంత్రం" జపించే విధానం, యోగమార్గంలో జపించే విధానం, అంగన్యాస కరన్యాసములతో సహా సాధనా రహస్యాలను తెలిపే అద్భుతనిధి. ప్రతిఇంటా వుండదగినది.

యుస్కేఫీ ప్రచురణ : ధర రూ 5-00 లు.

5. అమృతానుభవములు.- ఇది నిత్యజీవితంలో సతమతమయ్యే సామాన్యగృహిణీ, గృహస్థులకు శ్రీ గురుదేవుల కరుణవల్ల అనుగ్రహింపబడిన "ఆధ్యాత్మికానుభవాల" రచనల మాలిక. ఇవి-యదార్థజీవితానికి సంబం

ధించినవి. ఇది నవలగాని-కల్పనగాని కాదు. స్వర్గతుల్య మైన దివ్యానందమును, అందించి వీరి జీవితాలకు "అమృతానుభవాన్ని" ప్రసాదించినాయి.

యుస్కోఫ్ ప్రచురణ : ధర రూ. 7-00 లు.

## 6. Hinduism in the Space Age (English)

It explains with a masterly lucidity, the ocean of Hinduism as revealed by the Vedas, Upanishads and Bhagawad Gita in the light of the latest Researches in USSR· Czeckoslovakia, etc., and the finding of the Geology, planetology, Parapsychology and Nuclear Physics, concerning the Origin of the Universe and the evolution of Man and also explaining the secrets of Astrology and Mantra Sastra. It also reveals about the future predictions, as revealed by the book of Prophesy Bhavishya Purana, authored by Maharishi Vedavyasa 5000 Years ago! This remarkable book has been reviewed with great appreciation by the All India Radio and other Newspapers like "The Hindu" and the "Indian Express."

This is written by Sri E. Vedavyas I. A. S. with a Foreword by Dr. Karan Singh, Union Health Minister (with 796 pages, 13 plates, 40 illustrations)

Cost: Rs. 50-00.

(Rs. 25/- For. Members only.)

ప్రాచీన భగవద్గీత - (క్రీ॥శ॥ 1186 నాటి ప్రాచీన తాళపత్రం నుండి గ్రహింపబడిన అపూర్వ పరిశోధన గ్రంథం)

ఈనాడు మనం చదువుకునేది సంపూర్ణమైన భగవద్గీతకాదు. ఇందులో 45 శ్లోకములు తక్కువ. ఇవి 'మహాభారతం'లో శ్లోకానుక్రమణికవల్ల తేలుతుంది. రెండువేల సంవత్సరాలుగా "ఖిలమైపోయి" మరుగుపడిపోయి ఈనాడు మనకు లభ్యమైన 45 ప్రాచీన అధికశ్లోకములతో, వానిపై లఘువ్యాఖ్యతో ముద్రింపబడినది.

సంగ్రహణ : E. వేదవ్యాస I. A. S. యుస్కేఫీ ప్రచురణ:

భగవాన్ వేదవ్యాస –(వేదవ్యాసమహర్షి అద్భుత జీవితంపై అపూర్వ పరిశోధనా గ్రంథం)

ఇందులో "వ్యాసమహర్షి ఆశ్రమం" "వ్యాస మహర్షి కాలము" "ప్రపంచభవిష్యత్ - దివ్యదృష్టి" "వేద విభాగం." "భాగవతధర్మము-మోక్షవిద్య," "బ్రహ్మసూత్ర రచన," మూర్తీభవించిన "హిందూమతం" వ్యాసుని జననం, సర్వశాస్త్ర పరిరక్షణ మొదలైన విషయములు వివరంగా తెలియచేసిన అపూర్వగ్రంథము.

యుస్కోఫీ ప్రచురణ : రచన ఇ. వేదవ్యాస I.A.S. పై కాపీలకు త్వరపడండి.

మనది భారతదేశం! ప్రపంచంలో భారతీయులకు ఒక ప్రత్యేక సంస్కృతివుంది! మన సంస్కృతి గురించి మనం తెలిసికోవాలంటే - ప్రతి భారతీయుడు- పై "యుస్కోఫీ'' ప్రచురణలను చదివితీరాలి మీరూ తప్పక చదువుతారు కదూ?



## ముందుమాట :-

ప్రతి మనిషి జీవితంలో మొదటగా తెలుసుకొనేది తన తల్లిగురించి తండ్రిగురించి. అలాంటివే ఒకజాతి జీవితంలో తన దేశము, తన సంస్కృతీ: అంటే తల్లీ తండ్రి లాంటివి అన్నమాట దేశమూ— సంస్కృతి

మన దేశానికి స్వాతంత్ర్యం వొచ్చి పావుశతాబ్ది దాటింది అయినా మనకీనాడు సరియైన చరిత్రగాని, మన సంస్కృతినిగురించి మనకు తెలియ వలసినదంతా తెలిపే గ్రంథాలుగాని, లేకపోవడం విచారకరం. ఫలితమేమంటే యీనాడు మన పిల్లలు కాళిదాసు ఎవరంటే తెలియకుండా, వ్యాసమహర్షి ఎవరంటే చెప్పలేని విద్యార్థులుగా తయారై, వాళ్లకు పాఠశాలలో చెప్పే చరిత్రగురించిగాని, మన సంస్కృతిగురించిగాని ఏమీ ఆశక్తి లేకపోవడం జరుగుతోంది. ఆసక్తి లేకపోగా, పిల్లలకి విద్యమీద కంటె పరీక్ష ప్యాసవడంలోనే ధ్యాస.

ఫలితం—బజార్లో చవకబారు గైడ్లు వేలకొలది తయారవుతూండడం. అవి కాపీకొట్టో, టీచరుకు బెదిరించో పరీక్ష ప్యాసవడం జరుగుతున్న విషయం. పిల్లలే యువకులు అవుతున్నారు. యువకులు చైనామార్గంగానో రష్యా మార్గంగానో, లేక అమెరికా మార్గంగానో వాళ్లనువాళ్లు మలచుకొని ఆ మానసిక దాస్యంనుంచి బయటపడలేని దరిద్రస్థితి యిప్పుడు ఎక్కడ చూసినా కనబడుతోంది.

ఎవరో అన్నారుట—'చీకటిని తిట్టుకుంటూ కూర్చునేకన్న ఒక దీపం ఎంత చిన్నదైనాసరే, వెలిగించండి' అని. అందుకే యీ పుస్తకం వ్రాయడమైనది.

ఇది, కేవలం భారతదేశ చరిత్ర గురించివ్రాసిన యింకొక 'టెక్స్టు బుక్కు' మాత్రమేకాదు. ఇది ఒక పరిశోధనాగ్రంథం. ఇందులో మన సాహిత్యం, కళలు, ప్రాచీన విజ్ఞానశాస్త్రం, గణితం, ఖగోళం మొదలైన అంశాలేగాక, మన చరిత్రను తారుమారు చేయడానికి విదేశ చరిత్రకారులు చేసిన దురాగతాలను సరిదిద్ది, ఆ అంశాలగురించి చాలా పరిశోధనచేసి వ్రాయవలసివచ్చినవి ఎన్నో—చదివితే మీకే తెలుస్తుంది.

భారతదేశ సమగ్రరూపం ఎటువంటిదో మనకు తెలియడం ఇందలి ఉద్దేశం. 'భారతాత్మ' అనబడే యీ దేశపు ఆధ్యాత్మిక నిజస్వరూపం అర్థం చేసుకోవాలంటే, ఈ దేశపు భగవద్గీత దగ్గరనుంచి గాంధీమహాత్ముని వరకూ జీవన ప్రవంతిగా ప్రవహించిన 'జాతి' చరిత్రను ఆవిష్కరింపచేయాలి.

ఇది, విద్యార్థులకు నవభారతదేశంలో చదవదగిన కేవలం పాఠ్య గ్రంథమే కాకుండా, కాలేజీలోను, స్కూళ్లలోను, పిల్లలకు చదువుచెప్పే అధ్యాపకులు తెలుసుకోవలసిన అంశాలుకూడా చేర్చి, ప్రత్యేకంగా వ్రాయవలసివచ్చింది. మన గురించి మనకు తెలియడం: అందులోనూ పరదేశీయుల భావాలకి అనుగుణంగా వ్రాయబడిన చరిత్రేకాకుండా, మన జాతి జీవిత స్వరూపాన్ని నిండుగా ఆవిష్కరించడమే,యీగ్రంథ ప్రయోజనం.

# USCEFI భారతీయ సంస్కృతి విద్యా సముద్ధరణ సంస్థ

అధ్యక్షులు:-

పి. వి. జి. రాజు M. P.

శ్రీ T. తాతాచారి (మాజీచీఫ్ జస్టిస్ న్యూఢిల్లీ హైకోర్టు)

M. V. S. ప్రసాద్ (Asst. Collector Central Excise)

G. S. రాజు (Asst. Director TRC Govt. of India)

కార్యవర్గం:

M. పార్థసారదిరావు యుస్కెఫీశాఖ నెల్లూరు

K. V. కృష్ణారావు యుస్కెఫీశాఖ ధర్మాజిగూడెం

A. P. రాజు యుస్కెఫీశాఖ బెంగుళూరు

T. V. రామచంద్రరావు యుస్కెఫీశాఖ నిడదవోలు

నాగిరెడ్డి యుస్కెఫీశాఖ హైదరాబాదు

M. V. S. ప్రసాద్ యుస్కెఫీశాఖ న్యూఢిల్లీ

శ్రీK. హరిరావు యుస్కెఫీశాఖ విజయవాడ

N. బ్రహ్మరావు యుస్కెఫీశాఖ కాకినాడ

(Dy. Comandt A. P. S. P.)

A. రామజోగారావు యుస్కెఫీశాఖ రాజమండ్రి
కుమారి V. నర్సాయమ్మ యుస్కెఫీశాఖ అంగర
ఇంకా తదితరులు

అడ్రసు
USCEFI
6-3-240/6 ప్రేమ్‌నగర్
ఖైరతాబాదు
హైదరాబాదు



# మన చరిత్ర

మనదేశ చరిత్రంతా విదేశీయులు వ్రాసిందే! ఇంగ్లీషువారు మనల్ని పరిపాలించినంత కాలంలో మనల్ని మానసికంగా, సాంస్కృతికంగా మార్చి వేయటానికి చాలా పథకాలు వేశారు. అందులో దాదాపు అన్నింటివెనకా ఒకటే ఉద్దేశం. మనల్ని స్వాతంత్ర్యం కోరకుండా, మన జాతీయభావాలు మనలో అంకురించి వాళ్ళ సామ్రాజ్యానికి ప్రమాదం తీసుకురాకుండా వుండేలాగ చూడటమే. అలా చెయ్యటంవల్ల మన జీవిత విధానాలూ, అలవాట్లూ, కట్టూ బొట్టూ, మన ఆలోచనలూ-అన్నీ, విదేశీయులను మనం అనుకరించేలాగ చెయ్యటం. ఇదేవాళ్ళ సంకల్పం. సంకల్పమేమిటి? చివరికి జరిగిందిగూడా అంతే!

ఇలాగ మనల్ని మార్చివేయటానికి తెల్లదొరలు పన్నిన తంత్రాలలో ముఖ్యమైనది 'విద్యావిధానం'. అంటే వాళ్ళు మనకు తలకెక్కించ దలచిన దంతా మనపిల్లలకూ, విద్యార్థులకూ ఉగ్గుపాలతో నూరిపోశారు. ఇలా చెయ్యటానికి కావలసిన పుస్తకాలు రచించారు. అలా వ్రాయటంలో మనదేశ చరిత్రని వాళ్ళు తిరగరాసేశారు. అలా రాయటం చాలాచాకచక్యంతో, మనకే అనుమానం రానివిధంగా, అనేక అపప్రథలు కల్పిస్తూ, మనదేశంగురించిన అనేక గొప్ప విషయాల గురించి అసలు ప్రస్తావనే లేకుండా, అనేక తప్పులు కల్పిస్తూ భారతీయులగురించి భారతీయ చరిత్రలోని మహామహులు, రాజులు, వీరులు, జాతీయపురుషులూ అయినవాళ్ళ గురించి-వీలయినంత తగ్గించి వ్రాయటం జరిగింది. ఇది యీనాడు యిప్పుడిప్పుడే మనవాళ్ళు తెలుసుకుంటున్నారు. ఈ విద్యావిధానం మార్పటంలో వాళ్ళకి మన దేశచరిత్ర ముఖ్యంగా ఒక పనిముట్టుగా వినియోగించింది.

విదేశీయులు మనదేశం గురించిచేసిన మోసాలు ముఖ్యంగా నాలుగు. అవి యేమిటంటే :

1. మనదేశ చరిత్ర అతిప్రాచీనం అని తెలియజేసే ఆధారాలన్నీ నాశనం చెయ్యటం.

2. మన పురాణాలు, వేదాలు, అవతార పురుషులూ యివన్నీ నిన్న మొన్ననే కల్పించబడిన అబద్ధాల కట్టు కథలని, మన పిల్లలకి తల కెక్కించటం.

3. మనకి "చరిత్ర" అంటూ ఒకటి లేదని నిరూపించటం.
(ఇంగ్లీషువాడు రాసిందే మనకు భిక్ష అని!!)

4. మనదేశానికి అసలు విజ్ఞానమూ, సంస్కృతి- గొప్పతనం-ఇలాంటివి ఏవి వచ్చినా అవి మనమీద దండయాత్రలు చేసిన విదేశీయులు పెట్టిన భిక్షే, అసలు మనకి స్వంత నాగరికతే లేదన్నభావం పాతుకుపోయేలాగు చరిత్రద్వారా ప్రచారంచెయ్యటం, భారత సంస్కృతిని నాశనం చెయ్యపూనటం. యీ విషయం చాలా అన్యాయమని ఘోషించిన పెద్దమనుషులూ, ఆ నాడు ఇంగ్లీషు వాళ్ళలో వున్నారు.

సర్ జాన్ వుడ్రఫ్ రాసిన గ్రంథం —" "ఇండియా నాగరిక దేశమేనా ?" (Sir John Woodroff—"Is India Civilized ?)" అన్నదాంటో, మనదేశానికి ఇంగ్లీషువాళ్ళు స్వార్థంతో చేస్తున్న ద్రోహం చాలా అన్యాయమని, పాపమని ఆయన గోలపెట్టాడు. అయితే ఏం లాభం? ఎవరు పట్టించుకుంటారు? దానికితోడు మనదేశీయులే విదేశీయసంస్కృతిని కౌగలించుకొని, మాకంటే మీరే అధికులనే మానసపుత్రులు తోదయ్యారు.

హిందూమతం, భారతీయసంస్కృతి మొదలంటా నాశనం అయిపోతేనే కాని యీదేశం బాగుపడదని, మన మూఢవిశ్వాసాలు (అంటే మన మతం, సంస్కృతీ అన్నమాట!) పూర్వీకులు యిచ్చిన భావాలూ, తుడిచివేస్తే గాని దేశం ముందుకురాదని ఇంగ్లీషువాళ్ళకన్నా ఎక్కువ ప్రచారం చేసిన మన ప్రబుద్ధులూ వున్నారు. (ఇప్పుడూ వున్నారు ఈ జాతి. జాగ్రత్తగా చూస్తే కనిపిస్తారు నేటి సమాజంలో!)

ఇలాంటి ఘోర ప్రమాదం - మన దేశపు విజ్ఞానానికి సంస్కృతికి చాలా దగ్గరలోనే ముందుకవస్తున్నదని గుర్తించినది - విదేశీయులలో కొందరు నిస్వార్థులైన మహామహులు.

సర్ విలియం జోన్సు (Sir William Jones) మన దేశపు న్యాయశాస్త్రం నాశనం కాకుండా "మనువు" వ్రాసిన "మనుస్మృతి మొదలైన సంస్కృత గ్రంథాలన్నీ అర్థంతోకూడా ముద్రింపించారు. Manu's Laws అన్న శీర్షిక క్రింద. అదేవిధంగా పరాశరముని వ్రాసిన "విష్ణు పురాణం" ఇంగ్లీషులోకి విల్సన్ (Wilson) అనేవాడు, అనువాదం చేశాడు.

ఇలాగే "మాక్సు మూలరు" (Max Muller) అనే జర్మను పండితుడు విదేశాలలో, భారతదేశానికి మనసంస్కృతికి మన జాతికీ జరుగుతున్న అన్యాయంగురించి అందోళనచేసి, హిందూదేశంపట్ల మన పరిపాలకులకి గౌరవం కలిగించాలనే ఉద్దేశంతో "ఆక్సుఫర్డ్" (Oxford) విశ్వవిద్యాలయంలో తరిఫీదు (Training) అవుతున్న I. C. S ఆఫీసర్లకు ఇచ్చిన ఉపన్యాసాలే India-What it can Teach Us? (భారతదేశం మనకేం నేర్పగలదు?) అన్న గ్రంథం. ఇది, భారతీయుడనుకొనే మనలో ప్రతివాడూ, చదివితీరాలి.

ఇంతేకాకుండా యీ "మాక్సుమూలరు"— సంస్కృతం నేర్చుకుని శ్లోకాలు వ్రాసాడు. తనూ తన భార్యా భారతీయ ఋషులలాగ ఆశ్రమం తయారుచేసుకొని చివరికాలంలో, "ఆక్సుఫర్డ్" దగ్గిర 'మోక్షమూలరుభట్టు' అని పేరు మార్చుకొని జీవించాడు. ఆయన అనేకమంది పండితుల సహాయంతో ఇంగ్లీషులోకి అనువాదంచేసి (Sacred Books of the East) (ప్రాచ్యదేశపు పవిత్ర గ్రంథమాల) అన్న పేరుతో అనువదించినవి ఇవి :- (1) వేదాలు (2) బ్రాహ్మణాలు (శతపథబ్రాహ్మణం, గోపథబ్రాహ్మణం వగైరా) (3) పురాణాలు (4) ఉపనిషత్తులు (5) ధర్మశాస్త్రాలు ఇంకా ఎన్నో ఇలా అచ్చు వేయించకపోతే యీపాటికి మనకివి మచ్చుకి గూడా మిగిలేవి కావు.

ఇంతకీ చెప్పవచ్చేదేమిటంటే, మనకి. మనచరిత్రకీ, తీరని అన్యాయం జరుగుతూంటే అది మనకే జరుగుతోందని తెలియని దుస్థితిలోవుండి, యీనాటికీ అవే వల్లెవేస్తున్నారు. మన టీచర్లూ, ప్రొఫెసర్లు, మనకాలేజీలలో లెక్చెరర్లు, యూనివర్సిటీల వైస్‌ఛాన్సలర్లుగూడా. ఇంక మన టీచర్లకి కొత్త విషయాలెవరు చెబుతారు? ఇంక టీచర్లూ లెక్చరర్లగతే అలావుంటే పిల్లలకి సరైన చరిత్ర తెలియటం ఎలాగ? ఇదంతా గమనించకుండా "మన విద్యా ప్రమాణాలు పడిపోతున్నాయి." 'మన విద్యార్థులలో క్రమశిక్షణ పోయింది' అని గోలపెట్టే నాయకులు, ఊరికినే పరిస్థితిని తిట్టుకునే స్థితిలోవున్నారు. సరైన చరిత్రతో మనదేశం గురించి మరుగు పడిన గొప్పవిషయాలు బైటికి తీసి రాయడం ఎలా? పురాతన చారిత్రక ఆధారాలమీద పరిశోధన చెయ్యాలి. అంటే ఏం చెయ్యాలి? మన చరిత్రలోని తప్పులు సవరించబడాలి. అవి ఏవి? మనచరిత్రలో ముఖ్యంగా యీనాడు కనబడేతప్పులు, ఇంగ్లీషువాడుప్రచారం కోసం వ్రాసిన చరిత్రలోని, యీ క్రింద ఒక లిస్టు (List) గావేద్దాము :—

1. ఆర్యులనేవాళ్ళు - ఒకజాతి, వీళ్ల భారతీయులుకాదు, బైటినుంచి

(ఇంగ్లీషువాళ్ళు. ముసల్మానుల్లాగ దండయాత్రచేసిన వాళ్ళన్న మాట !) వచ్చి చేరినవాళ్ళు.

2. ఈ 'ఆర్యుల దండయాత్ర వల్లనే దేశంలో సంస్కృతీ, నాగరికతావచ్చాయి యీదేశానికి.

3. అంతకు ముందు ఈ దేశంలో పొట్టి అనాగరిక జాతులయిన 'ఆదిమవాసు" లనేవాళ్ల (వీళ్ళెవరో దేవుడికెరుక !) వుండేవారు.

4. వేదాలు క్రీస్తుకు కొంచెం ముందు ఎవరో రాసినవి. ఇవి ప్రాచీనములు కావు. ఇందులో నిప్పు, గాలి, నీరు లాంటి ప్రకృతిశక్తుల్ని చూసి మానవుడు భయపడి చెప్పిన ప్రార్థనాగీతాలు (అగ్నిదేవుడూ, వాయువూ, వరుణుడూ అన్నమాట !) ఉన్నాయి.

5. అలెగ్జాండరు (చక్రవర్తి అట .!) ఇండియాను, ప్రపంచాన్నీ జయించాడు. (ఇతడు 'పోరస్' అనే మనరాజు చేతిలో ఓడి చావు తప్పించుకున్న ఆధారాలు ముందుముందు అధ్యాయాలలో చూడవచ్చు.)

6. గుప్త చంద్రగుప్తుడూ, శాలివాహనుడూ, బుద్ధుడూ లాంటి వాళ్ళు పురాతనులు కాదు. (వాళ్ళకాలం 1300 ఏళ్ళదాకా తగ్గించి వాళ్ల ఇటీవలి వాళ్ళనని నిరూపిస్తూ వ్రాసారు.)

7. మన పురాణాలలోని "చరిత్ర" నమ్మతగ్గది కాదు. అబద్ధాలతోనూ అతిశయోక్తులతోనూ కూడింది. (దొరలు వ్రాసిందే సత్యంగదా!)

8. మొగలులు, గ్రీకులు, ఆఫ్ఘనులు లాంటి విదేశీయుల పరిపాలనా

కాలం చాలాగొప్పకాలం. "స్వర్ణయుగం" (అప్పటి ప్రజల బాధలకూ, కరువులకూ, అంతేలేదు) భారత చరిత్రలోనే.

9. 1857—లో భారతీయులు, తమదేశాన్ని తాము పాలించుకోటానికి తెల్లవాడిని తరిమివెయ్యటానికీ, చేసిన "స్వాతంత్ర్య యుద్ధం"ను సిపాయీల తిరుగుబాటుగా కొట్టిపారవేసారు. ఇది జాతీయ సమరం కాదట !

10. శ్రీకృష్ణుడి కాలం, శంకరాచార్యులవారి కాలం, ఇలాగ హిందూ సాంప్రదాయానికి మూలపురుషులయిన వాళ్ళందరి కాలాలూ తగ్గించి వాళ్ళని మత సంస్కర్తల క్రింద తోసిపారేసి, వారుచేసిన అపారమైన సేవనీ, వాళ్ళు మనజాతికిచ్చిన మహోప దేశాలనీ మరుగుపరచి, అసలు నిజమైన చరిత్రను మటుమాయం చేశారు.

11. శ్రీకృష్ణదేవరాయలు శివాజీమహారాజు, శాలివాహనసార్వభౌముడు, విక్రమాదిత్యుడు, పులకేశి, సింహవిష్ణువూ, పరమార భోజుడు, సముద్రగుప్తుడూ— ఇలాంటి అనేక భారతీయ చక్రవర్తులు నడిపిన ధర్మపరిపాలనా, వాళ్ళు చేసిన సేవా, ఇంకా అజంతా, ఎల్లోరాలు నిర్మించిన రాజుల పేర్లూ—ఆయుర్వేదం, జ్యోతిషం, రసాయనిక భౌతిక శాస్త్రాలు, ఖగోళం, భూగోళం, ఇలాంటి ఇతర శాస్త్రాలలో మన దేశీయులు సాధించిన విజయాలూ ; విదేశరాజుల్ని మన రాజులు జయించి బైటదేశాలలో హిందూ మతాన్ని స్థాపించటం. హిందూమత ప్రపంచవ్యాప్తి; వీటినన్నిటిని గురించి-ఇలాటివి మన జాతికి ముఖ్యమైన విషయాలు ఒక్క ముక్కైనా లేకుండా జాగ్రత్త పడినారీ తెల్లదొరలూ— ఆదొరలు రాసినచరిత్ర చదివే మనం కళ్ళున్న కబోదులం !

# 9

అందుకే చెపుతున్నాను ముందుగా: యీ పుస్తకంలో - విజయనగర రాజ్యంలోని బజార్లో వజ్రాలు, మాణిక్యాలూ, బజార్లోని మల్లెపూలలాగ విక్రయించేవారన్నా - మననుంచి వైద్యం, జ్యోతిషం: అరబ్బులూ, గ్రీకులూ తీసుకొన్నారన్నా - మనదేశంపైకి అలెగ్జాండరు దండయాత్ర చేసినప్పుడు మనదేశపు ఋషులు మంత్రశక్తితోనూ మంత్రించిన దర్భలతోనూ యుద్ధభూమిలో నిలిచి గాలివానలూ తుపానులూ ఉరుములూపిడుగులూ సృష్టించారని నేను యిందులో రాసినా, (అది గ్రీకు చరిత్రకారులు వ్రాసిందే !) - ఇవన్నీ మీ ఇంగ్లీషువాడి చరిత్రలో లేవని బెంగాపడకండి !!!

అవన్నీ యిన్నాళ్లూ మరుగుబడిన మనదేశపు సంపద. మన చరిత్ర ! నా ఊహాగానమనుకునేరు కొంపతీసి !!



# 2. పాశ్చాత్యులు - వారి చరిత్ర !

మన దేశానికి అసలు నిజమైన చరిత్ర ఏదో నిరూపించే ముందు, పాశ్చాత్యుల 'భారతదేశ చరిత్ర' ఎటువంటిదో గమనిద్దాం. అది తెలుసుకున్నాక అసలైన మన "జాతీయ చరిత్ర'' లేక National History నిర్మించటానికి గల ఆధారాలను పరిశోధించటం. నిష్పాక్షికమైన మన జాతి చరిత్రకు చాలా అవసరం. 'భారతీయులకు చరిత్ర లేద'ని నిరూపించడం మన పురాణాలయొక్క చరిత్రను కప్పిపుచ్చడానికి మొదటి మెట్టు లాగ కనిపిస్తుంది విదేశ చరిత్రకారుల పరిశోధన చూస్తే. పురాణాలే గాకుండా అనేక రాజుల వంశవృక్షాలు ప్రాచీన గాథలు, ఇత్యాది చారిత్రక ఇతిహాసిక సాహిత్యం చాలా వున్నట్టు చారిత్రక ఆధారాలవల్ల తెలుస్తోంది. అవేమిటో ఈ అధ్యాయంలో గమనిద్దాం.

ఇక పోతే, పురాణాలను ఎంత నిష్పక్షపాత బుద్ధితో పాశ్చాత్య చరిత్రకారులు విమర్శించారో కూడా మనం గమనించడం ఇప్పుడు అవసరం. ఏదన్నా గ్రంథాన్ని, లేక చారిత్రక ఆధారాన్ని కొట్టిపారేసే ముందు నిష్పక్షపాతంగా పరిశీలించడం ధర్మం: న్యాయమూను. చరిత్ర వ్రాసేవాడికి, ఈ నిష్పక్షపాత బుద్ధి వుండాలన్నది కూడా ఈ తెల్లదొరలు నిర్ణయించిన న్యాయసూత్రమే ! అయితే మన పురాణాలను ఎంతవరకూ నిష్పక్షపాతంగా పై దృష్టితో విదేశీ చారిత్రకారులు గమనించారో అన్న

విషయం మన వద్దెవిమిది పురాణాలలో కొన్నింటి మీద తెల్లవారు వ్యక్తం చేసిన, అభిప్రాయాలను చూస్తే, మనకి స్పష్టంగా తేటతెల్లమవుతుంది. ఉదాహరణకు :—విల్సన్ మహాశయుడు 'పురాణాలు' ("The Puranas" –1897) అన్న తన రచనలో 'వ్యాసుడు రచించిన మహాభారతం, క్రీస్తు శకం 12 వ శతాబ్ది ప్రాంతంలో వ్రాయబడినదని' తన అభిప్రాయం వెలిబుచ్చారు. దీన్నిబట్టిచూస్తే ఈ మహాశయునికి పురాణాల కాలాన్ని వీలైనంత తగ్గించాలనే ఆతుర్దా తప్ప, బుద్ధి సరిగా అసలు చరిత్ర మీదకి పనిచేసినట్లు కనపడదు. ఎందువల్లనంటే—12వ శతాబ్దంనాటికి నన్నయ్య భట్టారకుడు భారతాన్ని తెలుగులోనికి అనువాదం చేయడం అప్పటికే జరిగిపోయింది. కాబట్టి తెలుగుభారతం కంటె వ్యాసమహర్షి వ్రాసిన సంస్కృత భారతం—తరువాతి కాలంలో వ్రాయబడినట్లు తేలుతుంది. ఈ విల్సన్ మహాశయుని సిద్ధాంతం ప్రకారం!! ఇది కేవలం మచ్చుకు ఒకటి మాత్రమే! ఇంకా ఇతర పురాణాల గురించి పాశ్చాత్యుల ద్వేషం, అసూయ ఇంకా ప్రత్యక్షంగా తెలిపే నిదర్శనాలు, వారి వాక్యాలే.

**1. బ్రహ్మపురాణం** :— ఈ పురాణం గురించి ఇది 13—14 శతాబ్దాల కంటె ప్రాచీనమైనదని చెప్పడం తనకు వీలుకాదని అంటాడు, విల్సన్ మహాశయుడు. ("It could not have been compiled earlier than the 13th or 14th century"—P-28)

**2. పద్మపురాణం** :— అలాగే పద్మపురాణానికి కూడా వీరు చాలా దయతో 12-వ శతాబ్దంవరకూ ప్రాచీనతను మంజూరు చేశారు. కాని, అందులో కొన్ని భాగాలు మళ్ళీ 15, 16 శతాబ్దాల్లో కూడా వ్రాయబడ్డట్టు ఆయన అభిప్రాయం ఇలా వ్రాశారు :-

"No portion of the "Padma Purana" is probably older than the 12th century and the last portions may be as recent as the 15th or 16th". అంటే 'పద్మపురాణం'లో ఏ భాగం కూడా 12వ శతాబ్దం కంటె ప్రాచీనమైనవి కావు. అందులోనూ ఆఖరి భాగాలు ఈ మధ్యనే, అంటే 15 లేక 16వ శతాబ్ది నాటివని. పై వాక్యాల తాత్పర్యం.

3. మార్కండేయ పురాణం :– ఇలా పురాణాల కాలాన్ని తమకు తోచినట్లు, కాకుల లెక్కల్లాగ నిర్ణయించుకు పోయారు, కాని యిలా ఏ మాత్రం ఊహకు కూడా అందదంలేదని 'మార్కండేయ పురాణం'గురించి "It is not easy to conjecture a date for this Purana. That it is subsequent is doubtful" అని వ్రాసారు. అంటే "ఈపురాణ కాలం ఇదమిత్థమని ఊహల కందదంలేదు. కాని అది ఇటీవలిదే అని అనటానికి అనుమానంగా ఉన్నదని తాత్పర్యం. ఇతర పురాణాల గురించి కూడా వీరి కాలనిర్ణయం, ఎంత అధ్వాన్నంగా ఉన్నదో మనకు నమ్మశక్యం కాదు కళ్ళతో చూస్తేనే గాని.

4. అగ్నిపురాణం :- "There is every probability that it dates long after the beginning of our Era" అగ్నిపురాణం గురించి ఎంత తెలివి తేటలగా కాలనిర్ణయం చేశారో చూడవచ్చు. ఈ అగ్నిపురాణం మన శకానికి క్రీ. శ. చాలాకాలం తరువాత వ్రాయబడిన దనడానికి ఎంతో సావకాశం ఉన్నది" అని భావం.

అసలు కొన్ని పురాణాలు కనీసం ఉన్నవా లేవా అని కూడా— అవేవో తెలియకుండా కూడా—వాటి కాలనిర్ణయం చేయటానికి సాహసించారు. ఇది చాలా అమానుషం.

ఉదాహరణకు:- భవిష్య పురాణం గురించి వీరి వాక్యాలు ఎంతో తెలివిగా ఉన్నాయి. "This Purana, as the name implied, should be a book foretelling what will be (భవిష్య)......... Whether such a work exists is doubtful" (Page—64): ఈపురాణం పేరునుబట్టి చూడగా (అనగా ఈ మహాశయుడు కనీసం పేజీఐన త్రిప్పిచూడకుండా ఈవాక్యాలు వ్రాస్తున్నాడన్నమాట!) జరుగబోయే భవిష్యత్తును గురించి వ్రాసిన గ్రంథం అయివుండాలి (భవిష్యం). అందులో విషయం జరుగనున్న కాలగతులను గురించి..........అసలు అటువంటి గ్రంథం ఉన్నదా ! అన్న విషయమే అనుమానాస్పదం.

ఇదీ స్థితి. కాల నిర్ణయం కోసం ప్రారంభించి కనీసం ఆ పుస్తకం ముఖమైనా చూడకుండా వాటి కాలాన్ని నిర్ణయించడం మాత్రమే కాకుండా అసలు ఆ పుస్తకాలే లేవనేటంతవరకూ వచ్చింది. యీ తెల్లదొరల భాషా ద్వేషం ! ఈ పాశ్చాత్య చరిత్రకారుడనబడె యీ మూర్ఖుడు "భవిష్య పురాణం" అన్న గ్రంథమే లేదని తాను నమ్మడానికి-మనలను నమ్మించడానికీ చూస్తున్నాడు. "భవిష్యపురాణం" నిజంగా ఉండడమే కాదు దాని మీద చాలా ప్రాచీనమయిన వ్యాఖ్యానాలు పూర్వపండితులచే వ్రాయబడినవి కూడా ఉన్నాయి. పైగా ఈ భవిష్యపురాణం * యీ తెల్లదొరల కాలంలోనే శిలాక్షర ప్రతులలో ముద్రించబడినది. వెంకటేశ్వర స్టీమ్‌ప్రెస్

---

Foot Note *చూ "Bhavishya Purana"—by Vedavyasa Publ ; Venkateswara Steam Press, Bombay.

బొంబాయి వారు దీన్ని ప్రచురించారు. భవిష్యత్తులో రాగల రాజుల చరిత్రంతా స్పష్టంగా వర్ణించి మన రాజులూ వారి కాలాలు అంతా విదృష్టంగా వర్ణించింది. మొగలాయిలూ తురుష్కులూ, ఇంగ్లీషువారి పరిపాలన. అందులో రాగల ప్రతీరాజు పేరూ వారి జీవిత చరిత్రలూ విపులంగా ఎవరూ కాదనలేని విధంగా ఒక "సాక్షిగ్రంధం" లాగ వివరించింది, "భవిష్యపురాణము."

ఈ భవిష్యపురాణం, విక్టోరియా మహారాణీ పరిపాలన, మతప్రవర్తలైన, బుద్ధ, క్రీస్తు, మహమ్మద్, శంకర, రామానుజాది మహాపురుషుల చరిత్రలతో కూడా 'చరిత్ర'లో భాగంగా, భవిష్యత్తును వర్ణించింది. అందుచేతనే ఇటువంటి "భవిష్య పురాణం" అన్నగ్రంధమే లేదని వాదించడం యీ తెల్లదొరలకు ఎంతో అవసరంగా కనిపించింది. అలా కాకపోతే నాడీ గ్రంథాలలో యీనాటికి పుట్టబోయే వ్యక్తుల జీవితాలు, తాటియాకు గ్రంథాలలో మహర్షులు రాసినవి, ఈనాటికీ లభ్యమయ్యేవాటినీ వాటిలో భాగమైన "భవిష్య పురాణం" లోని చరిత్రనూ ఇంగ్లీషువాడు తోసి వేయడం ఎలా ? అసలు ఇలాంటి అమూల్య గ్రంథాన్ని పెద్దఎత్తున కాని అవి అచ్చు పడకముందే తాళ పత్ర ప్రతులను వందలాది గ్రంథాలను తగులబెట్టారు *యీ క్రైస్తవ ఫాదరీలు. ఇది నా ఊహాగానమేమీకాదు వాళ్ల చరిత్రకారులే స్పష్టంగా దీన్ని పేర్కొన్నారు. పేర్కొనడమే కాకుండా యీ పని చాలా నీచమని ప్రపంచ సంస్కృతికే ద్రోహమని ఇంగితం కలిగివున్న కొందరు పాశ్చాత్య పండితులు మొత్తుకున్నారు. అందుకు వారివాక్యాలే నిదర్శనాలు—

"The Rev. Fathers, Jesuits, Francisians, Srangar Missions and other corporations unite with touching

harmony in India to accomplish a work of Vandlin, which it is right to denounce as well to the learned world as to orientalists. Every Manuscript, every Sanskrit work that falls into their hands, is immediately condemned and consigned to flames. Needless to say that the choice of these gentlemen always falls from preference upon those of highest antiquity, and whose authenticity may appear incontestable."

"Every new arrival receives a formal order, so as to impose of all that may fall into his hands. Happily, happily the Brahmins do not open to them the secret stores of their literary wealth, philosophic and religious."

**పురాణాలు - భారతదేశచరిత్ర :-** భారత భాగవతములలోనే కాకుండా అంతకంటే ప్రాచీనమయిన మన పురాణాలలో మనదేశాన్ని పరిపాలించిన అనేకమంది రాజులు, వారి పరిపాలనాకాలమూ కూడా వర్ణించబడినాయి. ఏరాజవంశం ఎన్ని సంవత్సరాలు పరిపాలించిందో, ఆ తరువాత దేశం ఎవరి పాలన క్రిందికి మారిందో. ఇలాగ ఒక్కొక్క రాజు పరిపాలనలో జరిగిన పొరపాట్లు, అధర్మమూ, అగచాట్లూ, లేదా ఏరాజు ధర్మంగా పరిపాలించాడో ఇలాటి విషయాలన్నీకూడా మనం పురాణాలలో

---

* (Vide Louise Jacolliot's "Bible Le Indi" and Mr. N. Chidambara Aiyer's 'Varahamihira's Brihat Samhita. English translation' Introduction P. 2 Foot note).

యీనాటికీ చూడవచ్చు. ఇందులోని 'చరిత్ర' తెల్లదొరల పాఠాలు వల్లించే హిందువులకు ఎందుకు కనిపించదో మరీ! ఆశ్చర్యం!

మనలో చాలామంది, భాగవతంలో పద్యాలు కమ్మగా చదివి ఆనందించడం వినేవుంటారు. అయితే అందరూ ఇందులో, కృష్ణుడి కథను తెలిపే "దశమస్కంధము" లాంటి కథాభాగాలమీదే ఉత్సాహంతో, చదువుతారు. కాని ఈపురాణాన్ని చారిత్రకదృష్టితో పరిశోధిస్తే ఇందులోఆశ్చర్యకర విషయాలెన్నోవున్నాయి. ఈ భాగవతం ఆఖరి స్కంధంలో (ద్వాదశ స్కంధము) మనదేశాన్ని పరిపాలించిన రాజుల "భవిష్యత్ చరిత్ర" ను శ్రీశుకుల వారినిపరీక్షిత్తు అడగగా భవిష్యత్తును దర్శించి రానున్న భావికాల గతులను చెప్తారు; ఇది మనలో చాలా కొద్దిమంది చదువుతారు. ఇదంతా కూడా సరైన మన జాతిచరిత్రని పునర్నిర్మాణం చేయడానికి పనికివస్తుంది.

దీన్ని ఆధారంచేసుకొని మనదేశచరిత్ర,అందులోనూహిందూరాజులు పరిపాలించిన కాలంనాటి "ప్రాచీన చరిత్ర"ను గనక పరిశీలించినట్లయితే, ఇంగ్లీషువారు మన గత చరిత్రని ఎంతగా తారుమారు చేశారో స్పష్టంగా తేలుతుంది మనకి-ఈనాటికైనా. ఈపని మన అసలుచరిత్ర-పూర్తిగా నాశనం కాకముందే యీ గ్రంథాలను రక్షించాలి; ఈ పరిశోధన జరగాలి.

యీ మహాశయులు, వాళ్లుచేసిన ఘనాగరాలను బైటపడకుండా మన చరిత్రలోని తేదీలు, చరిత్రకాలం — శతాబ్దాల తరబడి — మూకఉమ్మడిగా గల్లంతుచేసి,అది బయట పడుతుందన్నభయంతో యీ పురాణాలలో వ్రాయబడిన "భారతదేశ" చరిత్ర అంతాకూడా కేవలం కట్టుకథ అనీ, అసత్యం అనీ—అది, అసలు'చరిత్ర' అనడానికే వీలులేదనికూడా చారిత్రక వాదనలు లేవదీశారు! యీ వాదనలు, ఇలాగ లేవదీయడమే కాకుండా, వాళ్ల వ్రాసిన చరిత్రలనిండా పదేపదే, ఈ విషయమే మళ్లీ పాఠ్యగ్రంథాలలోనూ పునరుద్ఘా

టించారు. అదే మన భారతీయులచేత వల్లె వేయించారు. స్కూళ్లలోనూ కాలేజీలలోనూ. అవే యీనాడు మనకు నరనరాలా పాతుకుపోయినవి. కాని యిప్పటికయినా కాలం మించిపోలేదు. పురాణాలని పరిశోధించితే, మనకి "అసలుచరిత్ర' బయటకు చాలామటుకు రాగలదు. కాని ఆ ఆసక్తి ఏదీ! ఎంతసేపటికి ఆదొర ఏమన్నాడో, యీదొర ఏంరాశాడో, అదే అప్పజెప్పుతారు యీనాటికీ. "రీసెర్చి" చేస్తున్నామని చెప్పుకునేవారికి గూడా, యీ పరిశోధన చెయ్యటానికిగల సంస్కృతజ్ఞానంలేదు! గణితం, జ్యోతిష్యం, ఖగోళం—అసలే తెలియవు!! అందుకని ఆనాటి పురాణాలలో యివ్వబడిన కాలాలు, మన శకములతో 'జాతీయచరిత్ర' అనేది అసలే పైకిరాలేదు యీనాటికీ!

యింగ్లీషు చరిత్రకారులలాగ ఊహాగానంమీద ఆధారపడి కాకుండా స్పష్టంగా కంటికి కనిపించే ఆనాటి తిథి వార, నక్షత్రాల వివరాలతో సహా గ్రహస్థితుల ఆధారంతో ఇవ్వబడివున్నాయి. ఇంగ్లీషు చరిత్రకారులూ వారి మానసపుత్రులూ వ్రాసిన చరిత్రగనక మనం చదివితే, అది ఇలాటి నిర్దుష్టమయిన వైజ్ఞానిక విషయాలమీద (Scientific Basis) కాలనిర్ణయం ఆధారపడిలేదు. వాళ్ల ఊహాజనితమైన నిర్ణయాలే అన్నింటా కనబడుతూవుంటాయి నిర్దుష్టంగ చూపగల ఆధారంలేని యీ తప్పుడుచరిత్రకూ, కాలనిర్ణయానికీ, కావలసిన గణితం చేయటానికి పనికొచ్చే వివరాలు ఎలాగ యివ్వగలరు ఈ తెల్లదొరలు?

ఇక పోతే, యీ భాగవతం, ద్వాదశస్కంధంలో యిచ్చిన అంకెలేమిటి? అన్నది, వచ్చే అధ్యాయాలలో వివరంగా యిస్తాను. ప్రస్తుతం మాత్రం "మన పురాణాలు చారిత్రక గ్రంథాలు" అన్నదే, విషయం. ఇది మహాభారతంగానీ సంస్కృత భాగవతంలో గాని, ఇంకా యితర పురాణాల్లోని రాజవంశచరిత్రగనక చూస్తే తేలిగ్గా ఋజువు అవుతుంది. భారతీయులకి,

చరిత్ర వ్రాయడం రాదనీన్నీ, మనకొక నిర్దుష్టమైన చారిత్రక జ్ఞానంకూడా లేదనీన్నీ చెప్పే యీ కుటిలవాదానికి సత్యంగా ఎంతఆధారంవుందో మనకి తేలికగా తెలుస్తుంది.

**భారతీయులకి చరిత్ర లేదు:-** భారతీయులకి చరిత్ర అంటేనే తెలియదు! చరిత్ర అనేది నిర్దుష్టంగా వ్రాయటమనేది మనకి, గ్రీకులూ ఇతర పశ్చిమ జాతులూ భారతదేశానికివచ్చి పెట్టిన భిక్ష. అంతవరకూ పురాణాలూ కథలూ తప్ప అసలు చరిత్ర అని చెప్పుకోతగ్గదిలేదు. అని మెకాలే, స్మిత్, జోన్సూ, హాల్వైద్‌లాంటి మొట్టమొదటి పాశ్చాత్య చరిత్రకారులు, నిశ్చయమైన నిర్ధారణతోనే మన చరిత్ర రాయటంప్రారంభించారు. అవే మాటలు పుస్తకాల్లోకిఎక్కి పాఠ్యగ్రంథాలలోకి ఎక్కి యీనాటికీ మంత్రాలలాగ మన హిస్టరీ టీచర్లకీ యూనివర్సిటీలోని 'చరిత్ర 'డిపార్టు మెంటులోని ప్రజలకీ గంజాయిలా తలకెక్కి కూర్చున్నది—పైవాదం. అసలు యీ తెల్లదొరల అపవాదు ఎంత వరకూనిజం ? అని చెప్పి మన ప్రాచీనగ్రంథాలలో చరిత్ర గురించి ఏమివున్నదో చూద్దామనికూడా మన ప్రొఫెసర్లకీ లెక్చరర్లకీ (ఏ ఒకరో ఇద్దరో అక్కడక్కడ వుంటేవుండవచ్చు!) ఆసక్తి శూన్యం !! వున్నా సంస్కృతం రాదు చాలామందికి. మన సంస్కృత పండితుల కందామా-కాళిదాసు పద్యాలూ పంచకావ్యాలూ వల్లెవేయించినవే-నెమరువేస్తూ, గ్రామఫోను రికార్డులాగ అవేఅవేవిషయాలు ఉపన్యాసాలలోనూ ఏకరువు పెడదామనేగాని - క్రొత్త గ్రంథాలు చుద్దామనీ చారిత్రక పరిశోధన చేద్దామనీ, ఈసుఖవంతులకి కుతూహలం కూడాలేదు!

అయితే అసలు నిజంగా మన దేశచరిత్రని యథాతథంగా-అంటే తెల్లదొరల కల్పనలూ స్వంతపైత్యాలూ లేకుండా మన పూర్వశాస్త్రాలలో పురాణాలలోనూ భారత వర్షచరిత్ర అంటూ వ్రాయడానికేమన్నావుందా:అని

మీరడగవచ్చు. "నిశ్చయంగావున్నది". దానికిపూనుకునేవ్యక్తులు ఉత్సాహ వంతులూ సాహసంగల యువకులు (మా ప్రొఫెసరు ఏమనుకుంటారో, తోటి చరిత్రక పరిశోధకుల ప్రాప్తి పోతుందేమోనని సందేహపడే'బృహన్నల'లకాదు) యీపనికి తలపడితే కావలసినంత చరిత్ర వస్తువూ సాహిత్యం,ముద్రితమూ,అముద్రితమూ, (ఇంకా తాటియాకులగ్రంథాలలో శిథిలించి పోతున్నది) చాలా పరిశోధనా వస్తువు ఎంతో చరిత్ర రాయడానికి ఉన్నది.

ప్రాచీన భారతీయ చారిత్రక గ్రంథాలు :- ప్రాచీన భారతీయ విద్యలలో వేదాలు పురాణాలూ, ఆరవె నాలుగు కళలతోబాటు "ఇతిహాసం" (History) అన్న శాస్త్రం స్పష్టంగా పేర్కొనబడింది 'ముండకోపనిషత్తు, లోనూ ఇతర ప్రాచీన సంస్కృత గ్రంథాలలోనూకూడా. దీన్ని బట్టి విదేశీయుల దండయాత్రలలో అనేకగ్రంథాలు తగుల పెట్టి, కొన్ని ఎత్తుకు పోకముందు, 'ఇతిహాసం' అన్న 'సబ్జక్టు' యీనాటి 'హిస్టరీ' డిపార్టు మెంటులాంటిదే. ఒకటి, వుండినట్లు తెలుస్తుంది.భారతాన్ని ఒక 'ఇతిహాసం' అని అందులోనే, వేదవ్యాసమహర్షి వర్ణించాడు. రామాయణం ఇతిహాసిక కావ్యం.-అంటే ఒక చరిత్రలో జరిగిన సంఘటనని ఆధారంచేసుకుని వ్రాసిన కవిత్వగ్రంథం. అందులోనూ విశ్వశ్రేయస్సు దృష్టిలోపెట్టుకుని* ఒక ఋషి అయినవాడు×రాసేనే-దాన్ని కావ్యం అనేవారు,ప్రతీవాడూ పేరుకో పొట్టకూటికో, రాసిపారేసే ఈనాటి 'కావ్యాలూ' 'మహాకవులూ' లాగకాదు.

అయితే "ఈ భారతం, చరిత్ర రాసేందుకెలాగ ఉపయోగపడుతుంది" అని మీరడగవచ్చు. సూక్ష్మంగా మనకి సంస్కృత భారతం మూలంనుంచి యీ క్రింది విషయాలు తెలుసుకోవచ్చు. అవి ఏవంటే :—

I మహాభారత యుద్ధం అనేది, ఒక "ప్రపంచయుద్ధం".

---

Foot Note: * "విశ్వశ్రేయః కావ్యం" అని కావ్యం నిర్వచనం.

x "నానృషిః కురుతే కావ్యం.

II అందులో క్రిందటి ప్రపంచయుద్ధం (World War) లోలాగే భయం కరమైన జననష్టం కలిగింది.

III ఈ మహాయుద్ధంలో శ్రీకృష్ణుడు శాంతిదూతగా తన రాయబారం విఫలంకాగా, తటస్థవిధానాన్ని అవలంబించి ఆయుధాలు విసర్జించి నిష్పాక్షికంగా తన సేనలొకపక్షనా — తానింకొకపక్క (యుద్ధంచేయకుండా) వుండిపోయాడు.

IV అనేక దేశాలసేనలు అందులో పాల్గొన్నాయి.

V ఆ భయంకర సంగ్రామం జరిగినకాలానికి వున్న ఖగోళ విషయాలు గ్రహగతులు, నక్షత్రస్థితి, వివరంగా మహాభారతంలో యివ్వబడ్డాయి.

VI శ్రీకృష్ణుడు రాయబారం తీసుకువెళ్ళిననాటి తిధి, వార, నక్షత్రాలు గణితంతో సరిపోతాయి.

VII శ్రీకృష్ణుడు జన్మ, నిర్యాణం, పరీక్షిత్తు పట్టాభిషేకం, ఇలాటి విషయాలు గ్రహ, నక్షత్ర విషయికమైన ఖగోళ వైజ్ఞానిక సత్యాలు (Scientificfacts) మనకి దొరుకుతాయి.

ఇంకా అనేక అంశాలు భారతదేశచరిత్రకి మూలస్తంభం లాంటివెన్నో "మహాభారతం"లో వున్నాయి. 'కలియుగం' ఆరంభమే నవీన చరిత్ర మొదలుపెట్టే, మైలురాయి. అది యీ భారతమే ఆధారంగా గల, చారిత్రక వస్తువు. ఇంకా ఎన్నో విషయాలు వేరే అధ్యాయంలో—మహాభారతా'నికి సంబంధించినవి-వివరించాను.

మహాభారతం క్రీస్తుకు 3138 సం॥లకు పూర్వం జరిగిందని అంగీకరించడానికి పాశ్చాత్య చరిత్రకారులకు చాలా బాధగా వుంటుంది. క్రీస్తుకు పూర్వం 4000 సం॥ల నాడు ఈ సృష్టిఅంతా జరిగిందని మూఢంగా నమ్మే బైబిల(Bible) వాదానికి ఈ భారతకాలం అడ్డువస్తుందని ఈ విధంగా కాలాన్ని తారుమారు చేశారు.ఇవి Sir William Jones, Halhead (సర్ విలియం జోన్స్, హాల్ హెడ్) మొదలైన పాశ్చాత్యుల రచనలు చూస్తే స్పష్టంగా తెలుస్తుంది. జ్యోతిశ్శాస్త్రం ఒక సైన్సు. ఆ లెక్కలతో పురాణాలలోని కాలం సరిపోతున్నది. అంతేకాక పురాణాలలోని చరిత్ర యదార్థమని తెలిపే పై శాసనాలుగూడా మనదేశచరిత్ర ప్రాచీనతనే ఋజువు చేస్తున్నాయి. అటువంటప్పుడు పైనిర్ధారణకు వ్యతిరేకంగా వున్న క్రైస్తవ పాదరీల ఊహాగానాలను, బుట్టదాఖలు చేయవలసివుంది. ఈ కాల నిర్ణయం విదేశీయులైన ఇతర చరిత్రకారు లందరూ (తెల్లదొరలుతప్ప!) అంగీకరించినదే.

"హరవిలాసశారద" అనే చరిత్రకారుడు మన చరిత్ర ప్రాచీనత గూర్చి ఈ విధంగా రాస్తున్నాడు. "That these Bactrian Kings were Hindus, is now universally admitted. * Thus accor_ding to Dabistan, India enjoyed splendid civilization 6000 B. c. (i. e.) nearly 8000 years before the Victorian Age." అంటే బాక్ట్రియాను పరిపాలించిన రాజులు హిందువులన్న విషయం అందరికి తెలిసినదే. 'దబిస్తాన్' పట్టికను ఆధారంగాచూస్తే భారతదేశం 6000 B. C. నాటికే గొప్ప సంస్కృతిని కలిగివున్నట్లు తెలుస్తోంది. అనగా. విక్టోరియా పాలనకు పూర్వం 8000 సం॥ల నాడు అన్నమాట." **

---

* చూ. 'Theogony of the Hindus'— (P. 134) by Count Bjornstjerna

** 'హిందూ సుపీరియారిటీ' (The Hindu Superiority by Haravilas Sarada. P. 6)

3) పై తేదీని లెక్కవేయడానికి పురాణాలలో ఆనాటి గ్రహగతులు, కాలమానాలు కూడా ఇవ్వబడినాయి. మేషరాశిలో ఎనిమిది గ్రహములు కలిసినరోజునే కృష్ణనిర్యాణము కలియుగ ప్రవేశమూ జరిగింది.

పైన చెప్పిన చారిత్రక విషయాలు, పురాణాలవల్ల ఈనాడు మనకు లభ్యమౌతున్నవి. ఈ పురాణాలు సరైన చరిత్ర కాదని విదేశీయులు: విదేశీయుల మానసపుత్రులూ, ఈ నాటికీ మనచరిత్ర పుస్తకాలలో ప్రచారం చేస్తున్నారు. దీనికి వీరు చెప్పేది విచిత్రమయిన వాదం. ఈ కలికాలానికి లేదా అసలు మహాభారతంలోని రాజుల కాలాన్ని, ఋజువుచేసే శాసనాలు కాని, ఇతర చారిత్రక ద్రవ్యకాలుకాని దొరికితేనే తప్ప పై పురాణ విషయాలు నిర్దుష్టమైన చరిత్రగా భావించటానికి వీలులేదని వీరిభావం.

ఐహోల్ (Aihole)వద్ద దొరికిన ఒక శాసనంలో ఈ"కలియుగము" మొదలుఅని తెలిపే కాలానికి చారిత్రక ఆధారం దొరికింది. ఇవన్నీగాక జనమేజయుడు 'సర్పయాగం' చేసిన సమయంలో ఆయన చేసిన దాన శాసనం మైసూరులో దొరికింది. ఇటువంటిదే 'సిఖరపూర్‌శాసనం.' అది జనమేజయుడు దక్షిణ దిగ్విజయం చేసినప్పుడు చేసిన దానశాసనం కూడా వున్నవి. ఇంతకంటె చారిత్రక ఋజువులేం కావాలి ? దీన్నిబట్టి ఐహోల్ శాసన కాలానికే వాడుకలో నున్న "కృష్ణనిర్యాణశకం" చారిత్రకమైనదన్న ధృవపడుతున్నది.

4) ఇంతేగాక పరీక్షిత్తు కొడుకైన జనమేజయ మహారాజు సర్ప యాగం చేసినట్లు మహాభారతంలో వర్ణించబడివున్నదికూడా! ఈజనమేజ యుడు చేసిన దానశాసనం ఇంకొకటికూడా దొరికింది. దీనిలో సీతారామా లయంలోని పూజనిమిత్తం అనేక మునులకని మునిబృందక్షేత్రంలో దానం చేయబడినట్లు తెలిపే వివరాలుకూడా అందులో దొరికినాయి. ఈ దానశాసనా లన్నిటినీ,బట్టి చూడగా ఈ జనమేజయ మహారాజు కలియుగం 89వ. సంవ త్సరంలో పరిపాలించినట్లుగా ఋజువు పరుస్తున్నాయి.

5) ఈ జనమేజయుడు సర్పయాగం చేసినట్లు వర్ణించిన కథలు చారిత్రకంగా నిరూపించే ఆధారాలుకూడా మైసూరురాష్ట్రంలో "తీర్థహళ్ళి" అనే ప్రదేశం దగ్గర దొరికిన ఇతర శాసనాలవల్లకూడా తెలుస్తున్నది. ఇవి జనమేజయ మహారాజు సర్పయాగ సమయంలో శ్రోత్రియ బ్రాహ్మణుల నిమిత్తం దానం చేసినట్టుగా ఈ శాసనాలు తెలుపుతున్నాయి.

మహాభారత రామాయణాలే కాకుండా మన దేశచరిత్రని పూర్తిగా వర్ణించిన పురాణాలు చాలా వున్నాయి, అందులో మనదేశాన్ని పాలించిన రాజుల పేర్లూ కాలాలూ విపులంగా "భవిష్యద్రాజేతిహాసం" అన్న అధ్యాయంగా రాసిపెట్టి వున్నాయి. అలాంటివి, బ్రహ్మాండపురాణం, మత్స్యపురాణం, వాయుపురాణం, యుగపురాణం గర్గసంహిత, భవిష్యోత్తరపురాణం, విష్ణుపురాణం, ఇత్యాది సంస్కృత గ్రంథాలే కాకుండా 'భవిష్యపురాణం' అని ప్రత్యేకం, కాలంలోని భవిష్యత్తుమీదే, ఒకపురాణం వున్నది (దీని వివరాలు తర్వాత అధ్యాయాలలో ఇచ్చాను)—ఇవన్నీ కేవలం చరిత్ర అంతటినీ తెలిపే సాహిత్యం.

ఇవేకాక దేశంలో వేరే వేరే ప్రాంతాలలోని చరిత్ర—అంటే "నేపాలరాజ వంశావళి"(History of Nepal) "కాశ్మీర రాజుల చరిత్ర" కల్హణుడు వ్రాసినది—గ్రంథాలు, రాజుల వంశవృక్షాలూ చాలావున్నాయి. అందులో కొన్ని మాత్రం, క్రింద ఉదహరిస్తున్నాను:—

1. నేపాలరాజ వంశావళి
2. కల్హణుడి "రాజతరంగిణి"
3. 'కచ్‌నామా ('కచ్' లేక సింధ్ చరిత్ర)
4. "కలియుగ రాజవృత్తాంతం" (సంస్కృత ప్రాచీనగ్రంథం)
5. జైనుల పట్‌వల్లి

6. మఠముల(శంకర, రామానుజమఠాల,) గురుపరంపర చరిత్ర తెలిపే రికార్డులు

7. తామ్రశాసనాలు (అందే 'జనమేజయుడు 'సర్పయాగం'' చేసినప్పుడిచ్చిన' మైసూరుశాసనం వంటివి)

8. ప్రశస్తి శ్లోకాలూ-కావ్యాలు (హరిసేనుడు అనే కవి సముద్ర గుప్త చక్రవర్తి చేసిన దిగ్విజయాలనుగూర్చి అలహాబాదు స్తంభం మీద వ్రాసిన ప్రశస్తి శ్లోకాలవంటివి)

9. సమకాలిక కవులురాసిన రాజులచరిత్రలు :-

(a) బాణభట్టు వ్రాసిన - ''హర్షచరిత్రలాగ''

10. ''దబిస్తాన్ పట్టిక'' (Dabistan document). ఇది ప్రాచీనంగా మనదేశంలో వుంటూవున్న ఏక రాజుల లిస్టు. ఇది అతి ప్రాచీన మనిచెప్పి సర్ విలియం జోన్సు (Sir William Jones) తనతోబాటు ఇంగ్లండు తీసికెళ్ళిపోయాడు. అది తర్వాత చరిత్రలో బైటకిరాలేదు, ఇంతవరకూ. పైగా జోన్సు తను రాసిన భారతీయరాజుల చరిత్రవ్యాసాలలో మన ప్రాచీనరాజుల చరిత్ర - 5400 సం॥లు నడిచిన జాతీయ చరిత్రని 2000 సం॥లకు తగ్గించి వ్రాశాడు. అందులోనే బైబిలులోని కాలానికి సరిపడేట్టు మనదేశ చరిత్రని తగ్గించి రాశానని ఆయనే అంగీకరించాడు.!! కాని ఆ తేదీలను ఇంతవరకూ సరిచెయ్యాలని మన దేశీయులు ప్రయత్నం చెయ్యలేదు. ఆ''దబిస్తాన్'' పట్టికలోని ఎక్కడా వివరాలు బయట పెట్టలేదు యీ జోన్సు మహాశయుడు.

11. ప్రాచీనరాజవంశవృక్షాలు-వ్రాతప్రతి గ్రంథాలుఉదాహరణకు:

(a) 'గఢ్వాల్' రాజవంశము—అల్మోరా చరిత్ర

(b) కాశ్మీర్ రాజవంశవృక్షం—కాశ్మీర్ దేశచరిత్ర

(c) బికనీర్ రాజవంశవృక్షం — బికనీర్ చరిత్ర

(d) నేపాలరాజుల వంశవృక్షం — నేపాల్ చరిత్ర

(e) త్రిగర్త రాజుల వంశపట్టిక - త్రిగర్త చరిత్ర

(f) రాజపుత్రస్థాన్ రాణాల వంశవృక్షం - రాజస్థాన్

(g) కామరూప రాజవంశావళి - అస్సాం దేశం,

(h) మగధ రాజుల వంశావళి — వంటివి ఇంకాఎన్నో. దేశంలో మూల మూలలా తాళపత్రాల(తాటియాకుల) పుస్తకాలలోనూ, ప్రాచీన సంస్థానాధిపతుల మహల్‌లలోని భాండాగారాలలోనూ, ఇంకా చాలా వున్నాయి. వీటి కోసంఒక "జాతీయ-చరిత్రపరిశోధకసంస్థ" (National History-Research Survey) ఏర్పడాలి. అప్పుడుగాని మైసూరు వడయర్‌లు, కేరళ మార్తాండ వర్మ, విజయనగర రాజవంశావళి వంటివి అనేకచోట్ల-బరోడా, గోండాల్, పాటియాలా,చిత్తోడ్ సంస్థానాల భాండాగారాలలోనూ చరిత్రకు పనికివచ్చే సాహిత్యం బండకొద్దీ వున్నది. ఇదంతా చరిత్రకి పనికివచ్చేదే-భారతీయ చరిత్ర గ్రంథాలే!

వీటిని గురించి ఎవరైనా పట్టించుకున్నారా? ఇన్ని యూనివర్సిటీ (University)లూ,చారిత్రకపరిశోధనాకేంద్రాలు(Historical Research Societies)ఎన్నో వున్నా వాళ్ళలో ఎవరూ ఈపనికి పూనుకోరు. కారణం 'భారతీయులకు చరిత్రఅన్నదే లేదు'. అన్న తెల్లదొరల చప్పుమందు మన చరిత్రఅధ్యాపకులకు శతాబ్దం పైగా నరనరాలా జీర్ణించుకుపోయివుండడమే.

వీనికి ధైర్యం సాహసంగల, యువతరంలోని చారిత్రక పరిశోధకులు కావాలి. వీరు, జాతీయత అన్నా, మనజాతి నిజమైన చరిత్రని వెలికితీయడం అన్నా, దేశానికి సేవ అన్నదృష్టితో పనిచేయాలి. విదేశాలని అనుకరించే మన ప్రభుత్వంగాని విజాతికిచెందిన యువకులవల్లాబూజు పట్టిన యంత్రాంవల్లా అయ్యేపనికాదు. పరిశోధనకు చాలా సామాగ్రి వున్నది. లేనిది 'శ్రద్ధ శ్రమ'...ఇవే లోపించినాయి అని ఋజువు చేయడానికింతకంటె ఆధారాలేం కావాలి, మనకి?

# ఆర్యులు భారతీయులా - పాశ్చాత్యులా ?

ఇంతవరకూ మనస్కూళ్ళలోనూ కళాశాలల్లోనూ బోధించే చరిత్ర (History) పుస్తకాలు, ఆర్యులగురించి పాశ్చాత్యులు రాసే అనేక తప్పుడు విషయాలతో ఏవిధంగానిండిఉన్నాయో 3వఅధ్యాయంలోసూక్ష్మంగాతెలుసుకున్నాం. సామాన్యంగాఆర్యులతో భారతదేశచరిత్రని మొదలుపెట్టాలి. కాని అంతకు ముందే ఆదిమజాతి లేక 'ఆదిమ నివాసులు' వేరే ఉన్నట్లుగా ఒక అభూతకల్పన చేయబడింది. దీనికి కారణం బ్రిటిష్ చరిత్రకారులు మనకు నూరిపోసిన'ఆర్యుల దండయాత్ర' (Aryan Invasion) అన్న కట్టుకథయే.

ఈనాటికీ ఈ తప్పుడు చరిత్రే చదువుకుంటూన్న చరిత్రకారులూ, అనేక మంది ప్రొఫెసర్లూ కూడా ఈ "ఆర్యుల దండయాత్ర" అన్న విషయాన్ని గుడ్డిగా అనుసరిస్తున్నారు. అసలు "ఆర్యుల దండయాత్ర" అంటూ ఒకటి, నిజంగా జరిగిందా ? అన్న విషయమైనా వీళ్ళు కొంచెం కూడా స్వంతంగా ఆలోచించే ప్రయత్నం చేయకపోవడం ఎంతో శోచనీయం.

## ఆర్యుల దండయాత్రకు, చరిత్రలో ఆధారాలున్నవా ?

ఈ ప్రశ్న మనదేశచరిత్ర మొట్టమొదటే ప్రతిభారతీయుడూ వేయవలసిన అవసరమున్నది. ఎందువల్లంటే, ఎక్కడా ఆర్యులు భారతదేశంలోకి బయటనుండి వచ్చినట్టుగా ఋజువుచేసే శాసనాలుగాని, పురావస్తు విశేషాలుగాని, ఇతర ఏచారిత్రకఆధారాలుకాని లేవు!! ఇలాలేకపోవటాన్నిబట్టిచూస్తే ఈ 'ఆర్యుల దండయాత్ర' అనేది ఒక కథ, విదేశీ చరిత్రకారుల అభూత

కల్పన, అనితేలుతుంది. ఆర్యులు భారతీయులా కాదా, అన్న విషయం ఇక్కడ పరిశీలించుదాం. భారతీయ సంస్కృతికి, ఆర్యులసంస్కృతి విదేశీయ మని, లేక భిన్నమైనదని తెలిపే అంశాలు (ఇంగ్లీషువాళ్ల నాగరికతకూ వేదాల ధర్మానికి మధ్యన గల భేదంలాగ) ఏమైనా వున్నాయా? అని గమ నిద్దాం:-

(1) ఆర్యుల సంస్కృతి మొత్తం, యీనాడు మనకి తెలిపే ఏకైక ఆధారం "వేదాలు". ఈ వేదాలలో ఎక్కడా తాము బయటనుంచి వచ్చినట్లు గానీ, తాము పరదేశీయులమని గాని, ఈ 'ఆర్యులు' తెలుపుకోలేదు. మనకి అనాదిగావస్తున్న వేద ధర్మానికి ఆర్యధర్మానికి తేడాలేదని అందరికీ తెలిసిందే

(2) ఇలా తెలుపుకోటానికి గల మొదటి కారణం: ఆర్యులు భార తీయులేఅయి వుండడం.

(3) ఇక రెండవ కారణం: 'ఆర్యులు'-అంటూ ఒక 'జాతి' విడిగా ఎక్కడా ఉండి ఉండలేదు-అన్న సత్యం. అందుకే ఆర్యులు అనేవాళ్లువేరే ఒక జాతికాదు, ఇంగ్లీషు వాళ్లలాగ! కాబట్టి వారికి వేరే విదేశాలనుంచివచ్చి వలసరాజ్యం స్థాపించటం అనేదికూడా జరగలేదు. ఆర్యంభాష మొట్టమొదటి నుంచీ "దేవభాష" అని ఆర్యులే పిలిచిన సంస్కృతం. అది లన్నిభాషల కంటే ఈనాడు అతి ప్రాచీనమైన భాష, అన్నవిషయం మాక్స్‌ముల్లరు, జాకోబి (Jacobi) వంటి విదేశీయులే ఒప్పుకున్నారు!

(4) వేదాలలో ఎక్కడా ఆర్యులు బయటదేశాలనించి వచ్చినట్టూ తాము ఒకప్రత్యేక జాతి అనిగాని ఇంగ్లీషువాళ్లు, మొగలులు, గ్రీకులూ వ్రాసుకున్నట్టు, వారికి యీదేశంకన్న వేరే సంస్కృతిగాని మతంగాని వున్నట్టు వ్రాయలేదు. అంతేగాక హిందూదేశాన్ని, ఇందులోని గంగని హిమాలయాలనూ వర్ణిస్తూ వ్రాసిన మంత్రాలు, విదేశీయులం రాశ లను కోటానికి వీల్లేదు.

(5) ఆర్యులకీ ద్రావిడులకీ యుద్ధాలు జరిగినట్టు విదేశీ చరిత్రకారుల రాజకీయ ప్రయోజనాలకై కల్పించిన కట్టుకథ, చరిత్రకాదు. అది చరిత్ర గ్రంథాలనుంచి తొలగించవలసివుంది.

(6) రామాయణం వంటి పవిత్ర ఆధ్యాత్మిక గ్రంథాలు ఋషి ప్రోక్తమైన దివ్యగాథలు: వీటిని యిలా ఆర్య-ద్రావిడ యుద్ధాలుగా ఊహించటం ఒకరోగం. అంతేగాని దానికి, రామాయణంలో ఎక్కడా కొంచెం కూడా ఆధారం లేదు. పైగా ఆర్య సంస్కృతి * స్వాయంభువ మనువు కొడుకుల పరిపాలన, వలస ద్వారా, అన్నిఖండాలలోనూ వ్యాపించినట్టు చారిత్రక ఋజువులు వున్నాయి.

(7) పై చెప్పిన విషయాలేగాక ఎవరైనా విదేశీయులు గనక యీ దేశపు హిందూ సాంప్రదాయాలను గమనించినట్టయితే దానికి ఆయువుపట్టు లాంటి మూల సూత్రాలు కేవలం భారతీయజాతి లక్షణాలే. అందులోఎక్కడా పరదేశ మనస్తత్వం కనపడదు. అటువంటి. ఆర్యసంస్కృతి భారతజాతికి పిత్రార్జితం అనడానికి యీ క్రింద నిదర్శనాలే చాలు. యీక్రిందివిషయాలు భారతీయ సంస్కృతిలోనే తప్ప, మరి ఏ యితర పరదేశ సంస్కృతిలోనూ కనపడని నగ్నసత్యాలు. అవి ఏవంటే—

(a) వివాహం పవిత్రత.

(b) భార్యా భర్తలబంధం, యావజ్జీవితం విడదీయరాని ఆధ్యాత్మిక ధర్మబంధం.

(c) మనుష్యులకి పూర్వజన్మ-రాబోయేజన్మ ఒకటుందని విశ్వాసం.

(d) మనిషి ఒక జన్మలోనే చేసిన కర్మని మళ్లీ వచ్చే జన్మలో అనుభవిస్తాడనే "కర్మ సిద్ధాంతం" భారతీయులదే.

(e) తను చేసినకర్మ తానే అనుభవించాల్సివుంది కాబట్టి, ధర్మాన్ని ఆచరిస్తే పుణ్యం వస్తుందన్న సిద్ధాంతంకూడా భారతీయు లకు తప్ప, మరోజాతికి లేదు.

---

* చూ "Cradle of Indian History"
—by C. R. Krishnamacharlu.
(Govt. Epigraphist of India-1947)

(f) ఈ ప్రపంచం — ఒక సృష్టికర్త సంకల్పంతో పంచభూతాల కలయికతో—ఏర్పడింది. ఆ సృష్టికర్త 'బ్రహ్మ'-అన్న సత్యం వేదాలలోనూ పురాణాల లోనూ కనబడుతున్నదే; భారతజాతి లోనూ యుగ యుగాలుగా జీర్ణించి ఉండటం.

(g) ప్రపంచంలో పాపం ఎక్కువైనప్పుడు భగవంతుడి అవతారం భూమికి ధర్మం స్థాపించడానికి వస్తుందన్న ఆర్యసిద్ధాంతం భారత దేశంలోదే.

(h) ఎందువల్లనంటే, దేవుని అవతారాలన్నీ భారత దేశంలోనే జరిగి నట్లు ఈ ఆర్యుల సాహిత్యం తెలుపుతున్నది.

(i) ఆర్యులే గనక పరదేశస్థులైతే భారత దేశాన్ని ఉత్తమంగా' కర్మ భూమిగా' నిరూపించే అంశాలు వేదాలలోవుండటం అసంభవం;

(j) పైన చెప్పిన అన్ని / అంశాలను బట్టి చూస్తే వేదాలు భార తీయులవేనని తెలుస్తుంది.

(k) అంతేగాక ఈ వేదసాహిత్యం అంతా భారతదేశం గడ్డమీదే ఉద్భవించింది. ఈ విషయం వేదాలలోనూ, పురాణాలలోనూ భారతదేశం గురించిన * దేశభక్తి గీతాలను చూస్తే, స్పష్టంగా తెలుస్తుంది.

(l) భారత దేశంలోఉన్న హిమాలయపర్వతాలు, గంగానదియమునా సరస్వతి, బ్రహ్మపుత్రానది, బ్రహ్మవర్తం అనేభూమియివన్నీకూడాభారత దేశంలో ఉండటమేగాక వేదమంత్రాలలోకూడా, యీ పేర్లు ఉండటంవల్లా యీవేదాలు భారతీయులురాసినవేనని తెల్లదొరలకుకూడా లేటతెల్లంకాగలదు. పై కారణాలవల్ల ఆర్యులనేటటువంటి జాతి, అసలు లేదని భారతదేశానికి దండయాత్ర రావటమనేది అసంభవమైన కట్టుకథని మనకు స్పష్టంగా

* "ధన్యాశ్చయే భారత భూమి భాగే"
["భారతదేశంలో జన్మించిన వారు, ధన్యులుగదా"-పరాశరముని. చూ. 'విష్ణుపురాణం']

తెలుస్తున్నది. అందువల్ల మనదేశ చరిత్రలో యిటువంటి తప్పుడు వ్రాతలు ప్రచార అధ్యాయాలు తీసివేయాలి. అప్పుడే అది అసలైన భారతదేశచరిత్ర అవుతుంది. అంతవరకూ అది మనదేశ చరిత్రకాదు. మనచరిత్ర అని నెత్తిమీద రుద్దిన, విదేశీయుల చరిత్ర మాత్రమే.

## నిజమైన 'భారతీయ చరిత్ర' :—

ఈనాడు మనం మనజాతియొక్క నిజమైన 'చరిత్ర' తెలుసుకోవాలంటే వేదాంగాలలో ఒకటైన "ఇతిహాసం" అనబడే చారిత్రక సాహిత్యాన్ని చదువుకోవాలి. ఆ చదువుకునేటప్పుడు మన సొంతభావాలు, ఊహలూ, అపోహలూ, ఒకప్రక్కన పెట్టి పురాణాలలో, ఇతిహాసాలలో యివ్వబడిన అంశాలు శోధిస్తూ నేర్చుకోవాలి. ఈపురాణాలలోని చరిత్రలో ప్రతి భారతీయుడూ గుర్తు పెట్టుకోవాల్సిన కొన్ని ముఖ్యమైనవి ఉన్నాయి అవి :—

1) భూమిమీద కొన్నివేల సంవత్సరాలు గడచినప్పుడు అనేకమైన ఖగోళపు మార్పులు జరుగుతాయి.

2) అటువంటి మార్పులవల్ల సముద్రాలు, భూమ్మీది ఖండాలు, నదులు ప్రవహించే బాటలూ, అన్నీకూడా తారుమారయి మారిపోతాయి.

3) అందువల్ల అతి ప్రాచీనమైన చారిత్రకగాథలను మన పురాణాలు వర్ణించాయి గనక, ఆ యా భాగాలు చదివినప్పుడు ఆకాలంనాటి మార్పులు గమనించుకుంటూ అర్థంచేసుకోవాలి. లేకపోతే ఈనాటి దేశపటానికీ—పూర్వపు ప్రపంచ స్థితికీ చాలా మార్పు ఉంటుంది.

పై విషయాలను గమనించకుండా రామాయణ భారతాలు చదివి, కొందరు ప్రబుద్ధులు మనపూర్వీకులకు జాగ్రఫీ రాదని, ప్రాచీనులు భూమి బల్లపరుపుగా ఉంటుందని నమ్మేవారని అర్థంలేని-వ్రాతలు వ్రాయడం మనం చూస్తున్నాం. యిది-పరిశోధనాబుద్ధి లేకుండా పురాణగాథలు చదివి మిడిమిడి జ్ఞానంతో రాసేరాతలు తెచ్చేఅనర్థం. ఉదాహరణకు రామాయణంతీసుకుందాం.

రామాయణంలో రావణాసురుడు నివసించే "లంక" వర్ణించబడివుంది. అది సింహళం కాదు-అని ఆవర్ణనలు ఏమాత్రం జాగ్రత్తగా చదివినా,చిన్నహై స్కూలు విద్యార్థికికూడా తెలిసిపోతుంది. ఐనాగాని చరిత్రకారులు రావణాసుర లంక సింహళం లేక సిలోన్ అని భావిస్తూనే ఉంటారు. అలాగే రాస్తారుకూడా. కన్యాకుమారి నుంచి నూరుయోజనాలు సముద్రం వ్యాపించి, అది దాటింతర్వాతే రావణాసుర లంక వస్తుందని రామాయణం చెప్తోంది. ఇది దాదాపు భూమధ్య రేఖకు సమీపంలో ఉండి అక్కడనుంచి దక్షిణంగా వ్యాపించిన ఒక భూఖండం. అది త్రేతాయుగాంతానికి జరిగిన జలప్రళయం లో సముద్రగర్భంలో మునిగి పోయింది. ఇది పాశ్చాత్యుల ప్రాచీనగ్రీకు గ్రంథాలలోను, జానపదకథంలోను, 'అట్లాంటిస్‌గా' (Atlantis) వర్ణించ బడింది. యీ అట్లాంటిస్ జలప్రళయం వచ్చినప్పుడు నీటిలో మునిగిపో యిందని గ్రీకులగాథలలో రాయబడింది. ఆ అట్లాంటిస్ నివాసులు ఇప్పటి మానవజాతికంటె సైన్సులోనూ, ఆధ్యాత్మిక శక్తులలోను, సంపదలలోనూ ఎన్నో సహస్రాబ్దాలు ముందుకి పురోగమించిన జాతి. ఇదే విషయాన్ని రామాయణంలోని పుష్పకవిమానం, అంతరిక్షయానం జ్యోతిశ్శాస్త్రవిజ్ఞానం మొదలైన అంశాలు ధృవపరుస్తున్నాయి.

జ్యోతిశ్శాస్త్రంలో యీనాటికీ కాలంలెక్కించేటప్పుడు "లంకోదయ రాశి ప్రమాణాలు" అన్నదే కనబడుతున్నది. అంటే ఈనాడు గ్రీనిచ్ కాలమానం ఎలా ప్రపంచం అంతా పరిగణిస్తోందో ఆనాటి జ్యోతిశాస్త్రానికి లంకకూడా అలాంటి కేంద్రమే అని తెలుస్తుంది. యింకో విషయం యేమి టంటే యీ జ్యోతిషగణితాలనుబట్టి చూస్తే యీ లంకాపట్టణం భూమధ్య రేఖమీదుగా ఉండిపున్నట్లు తేలుతుంది. ఈనాటి సింహళద్వీపం లేక సిలోన్ భూమధ్యరేఖకి ఎంతోపైగా (కొన్నివందలమైళ్ల ఉత్తరంగా) ఉండటం మూలాన యీ రావణాసురుని లంక సిలోన్ కాదని తెలుస్తుంది. ఇలాగే ప్రతిఒక్కటీ భూగోళ విశేష వర్ణనలు పురాణాలలో చదివేటప్పుడు పరి శోధనా బుద్ధితో చదివి, ఆనాటి కాలానికి యీనాటి కాలానికి భూగర్భ

శాస్త్ర రీత్యా (Geological Changes) భూఖండాలలో జరిగే మార్పులను గమనిస్తూ అర్థంచేసుకోవాలి.

## పురాణాలలో 'చరిత్ర' :—

వేదాంగాలలో ఇతిహాసమనేది కూడా-'శిక్ష' జ్యోతిషంతోపాటు ఒక ముఖ్యమైన విభాగము. ఇది తెలియక యీ నాటి చరిత్ర కారులు భారతీయులకు చారిత్రక జ్ఞానంలేదని, మనవాళ్లే మనచరిత్ర గ్రంథాలలో రాస్తున్నారు. రాజసూయం, అశ్వమేధం మొదలైన యజ్ఞాలు జరిగినప్పుడు ప్రాచీనరాజుల గాథలు-యీ పురాతన ఇతిహాసం-ఋత్విక్కులచేత గానం చేయబడుతుంది. ఇది యజ్ఞాలలో చాల ముఖ్యమైనభాగం. భారతీయులకే గనక చరిత్ర లేక పోతే ఇలాంటి ఏర్పాటు ఉండటం అసంభవం. అంతేగాక మనదేశంలో ప్రతి కుటుంబంలోనూ ఉండే ఆచారం ఇంకా యీనాటిదాకా కూడావస్తున్నదే అదే "రాజవంశావళి" అన్నపేరుతో ప్రతీరాజవంశంలోని రాజుల వంశ వృక్షంక్రింద ఆ కుటుంబీకులు—యీనాటికీ ఆపట్టీలను రక్షిస్తూఉండడం పరిపాటి. రాజస్థాన్‌లోని అనేక రాజపుత్ర వంశాలు యిటువంటి వంశవృక్షాలను పట్టికగా నడుపుతున్నారు. కొన్ని రాజవంశాలు పూర్వం, రామాయణకాలంనుంచి కూడా వస్తున్నాయి. మరికొన్ని భారతకాలం నుంచి ఉన్నవికూడా ఉన్నాయి.

ఇది విదేశీచరిత్రకోసం, వారిని మోసంచేయటానికి దొంగరికార్డు సృష్టించే ఉద్దేశ్యంతో వ్రాయబడినవనటం అసంభవం ఎందువల్లనంటే ప్రతీవ్యక్తి తన కుటుంబ పెద్దలయొక్క చరిత్ర ఎంతో గౌరవంతోనూ, జాగ్రత్తతోను, వ్రాసి పెట్టుకుంటారు. సామాన్యుడికే యింత జాగ్రత్త ఉన్నప్పుడు రాజులకు, రాజాధి రాజులకూ వంశ చరిత్ర వేల సంవత్సరాల వరకూ ఉండటంలో ఆశ్చర్యంలేదు. యిటువంటి వంశవృక్షాలూ, వాటి మీద ఆధారపడి ప్రాచీనులు రాసిన చారిత్రక రచనలూ ఇంకా యీనాటికీ చాలా దొరుకుతున్నాయిదేశంలో. అందులోకొన్ని ఈక్రింద చూపబడ్డాయి:

(1) మనదేశపు ప్రాచీన చరిత్రని విస్పష్టంగా రాయడానికి కావలసిన చరిత్రకు ఆధారమైన సాహిత్యం వివరాలు ఇంతకుముందే 25వ—పేజీలో యిచ్చి వున్నాను.

(2) కలియుగ రాజవృత్తాంతం :—పరీక్షిత్తుకు శుకయోగి వర్ణించిన భారతీయ రాజుల చరిత్ర. ఇది భాగవతం ద్వాదశస్కంధం చివర దీన్ని యీ నాటికీ చూడవచ్చు.

"భాగవతం" :—చిట్టచివర, 12వ— స్కంధంలో శుకయోగి, పరీక్షిత్తు అడుగగా—పరీక్షిత్తునిర్యాణం మొదలుగా రేపు ఈ కలియుగం అంతమై 'కల్క్యవతారం'వచ్చి మళ్ళీ సత్యయుగం(కృతయుగం)ధర్మంపునఃప్రతిష్ఠించబడేవరకూ రాగల భవిష్యత్తు యివ్వబడింది. ఇదికూడా 'జాతీయ చరిత్ర' (National History) వ్రాయటానికి నిజమైన ఆధారం. సరైన కాలనిర్ణయమూ చేయటానికి ఉపయోగపడే సాహిత్య వస్తువు.

(3) అవేగాక, 'యుగపురాణం'లో కలియుగంలో పరిపాలించబోయే రాజుల భవిష్యత్తు వర్ణించబడి వున్నది. ఇది యీ నాటికీ చూడవచ్చు. ఇందులో ఇంగ్లీషువారు పాడుచెయ్యకుండావున్న యదార్థచరిత్ర—ఏరాజు ఎన్నాళ్ళు పాలించిందీ—తెలుసుకోవాలంటే ఇది చాలా సహాయకారి కాగలదు ఇలాటిదే.

(4) భవిష్య పురాణం :— ప్రతివర్గకండం. యిది వ్యాసమహర్షి దర్శించిన భారతదేశపు భవిష్యత్ చరిత్ర.

భాగవత విష్ణుపురాణాదిగ్రంథాలలో క్లుప్తంగావర్ణించబడిన "ప్రపంచ భవిష్యత్తు" (World Predictions) * అన్న విషయమే విస్తారంగా ఒక పురాణంగా వర్ణించే గ్రంథం ఇది. ఇందులో ఇంతవరకూ జరిగిన చరిత్ర విక్టోరియా దాకా కూడా ఆయారాజుల పేర్లతోసహా ఇవ్వటమేగాక- రానున్న, అంటే-ఏదో అవతారమైన "కల్కి" ఏ ఊళ్ళో ఎవరింట,

Note :-* చూ. బెంగుళూరు పత్రిక- "Astrological Magazine"
—B. V. Raman.

ఎప్పుడు జన్మించబోతున్నాడో అప్పటి తిథివార నక్షత్రాలు, నూతన 'యుగం' అన కృతయుగం ఏ రోజునుంచీ ప్రారంభిస్తుందో అన్నీకూడా జరగబోయే భవిష్యత్తుని వర్ణించే ఆశ్చర్యకర గ్రంథం. దీన్నిగురించి విపులంగా విడివిడి అధ్యాయాలలో, ముందు ముందు తెలుపుతాను.

ఈ చరిత్ర శ్రీకృష్ణనిర్యాణంతో ప్రారంభించి విక్టోరియారాణివరకూ మనదేశాన్ని, పాలించిన రాజుల చరిత్ర (భవిష్యత్తు) విపులంగా వర్ణించబడింది: యిందులో, మొగలులు, తురుష్కులు, రాజపుత్రులు, బ్రిటిష్ వారూ వారి వారి పేర్లతోసహా వర్ణించబడివున్నారు. ఈ భవిషత్తు కలియుగాంతం వరకూ-అంటే రెండు ప్రపంచయుద్ధాలై కల్క్యవతారంవచ్చే వరకూ—జరుగగల చరిత్ర అంతా కూడా ఉన్నది. ఇందులో మతప్రవక్తలైన క్రీస్తు, మహమ్మదు, శంకరాచార్యులు మొదలుగాగల అనేకమంది జీవితాలు-పేర్లతోసహా నాడీ గ్రంథాలలోని జాతకాలవలే. విపులంగావర్ణించబడివున్నాయి. "నాడీగ్రంథాలు" (మునులురాసిన తాటియాకుగ్రంథాలు) ఈ నాటికీ వున్నాయి. అందులోంచి సేకరించిన శ్రీ రామకృష్ణ పరమహంస, వివేకానంద, లాల్‌బహదూర్‌శాస్త్రి. కె. యమ్. మున్షీ మొదలైనవారి జాతకాలు, పత్రికలలోకూడా ప్రకటమైనాయి.

5. "మహాభారతం":—చాలామందికి మహాభారతం అరణ్యపర్వంలో కలియుగాంతానికి జరగబోయే చారిత్రక విషయాలున్నాయని తెలియదు. ఎంతోమంది సంస్కృత పండితులుకూడా గుడ్డిఎద్దు చేలోపడినట్టు సంస్కృత 'వ్యాసభారతాన్ని' చదువుకు పోతారుగాని, "భవిష్యపురాణం"లో లాగే-భాగవతం (12-స్కం)లో లాగే భారతంలోగూడా భవిష్యత్తు వున్నదని—గమనించరు ! ! !

---

Note :-* జరగబోయే ప్రపంచ చరిత్రని, ముందుగా రాయటం అసంభవమనే మూర్ఖులు చరిత్రకారుల్లోకూడా ఉండవచ్చుననే—అటువంటి వారికిదాగా తెలిసివచ్చేలాగ — మనరోజుల్లోనే అలాంటి భవిష్యత్తు రాశాహొక ఇంగ్లీషు "కాంట్". అదె "Cheiro's World-

Predictions" (1926)అన్న గ్రంథం భారతదేశస్వాతంత్ర్యం, దేశ విభజనా ఇందులో ముందుగానే ప్రచురించబడ్డాయి.

ఇటువంటి నిర్దుష్టమైన ఆధారాలు యీ నాటికీ ఉండడం వల్లనే మన దేశపు అసలు చరిత్ర మన పురాణాలలోనే దొరుకుతుందని నిశ్చయంగా తెలుతోంది. ఇంతేగాదు ఈనాటి 'హిస్టరీ' పుస్తకాలలో రాయబడి 'చరిత్ర' అనిపించుకోబడుతున్నదంతా ఒక కట్టుకథ, కల్పన, ఊహాగానం, మతోన్మాదం, తెల్లవారి జాత్యహంకారం, బ్రిటిషు సామ్రాజ్యతత్వం, వలస తత్వం (Colonialism)తో అసలైన మన చరిత్రకది దుర్భర వికార రూపం అని తెలుసుకోటానికి కావలసిన ఆధారాలు అనేకం రానున్న అధ్యాయాలలో మనం చూడవచ్చు. అందులో "అలెగ్జాండరు దండయాత్ర" గురించిన అబద్ధాలూ, తేదీల తారుమారూ, అసలు జరిగిన చరిత్ర గల్లంతూ అంతాకూడా మనకి కళ్ళకికట్టినట్లు కనిపిస్తుంది.

అలాగే విక్రమాదిత్యుడూ బుద్ధుడూ శ్రీ ఆది శంకరులూ, శ్రీ కృష్ణుడూ మొదలయిన ముఖ్యవ్యక్తుల కాల నిర్ణయాలలోనే ప్రత్యేకించి యీ గల్లంతు, మోసం, స్పష్టంగా కనిపిస్తున్నది. ముందు అధ్యాయాలలో వివరించాను వీళ్ళ కాల నిర్ణయాలలో తేడా-ప్రాచీన గ్రంథాలలోని కాల గణనానికి ఇంగ్లీషు "చరిత్రకారుల" కాలనిర్ణయానికీ తేడా, పద్ధతులలో తేడా, దృక్పథంలోతేడా—విదేశీయులు దైబిలువంటి వాళ్ళ మతగ్రంథాల లోని కాలాలగురించి వ్రాసే విధానం ; మన జాతిచరిత్రకే గనులైన మన ఋషిప్రోక్తలైన పురాణేతి హాసాలలోని కాలనిర్ణయాల గురించి వ్రాసే విధానంలో ఎంత పక్షపాతం కనపడుతుందో కొంచెంగనక, గమనిస్తే యీ తేడా-మనకి స్పష్టంగా కనపడుతుంది. ఎందుకంటే ఆ మహాపురుషులు పుట్టిన జననకాల తిథీ వారనక్షత్రాలు సైన్సు ప్రకారం జ్యోతిశ్శాస్త్రందృష్ట్యా

లెక్కకడితే వారి అసలైనకాలం చరిత్రలో స్పష్టంగా తెలుస్తుంది. దానిని బట్టి ఈనాటి హిస్టరీలో రాసిన చరిత్రకాలం ఎంతగా తారుమారు చేయ బడిందో, అదికూడా మనకళ్ళతో మనమే చూడవచ్చు.

గ్రహస్థితులను మార్చడం ఎవరివల్లాకాదు గాబట్టి చరిత్ర కాలనిర్ణయానికి గ్రహాల నడకలు చక్కని శాస్త్రీయమైన ఆధారం. యీపద్ధతివికాల నిర్ణయం చాలామంది పాశ్చాత్య చరిత్రకారులుకూడా జైనాచరిత్ర విష యాలలోనూ, ఈజిప్టు, బాబిలోనియా మొదలైన ప్రాచీన దేశాల విషయం లోనూ, యీ లెక్కలు వేశారు. జాకోబీ, బాలగంగాధర తిలక్, బెంట్లీ మొదలైన అనేకమంది ఈజ్యోతిశ్శాస్త్రపద్ధతిని, కాలనిర్ణయం చేయడానికి ఉపయోగించారు. అదే యీ గ్రంథంలోనూ యింకావిస్తృతంగా ఉప యోగించబడింది. దీనివల్ల ఈనాడు చరిత్రలో రాసిన తేదీలు, కాలం ఎంత తారుమారైనాయో తెలుసుకోడానికి చక్కని ఉదాహరణలతో, మనదేశ చరిత్రకి విదేశీచరిత్ర కారులవల్ల ఎంత అన్యాయం జరిగిందో కూడా ప్రత్యక్షంగా నిరూపిస్తాయి: ఈ జ్యోతిషగణితం ప్రకారం లెక్కించిన కాలాలు.

# 'ఆర్యులు' - వేదసాహిత్యం

భారతదేశ చరిత్ర వేదకాలంతోనే (Vedic Age) ప్రారంభించడం అన్ని చరిత్రపుస్తకాలలోనూ మనకు కనబడుతూవుంటుంది. దీనికి కారణం "వేదాలు" ప్రపంచవాఙ్మయంలోనే అత్యంత ప్రాచీనమైన * సాహిత్యం అయి వుండటమే !

## వేదమంత్రాలు :-

"సాహిత్యమంటే" కేవలం కాలక్షేపానికై ఈనాడు అనేకమంది రాస్తున్న అర్థంలేని కవిత్వం కాదు ఈ 'సాహిత్యం' చాల విశిష్టమైంది. దానిలోతులు తెలుసుకొనడానికి దాదాపు 150-సంవత్సరాల పరిశోధన అయిన తర్వాతకూడా అనేకమంది పండితులు చరిత్రకారులు, యోగులూ, వ్యాకరణ వేత్తలూ కూడా, యీనాటికీ ఇదమిత్థమని వేదాలకు అర్థంచెప్ప లేకపోతున్నారు. దీనికి ఒక కారణం, అవి చాలా ప్రాచీనములు అనడమే. ఎంతకాలంక్రితం ఈ వేదమంత్రాలు మానవుడికి సాక్షాత్కరించాయో మన కయితే తెలియదుగాని ఈనాటికి ఆమంత్రాలే ప్రతి హిందువుడూ నిత్యజీవి తంలో దేవతలను పూజించేటప్పుడు ఉపయోగిస్తున్నాడు. భారతీయ ఆధ్యా త్మిక జీవితంలో వేద సాహిత్యం 'ఆత్మ' లాంటిది.

---

Note * గ్రిఫిత్‌మహాశయుడు తన ఋగ్వేదం అనువాదంలో "వేదము" మానవుడు తొలిసారిగా మాట్లాడిన మొదటివాక్కు" అని ప్రశం సించాడు. "Veda is the first Word spoken by Man" (—Ralph. Griffith's translation RigVeda.)

మనిషిపుట్టినప్పుడు "జాతకర్మ"నుంచీ తరువాత జరిగే ఉపనయనం, వివాహం, గర్భాదానం, సీమంతం, పుంసవనము మొదలుకొని మనిషి మరణించిన 10వరోజున జరిపే 'కర్మకాండ' వరకూ కూడా యీ 'వేద మంత్రాలు' తప్ప మనకి వేరే దిక్కులేదు యీనాటికీ.

## సత్యమే మంత్రానికి ప్రాణం!

మంత్రంలేకుండా పూజ, జపము, దేవతాప్రసన్నం, 'భగవత్సా క్షాత్కారము' అనేవి జరగడం అసంభం. ఈమంత్రాలను ఇప్పటిమానవుడు చేయలేడు. దానికి కావలసిన ఆధ్యాత్మికశక్తి, ఇప్పటి యీ మానవజాతికి లేదు. ఈవిషయం నిర్వివాదాంశం. దీనికి కారణాలు అనేకంఉండవచ్చు. కానిముఖ్యమైనకారణం మానవుడిలోని 'సత్యం' అన్న గుణంలోపించడమే. రెండవది మనిషి నిత్యజీవితంలో 'నైతికప్రవర్తన' నశించిపోవటము. లోభ త్వము తోటే అన్నిపనులూ సాధించుకోవాలనిమాస్తున్నాడు ఈనాటి మనిషి. నిజానికి ధనదాహమో, కీర్తికాంక్షో లేక పదవివ్యామోహమో కనీసం ఇత రులమెప్పు కోసమో ఏ ఆశాలేకుండా ఏపనీ యీరోజుల్లో దాదాపుఎవరూ చేయరు. దీన్నే పూర్వం 'ధర్మం నశించడం' అని అన్నారు. అంటే ఆనాటి ఆదర్శమానవ సమాజంలో మనిషి అయినవాడు ఏపనీ స్వలాభాపేక్షతో చేయరాదు—అన్నదే 'వేద ధర్మం'. సర్వమానవశ్రేయస్సుకోసం, మాన వుడు తన విద్యుక్తధర్మాన్ని నిర్వర్తించాలి. యిది అధమపక్షము ఏకోరికా లేకుండా, తనవిధులన్నీ తు. చ. తప్పకుండా, జీవితం ఒకతపస్సులాగ ఆచరించడం ఉత్తమధర్మం. జీవితాన్ని ఒక క్రమశిక్షణగా సాధనవలే సత్యాన్నీ, ధర్మాన్నీ అనుష్ఠిస్తూ, సర్వజీవుల యందుప్రేమగలవాడై ఏ జీవియందూ మమకారంలేనివాడై, కర్మలు నిర్వర్తించడం—ధర్మం యొక్క పూర్తిస్వరూపం. అట్లా సమాజం నడిచిననాడు "ధర్మం నాలుగు పాదాలా" నడుస్తున్నదంటారు.

ఈమాట యీనాటికీ ప్రజలనోట సామెతగా వినవస్తున్నది. ఎక్కడైతే న్యాయమైన పరిపాలన, ధర్మమైన నేరవిచారణ, సమమైనదండన నడుస్తూ ప్రజలు పైనచెప్పిన జీవనవిధానాన్ని ఆచరిస్తారో దాన్ని 'ధర్మం నాలుగు పాదాలా నడవటం' అని ఇప్పటికీ సామాన్యజనులు అనుకుంటూవుండటం పరిపాటి. పసితనం వుంది. పసిపిల్లవాడు ఆవయస్సులో నిర్మలంగా అమాయకుడై ప్రేమమూర్తిగా ఉంటాడు. అందుకే అందరికీ ముద్దొస్తాడు. వయస్సు మారితేమళ్ళీ అతడే యవ్వనంలో, వార్ధక్యంలోనూ చూస్తే, కోరికలతోను స్వార్థంతోనూ, రాగద్వేషాలతోనూ కృత్రిమంతోనిండివుంటాడు. ఇదే విధంగా మానవజాతి యొక్క బాల్యదశను, 'సత్యకాలం' అని ఈనాటికి అనుకుంటూ వుంటాము. అటువంటి "సత్యకాలం" మానవజాతికి ఉపదేశింపబడ్డవే ఈ "వేదాలు".

**వేదమంత్రాల శక్తి :-** ఈ వేదాలన్నీ మంత్రాక్షరాలతోనూ, దివ్యశబ్దాలతోనూ, అపూర్వశక్తినిచ్చే స్వరాలతోనూ, నిండివున్నాయి. ఈ 'స్వరాలు' అనేకరకరాల ప్రకంపనలు (Vibrations) కలిగి, అనేకమైన సిద్ధులను బయట, ప్రకృతిలో సాధించే శక్తినివ్వగలిగినవి. అందుకనేమంత్రానికి అపవిత్రత. దివ్యశక్తి లోపించినందువల్లనే ఈ కాలంనాటిమనిషి, ఆమంత్రాలను తయారు చేయలేడు. కృత్రిమత్వం పెరిగినందువల్ల 'యంత్రాలు' మట్టుకు తయారు చేయగలడు. ఇదీ, ఈనాటి మానవుడు చేయగలిగినపని.

ఆధ్యాత్మికశక్తితో'-' దైవశక్తితో కార్యాలుసాధించేది 'మంత్రం' మనోబలంతో మనస్సుయొక్క యుక్తితో, తద్వారాపుట్టిన ఆ శక్తితో కార్యాలు సాధించేది 'యంత్రం' (యంత్రాంగం). వస్తుజాలంతోనూ, మంత్రజాలంతోనూ కూడా-ఈ రెండింటినీకలిపి జోడించి, కార్యసాధనచేసేది

"తంత్రం". కేవలం భౌతికశక్తితో నడిచేవి, యంత్రాలు (Machines). యీ నాలుగు రకాలవిద్యలూ ఋగ్వేద యజుర్వేద సామవేద అథర్వణవేద రహస్యాలలో, క్రమంగా ఇమిడివున్నాయి.

**వేదసాహిత్యం :-** వేదాలునాలుగు అన్నది, అందరికీతెలిసిన విషయమే. అవి :—

(1) ఋగ్వేదము
(2) యజుర్వేదము
(3) సామవేదము
(4) అథర్వణవేదము.

అవికూడా చాలామందికి తెలుసు. కాని వీటి అర్థాలు ('ఋక్' అంటేనూ, లేక యజుస్ అంటేనూ ఇత్యాది) చాలామందికి తెలియదు. అందువలన వేదసాహిత్యం గురించి మనం కొంత తెలుసుకోవలసినఅవసరం ఉన్నది. ఎందువల్లనంటే వేదసాహిత్యం సరిగా అర్థంచేసుకోకపోవడంవల్లనే ఈనాటి భారత దేశ చరిత్రలో The Vedic Age లేక 'వేదకాలము' అన్న అంశంక్రిందతప్పులు తడకలూ, అపభ్రంశాలూ వ్రాయబడుతున్నాయి. వేమిటో వచ్చే అధ్యాయంలో చూద్దాము. వేదసాహిత్యంయొక్క పరిచయం సూక్ష్మంలో యిప్పుడు చేసుకుందాము.

## నిత్యజీవితంలో వేదసాహిత్యం :—

వేదంలోవి విషయాన్ని అనేకవిధాలుగా నిత్యకర్మలలో ఉపయోగించవచ్చు. వేదాలలోవున్న మంత్రశక్తి వల్ల అట్టి ఉపయోగం వీలవుతున్నది. అటువంటి పవిత్రత ఆమంత్రాలకున్నది. అలావుండకపోతే మనమీనాడుశుభ కార్యాలలోనూ, శిశువుపుట్టినప్పుడూ, వివాహసమయంలోనూ ఆమంత్రాలను

నిత్యం ఉపయోగించుకోవడమనేది ఎలా జరుగుతున్నది? దీనినే 'మంత్ర బలం' అంటారు.

ఈ 'మంత్రాలు' అనేకరకాలు. అందులో మొదటి తరగతి :-

1) కష్టాలు నివారించడానికి. అంటే పాముమంత్రం, తేలుమంత్రం, బెణుకు మంత్రం, మశూచి ("అమ్మవారు") మొదలైన రోగాలు నివారించడానికీ, చిన్నపిల్లలకు దృష్టితగిలి (దీనినే 'దిష్టి' అంటారు) పోయినట్టి ఏడుస్తున్నప్పుడూ, ఇలాగ, అనేక రకాల ఆపదలు నివారించడానికి పనికి వచ్చే మంత్రాలుకొన్ని.

2) ఇంక రెండవతరగతి:-ప్రకృతిశక్తులకు సంబంధించినవి. అంటే సరైన వర్షం కురవడానికి అతివృష్టి, వరదలు తగ్గటానికి, అనావృష్టి, కరువు నివారించడానికి, చక్కగా అన్నిఋతువులూ ధర్మాన్ని తప్పకుండా ఆచరించడానికి పనికివచ్చే మంత్రాలుకొన్ని. ఇవి మనకు కనపడే భౌతిక ప్రకృతిలో నిగూఢంగా ఉండేశక్తులు. వీటినే "దేవతలు" అంటారు, వాటికి సంబంధించిన మంత్రాలు. ఈ దేవతలే ఇంద్ర, అగ్ని, యమ, వాయు, వరుణులు మొదలైన వారు. వీరు కంటికికనపడక పోయినప్పటికీ, మన మనస్సు ఎలాపనిచేస్తున్నదో, మనగుండె ఎలాకొట్టుకుంటున్నదో, చెవులు ఎలా వింటున్నాయో. అలాగే నిశ్శబ్దంగా వాటికర్తవ్యాన్ని అవే 'నిర్వర్తించు కుంటూవున్న ప్రకృతిలోని శక్తులకు అధిపతులే యీ 'దేవతలు'.

3) ఇక మూడవ తరగతి మంత్రాలు :- మానవుని ఆధ్యాత్మిక పురోగతికి సంబంధించిన మంత్రాలు, ఇవి. "గాయత్రి", "అష్టాక్షరి." దేవీ, శివ, సూర్య, విష్ణు సంబంధమైన దేవతాపరమైన మంత్రాలు. వీటి ఉపయోగం కేవలం మానవుని మనస్సు వికసించడానికీ, అతనిబుద్ధి సరిగా పని చేయడానికీ అతనిలోని ఈర్ష్య, అసూయాద్వేషాలు, వశంలో (Within Control) ఉంచడానికీ, పనికివస్తాయి.

**మంత్రాలు-దైవ సాక్షాత్కారం :-** అంతేగాక నిస్వార్థంగా వీటిని హృదయపూర్వకంగా అనుష్ఠించినట్లయితే మానవుడు, భగవంతుడిని అనుభవపూర్వకంగా తెలుసుకోగలుగుతాడు.

ఈ అనుభవం రెండురకాలు. (1) ప్రత్యక్షానుభవము :— అంటే ఈ మంత్రాలు ఉపాసించడంవల్ల భగవంతుడు అతనికి ప్రత్యక్షంగా గోచరిస్తాడు. దీనినే ప్రత్యక్షం లేక "సాక్షాత్కారం" అంటారు. (2) ఇక రెండవరకం అనుభవం :—ఇది ఇంకా లోతైనది.

మొదటిది పంచదారను, కంటితో చూసి ఆనందించడం లాంటిది-అది పైనచెప్పిన 'సాక్షాత్కారం'. ఈ రెండవది ఆ పంచదారను నోటిలో వేసికొని అనుభవించి తనతో ఏకంచేసుకోవడం వంటిది. ఈ విధంగా భగవంతుడ్ని అనుభవించడం 'సాక్షాత్కారం' కన్న ఎక్కువమెట్టు. దీనినే 'భగవదైక్యము' అంటారు.

ఈ భగవదైక్యమనేది సామాన్యంగా మనిషి మరణించే సమయంలో జరిగితే ఆ జీవుడిఆత్మ భగవంతునిలో లీనమైపోతుంది. దీనిని 'కైవల్యం' అంటారు. ఒక్కొక్కప్పుడు మనిషి జీవించిఉండగానే అతని శరీరంలోకి యాభగవంతుని తాలూకు జ్యోతి అతని ఆత్మతో కలిసినప్పుడు భగవంతునితో 'తాను' ఐక్యమైన అనుభవం అతనికి కలుగుతున్నది. దీనినే 'సమాధి' అంటారు. యోగసమాధిలో మనిషి తానే భగవంతుడైనట్లు, తానే సర్వత్ర నిండివున్న పరమాత్మనని అభేదమైన అనుభవం పొందుతాడు. ఇది శాశ్వతంగా నిలిచిపోయినట్లయితే అటువంటివ్యక్తిని 'జీవన్ముక్తుడు' అంటారు. అలాకాక అసలుమొదటినుంచీ యీఅనుభూతిని ఎప్పుడూ అనుభవిస్తూ ప్రపంచంలో అన్నిచోట్లా సంచరించే దివ్యప్రభావం కలవారిని "నిత్యముక్తులు" ంటారు.

నారదాది దివ్యులు, సనక సనందనులు మొదలైనవారందరూ, యీ "నిత్యముక్తుల" కోవకి చెందినవారు. ఇటువంటివారికి 'చావు' అనేది ఉండదు. అదృశ్య రూపంలో నిత్యమూ ఉంటూనేఉంటారు. మానవజాతికి అవసరంవచ్చినప్పుడు ఆయా కాలాలలో ఆయా ప్రదేశాలలో మాత్రం దర్శనమిస్తారు.

**యక్సురేస్:-** (X-Rays లేక Invisible Light) సహాయంతో కంటికి కనపడని లోపలిఅవయవాలు యీ నాడు యక్సురేఫోటోలో మనం చూడడం ఎలా సంభవమో అది మనకుతెలుసు. ఈ "యక్సురే కాంతి" ఏవిధంగా కంటికి కనబడదో ఆవిధంగానే అదృశ్యరూపంపొందటం దివ్య శక్తులుపొందిన మానవునికిసాధ్యం, అని వేదాలు ఉపదేశిస్తున్నాయి. నీటి ఆవిరి ఆకాశంలో కంటికికనబడకుండా ఎలాఉంటుందో సరిగ్గా అదేవిధ స్థితిలో అదృశ్యరూపంలో భగవంతునియొక్క ఆత్మ సర్వత్రావ్యాపించి వుంటుంది. కంటికి కనిపించనంతమాత్రాన అది లేదని అర్థంకాదు. కాలం మారగనే యీ నీటియావిరి చినుకులుగాను, లేకపోతే వడగళ్లలాగ ఎలాగ అవనికి దిగుతున్నాయో, సరిగ్గా అదేవిధంగా, కాలంమారగానే యీ 'దివ్య పురుషులు' భగవంతుని ఆత్మ - ఒక రూపంధరించి ఘనీభవించిగడ్డకట్టి నట్లుగా భూమికి దిగుతారు. వీటినే 'దివ్యావతారాలు' అంటారు.

ఇవి చరిత్రలో కాలంమారినప్పుడల్లా వాటివాటిసమయాల్లో ఉద్భవిస్తాయి. ఈ మానవచరిత్ర అంతా ఒక సంవత్సరంలోని ఋతువులలాగ కాలంమార్పులతో నిండిఉన్నది. ఒక్కొక్క ఋతువువచ్చినప్పుడు ప్రకృతిఅంతా మారిపోతుంది. చెట్లు జంతువులు, పంచభూతాలతోపాటు మనిషిలోకూడా కాలం యీ మార్పులను తీసుకువస్తుంది. కాలంమారే యీ సమయాలను "యుగంమార్పు" అంటారు. ఈ విధంగా యుగాలు కాలంలో చక్రాకారంగా తిరుగుతూ వుంటాయి. (ఆదివారంతర్వాత మళ్లీ ఆదివారం వచ్చినట్లు).

ఇవి, వేదాలుమానవుడికి ఉపదేశించే సమగ్రచరిత్ర. సూక్ష్మంలో యిది ఇక్కడతెలుసుకున్నాం. వేదాలలో యింకా అనేకమైన శాస్త్రవిషయా లున్నాయి. కానిమంత్రం అంటేఏమిటి? ఆ మంత్రంలోని Vibrarions లేక "ఛందస్సులు" ప్రకృతిలోని పంచభూతాలతో ఎలాగ ముడిపడి ఉన్నాయి? దేవతలంటె ఎవరు? వారికి యీ మంత్రాలకి ఉన్నసంబధం ఎటువంటిది-తద్వారా మనిషికి కలిగేలాభాలు: అనేకరకాల మంత్రాలు, వాటి ఉపయోగాలు యివన్నీ సంక్షిప్తంగా పైనవివరించాను.

**నాలుగు వేదాలు** — ఈ మంత్రాలన్నీ నాలుగు విధాలుగా విభాగం, ఉప యోగాన్నిబట్టిచేయబడి, నాలుగు విధాలుగా రూపొంది నాలుగు వేదాలుగా ఏర్పడినాయి. ఇదితెలియక విదేశీచరిత్రకారులు ఈనాలుగువేదాలా బైబిలులోఅధ్యాయాలలాగ వేరేవేరేగ్రంథాలని భ్రమించి - ఏవేదం ఏకాలంలో వ్రాయబడిందో అన్న అర్థంలేని మూర్ఖవాదాలతో వాళ్ల తలలు పాడుచేసు కొని యితరుల తలలు పాడుచేశారు.

నాలుగువేదాలూ ఒకేవిషయానికి సంబంధించినవి. కాని ఉపయోగాలు మాత్రం నాలుగు. ఇది తెలియని భారతీయులుకూడా విదేశీ చరిత్రకారులనే గుడ్డిగాఅనుసరించి నాలుగువేదాలు వేరువేరుకాలంలో వ్రాయబడినవని అంటూ - వాటికి విడివిడిగా కాలనిర్ణయాలు చేస్తున్నారు. ఇది ఈదేశపు దౌర్భాగ్యం ఈ ప్రజలదురదృష్టం.

**నాల్లుగువేదాలూ ఏకకాలంలోనివే:-** ఆదిలో వేదాలు అన్నీ ఒకే గ్రంథంగా ఉండేవి. అవి కాలక్రమేణా ప్రజల ఉపయోగార్థం వేరేవేరే గ్రంథాలుగా విడదీయబడి (Analise) విడివిడిగా రూపొందినాయి. ఇది ఈ నాటిచరిత్రకారులు కండ్లు తెరచి చూడవలసిన విషయం. నగ్నసత్యం.

ఈ వేదములు విభాగం చేసినవాడు "వేదవ్యాస మహర్షి"అని మనకి 'విష్ణు పురాణం' వలన తెలుస్తున్నది.

"వేదమేకం చతుర్భాగంకృత్వా శాఖాశ్శతాని వై".

అని వ్యాసమహర్షి తండ్రి పరాశరమహర్షి రచించిన 'విష్ణుపురాణం' స్పష్టంగా తెలుపుతున్నది. దీనినిబట్టి వేదాలునాలుగూ వేరువేరు కాలాలకు చెందడం అసంభవం. అని మనకు స్పష్టంగా తెలుస్తోంది.

**అధర్వణ వేదంలోని 'సైన్సు':-** యికపోతే ప్రకృతిలోఉన్న వస్తువుల నిత్యోపయోగం— మానవజీవితంలో ప్రకృతిలో విజ్ఞానశాస్త్రంద్వారా కర్మలనుసాధించే మార్గం—"అధర్వణం" అందుకే అధర్వణవేదమంతా, యంత్రాలు, అస్త్రాలు, వైజ్ఞానికపరికరాలు, మారణాయుధాలు, మారణ హోమాలు ఇత్యాది క్రియాకలాపమంతా యీ అధర్వణ వేదంలో ఉన్నది. జర్మనీలో ఈ అధర్వణవేదం మీద ప్రత్యేకమైన Research లేక పరిశోధన జరిపి అపూర్వమైన అనేక వైజ్ఞానిక విషయాలు కనుగొన్నారని మన కీనాటి జర్మనీ చరిత్ర తెలుపుతున్నది. అంతేకాదు *రష్యాలో యీ రామాయణ కాలంనాటి పుష్పక విమానం (Flying Saucers) గురించిన పరిశోధన విశేషంగా జరుగుతున్నది.

సామవేదం సంగీతవిద్యకి సంబంధించినది. స్వరములు, జాతులు, కళలు అనేకరాగాలు—ఆ రాగాలుపాడినప్పుడు జరిగేమహిమలు యివన్నీ 'గాంధర్వ విధం'గా విడదీసి 'ఉపవేదాల' జాబితాలో చేర్చారు.

---

మా. * రష్యాలో యోగం, మహర్షులు, జ్యోతిష్యం, మరణించినవారి ఆత్మలు, పురాణాలలో పుష్పకవిమానం, అధర్వణవేదంలోని అంతరిక్షనౌకలు, రోదసీప్రయాణంగురించి అనేకవిషయాలమీద కమ్యూనిస్టు రష్యాలో జరుగుతున్న పరిశోధన వివరాలు ఈ అధ్యాయంచివర అనుబంధంలో చూడవచ్చు.

యుద్ధానికి పనికివచ్చే అస్త్రాలు వాటి విజ్ఞానం, ప్రయోగం మొదలైనవన్నీ ఇదేవిధంగా వేరుచేసి ధనుర్వేదంగా ఏర్పాటుచేశారు. రోగాలు, ఓషధులు, మూలికలు, శరీరవిజ్ఞానం మొదలైనవన్నీ 'ఆయుర్వేదం'లో నిక్షిప్తమై వున్నాయి. ఆకాశంలో నక్షత్రాలు, గ్రహాలూ, రాసులూ, వాటిమూలాన కాలం గుణించడం; తిథివార నక్షత్రాల లెక్కలూ ఇంకా జాతకఫలితాలు, ముహూర్తాలు ఇత్యాది శాస్త్రమంతా 'జ్యోతిర్వేదం'గా విస్తరించింది. శబ్దములూ వాటి ఉత్పత్తి, వాటిఉపయోగం, భాష స్వరూపం గురించినది "వ్యాకరణశాస్త్రం" ఇదే శబ్దాలు ఉచ్చరించటంలోని లోటుపాట్లు, ఆలోటుపాట్లవల్ల వేదమంత్రాలు జపించడంలో రాగంప్రమాదాలను నివారించేది—'శిక్ష' అనేశాస్త్రము. యీనాటికీ సగర్వంగా తప్పులులేకుండా స్పుటంగా వేదపండితులు అంత చక్కగా 'వేదగానం' చేయడం యీ 'శిక్ష' యొక్క ప్రభావమే!

**ఆర్యులెవరు ? :-** యీ వేదసాహిత్యమంతా ఆర్యులనేటటువంటి ఒక జాతి, ప్రత్యేకంగా తయారుచేశారని తెల్లదొరలు మనకింకొక అసందర్భమైన వాదాన్ని అంటకట్టారు. ఆర్యులనేది వేరే తెగ (Race) లేక, ఒకజాతి కాదు. ఇది దాచిపెట్టి ఆర్యులు, ద్రావిడులు వేర్వేరు జాతులని యీ తెల్లవాళ్లు ఒక విపరీతమైన వాదాన్ని రాజకీయ ప్రయోజనాలకోసం మనచరిత్రలో ప్రవేశపెట్టారు. దానికి ఫలితమే దేశంలో 'విభజన'(Divide and Rule) అన్న సిద్ధాంతం. దాని విషబీజాలే ఈనాటికీ మదరాసులో 'ద్రావిడులదే భారతదేశం' ఆర్యులు వేరేజాతివారు కాబట్టి ఈ దేశంవిడిచిపోవాలన్న ఉద్యమం పుట్టింది.

## రామాయణం 'ఆర్యద్రావిడ' యుద్ధమా ? :-

రామాయణంలోకూడా ఈతెల్లదొరలు ఆర్యులకు ద్రావిడులకు జరిగిన యుద్ధాలుగా మనచరిత్రని రూపకల్పనచేశారు. ఇదంతా శుద్ధ అబద్ధంఅని ఎవరైనా తెలుసుకోవచ్చు. రావణుడూ, రాముడూ వేరువేరు జాతులవారుకాదని

ఇద్దరూ ఆర్యులేనని ఒకరు ఆర్యుడు ఒకరు ద్రావిడ కాదని తెలిపేందుకు పెద్ద పరిశోధనకూడా అక్కరలేదు. మనంగనక సరిగ్గా రామాయణాన్ని చూస్తే, ఈ క్రింది విషయాలు తెలుస్తాయి.

(1). రావణుడు బ్రాహ్మణుడు - అనగా 'ఆర్యుడు'.

(2). ఈయన "ఆర్యులు" వ్రాసిన వేదాలను అందరి బ్రాహ్మణుల లాగే, చక్కగా పఠించిన వేదపండితుడు.

(3). ఈయన చక్కటి జ్యోతిష్కుడు. జ్యోతిర్వేదం, ధనుర్వేదం బాగుగా ఆకళించుకున్న మేధావి.

(4). అందువల్లనే గ్రహగతులలెక్కించడమేగాకుండా ఇతరగ్రహాలకుగూడ ప్రయాణంచేసిన విజ్ఞాని (Scientist).

(5). ఈయనవద్ద అంతరిక్షయానంచేయడానికి అవసరమైన "పుష్పక విమానం" అనే అంతరిక్ష నౌక (Space Ship) ఒకగుండ్రని ఆకారంకలిగిన (పుష్పకం) Flying Saucer- వంటిది ఉండేదని.

(6). ఈయన -'అథర్వణ వేదాన్ని' అందులోఉన్న సైన్సునూ - పూర్తిగా చేతిలోపెట్టుకొని తద్వారా ప్రపంచాధిపత్యాన్ని సాధించడానికి ఈనాటి రష్యా, అమెరికా, చైనాలలాగ ప్రయత్నించినవాడే.

(7) ఈయన 'ద్రావిడ' జాతివాడుకాదు. చాతుర్వర్ణ్యంలో మొదటిదైన బ్రాహ్మణవర్ణస్థుడు. అలాగే చాతుర్వర్ణ్యంలో రెండవదైన క్షత్రియకులానికి చెందినవాడు రాముడు. ఇద్దరూ 'చాతుర్వర్ణ్యం' లోనివారే!

(8). సూర్యమండలం లోని అపూర్వశక్తులను హస్తగతంచేసుకొని 'ఆదిత్యహృదయం' అనే మంత్రంద్వారా అపూర్వమైన ఆయుధాన్ని (అస్త్రం) సాధించినవాడు రాముడు.

(9). ఈ 'సూర్యశక్తి'కి సంబంధించిన మహత్తరమైన మంత్ర రహస్యమే 'గాయత్రి' (Solar Formula – "Gayatri")

(10). ఈ" గాయత్రీరహస్యాన్ని" కనిపెట్టిన విజ్ఞానవేత్త (Scientist) మహర్షి విశ్వామిత్రుడు. ఈయన సృష్టికి ప్రతిసృష్టి చేసిన గొప్ప వైజ్ఞానికుడు. — అంటే Scientist.

(11). ఈ విశ్వామిత్రమహర్షి, పై చెప్పిన సూర్య రహస్యాలను రాముడికి, లోకహితార్థం ఉపదేశించారు. — 'ఆదిత్యహృదయం' అన్న విద్యద్వారా.

(12). పై శక్తులతో రాముడు రావణునిశక్తులను నశింపజేసి ప్రపంచాన్నీ, మానవజాతినీ రాసున్నదానిసత్వంనుంచి రక్షించి మానవజాతికి మేలుచేసాడు.

(13). ఇంతటి అపరిమితమైనశక్తులు కలిగిఉన్నా, రాముడు మానవజాతిని అంతటినీ, సమానంగాప్రేమించి నిరంకుశంలేని ప్రభుత్వవిధానంద్వారా అందరికీ సుఖశాంతులను ప్రసాదించాడు.

ఇదే, రామాయణ పరిశోధనలవల్ల యీనాటికీ మనకితెలిసే సత్యం.

పై విషయాలవల్ల, ఇది ద్రావిడులకీ ఆర్యులకీమధ్యజరిగినయుద్ధంకాదని రావణుడు ఆర్యుడేననితెలుస్తోంది. అంతేగాదు ఆర్యులనేది వేరే ఒకజాతిగాదు

అన్న విషయంకూడా ధృవపడుతున్నది. ఆర్యులు వేరే బైటదేశంనుంచి వచ్చిన ఒక క్రొత్తజాతి అని, వారు భారతీయులు కారని తమలాగే విదేశస్థులని నిరూపించడానికి బ్రిటీష్ సామ్రాజ్యవాదులు మనదేశ చరిత్రలో ఎక్కిన విషవలయమే, ఆర్య ద్రావిడవాదం. ఆర్యద్రావిడ యుద్ధాలన్న చారిత్రికవాదం కూడా యిటువంటి మోసంతో కూడుకున్న తప్పుడు వ్రాతలే. దీనికి తార్కాణం, రామరావణ యుద్ధాన్ని ఈ బ్రిటిష్‌చరిత్రకారులు ఇలాగ తలక్రిందులుచేయడం అన్నది. పై విషయాలవల్ల ధృవపడుతున్న సత్యం. ఆర్యులు భారతీయులా ? అన్న విషయం 'ఆర్యులదండయాత్ర' అన్న కట్టు కథకి సంబంధించినది. ఈ ఆర్యన్ ఇన్వేషన్ (Aryan Invasion)అన్నది ఒక అభూతకల్పన. దానిప్రయోజనం - భారతీయులు ఆర్యులు కారని మన సంస్కృతి అంతా (అంటే వేదాలు: పురాణాలు, శాస్త్రాలు) బైట దేశాల వారు మనకిచ్చినదేనని మనల్ని నమ్మించడమే! తద్వారా తామే ఆ ఆర్యులసంతతి వారమని చెప్పే తెల్లదొరల "వేదాల్ని" మనచే చదివించడం కేవలం రాజకీయపుఎత్తు. భారతదేశపు దానిసత్వం నశించింది. కాని దాని సత్వపుచరిత్ర దానిసత్వపుభావాలూ, మనలో యింకా నశించవలసివున్నది.

**వేదాలలో సైన్సు :-** వేదాలలో వున్నది, కేవలం తద్దినం మంత్రాలు కాదు. అందులోనిది మహావిజ్ఞానం - ఒక గొప్ప సైన్సు అని పరిశోధన ఎలా నిరూపిస్తుందో చూపిస్తాను.

**1. జ్యోతిషం :-** వేదాంగజ్యోతిషం అతిప్రాచీనమైన ఖగోళగ్రంథం. ఇది వేదకాలంలో సంవత్సరం, తిథి, వారం మొదలైన పంచాంగపు లెక్కలు వేసేపద్ధతిని తెలిపేగ్రంథము. గ్రహాలనడకలు, ఈనాడు టెలిస్కోపుల సహాయంతో ఎన్నో యంత్రాల కొలతలు కలసిరాగా కనిపెట్ట గలుగుతున్నారు.

పూర్వం వేదకాలంలో ఏ టెలిస్కోపుం సహాయం, ఎటువంటి యంత్రాల ప్రయోగం లేకుండా, బ్రాహ్మణులు ఏనాడు గ్రహణంవచ్చేది,

ఏనాడు పౌర్ణిమ,ఏనాడు ఏ నక్షత్రం, తిథి ఉంటుందో,తెలుసుకొనే జ్యోతిష గ్రంథాన్ని 'సిద్ధాంతగ్రంథం' అంటారు. జ్యోతిష గ్రంథాలలోకెల్ల అతి ప్రాచీనమైనది 'వేదాంగ జ్యోతిషం'. ఈ గ్రంథాన్ని మొట్టమొదటిగా 1887లో Dr. Thibaut * తన సిద్ధాంతవ్యాసంలో పేర్కొన్నాడు. తర్వాత మహారాష్ట్రి విద్వాంసుడు జ్యోతిష్కుడూ తన, "భా ర తీ య జ్యోతిష చరిత్ర" అనేగ్రంథంలో వేదాంగ జ్యోతిషాన్నిగురించి వివరించారు. దీన్నిబట్టి తెల్లవాళ్లు వేదాంగ జ్యోతిషం అర్థంలేని చెత్త ("Filled With unintelligible rubbish"—Whitney) అనిచెప్పే వాదం అబద్ధం అని, తద్వారా బూటకమైపోయింది.

ఋగ్వేదకాలంలోని నక్షత్రాలు 'ధనిష్ఠతో' ప్రారంభ మయ్యేవి. ఇదే విషయం మహాభారతం కూడా రాశి చక్రంలోని "మొదటి నక్షత్రం" ధనిష్ఠ అని తెలుపుచున్నది.

"ధనిష్ఠాదిస్తథాకాలో, బ్రహ్మణా పరికల్పితః"

**2. గణితం** :—ఒకటినుంచి 9 వరకూ సంఖ్యలతో లెక్కపెట్టే విధానం ఈనాడు ప్రపంచానికి ప్రసాదించినవి—వేదాలు గణితశాస్త్రంలో 'సున్నని' (౦) అనే అంకం (అంకె) భారతీయుల గణితశాస్త్రంలోతప్ప ఇంకెక్కడా లేదు. ఈ భారతీయుల తొమ్మిది అంకెలే అరబ్బులు తీసుకున్నారు. దీన్నే పాశ్చాత్యదేశీయులు అరబ్బీ అంకెలన్న పేరుతో (Arabic Numerals) ఈ అంకెలనే సంపాదించుకున్నారు. రోమనుల అంకెలుగాని మరి ఏ యితర దేశాల ఏ గణితమానమూకూడా భారతీయుల తొమ్మిది అంకెలంత విస్పష్టమైనది తేలికైనది కాదని ప్రపంచమంతా ఈ అంకెలనే అనుసరించడంవల్ల తెలుస్తున్న విషయం.

* Journal of Asiatic Society of Bengal 1877-Essay on "Vedanga Jyotisha."

చాలామంది విదేశీయులు ఈ అంకెలను ఆదిమ మనుష్యుడే క్రమ క్రమముగా కనిపెట్టినట్లు ఈ గణితశాస్త్రంలో పరిణామం కనుక్కోవాలని ప్రయత్నించేసి విఫలులయ్యారు. దీనిక్కారణం ఈఅంకెలను ఆదిమానవుడు కనుక్కోలేదు. ఋగ్వేదంలో "విదింధు" అనే ఈ శాస్త్రాన్ని (Arithmetic) ఒకటినుంచి 18 స్థానాలవరకూ గల సంఖ్యలతో ఇవ్వబడి వున్నది ! దీన్నిబట్టి గణితశాస్త్రమంతా వేదంనుంచి ఈనాడు ప్రపంచం పొందగలిగిందే అని స్పష్టమౌతుంది.

## 3. 'జ్యామెట్రీ' GEOMETRY (లేక) 'శుల్బవిద్య' :- ఈ

నాడు మనం కాలేజీలలోనూ, విశ్వవిద్యాలయాలలోనూ ఈ క్షేత్రగణితాన్ని Geometry అనేపేరుతో చదువుకుంటున్నాము. అంతేకాదు. మనం నేర్చుకునే జామెట్రీ "యూక్లిడ్" (Euclid) అనే గ్రీకు పండితుడు కని పెట్టినట్టూ, పైథాగరస్ సిద్ధాంతాన్ని పైథాగరస్ అనే గ్రీకు శాస్త్రజ్ఞుడు కని పెట్టినట్టూ నమ్ముతున్నాము.

రాజరాజ నరేంద్రుడు పరిపాలించిననాటి తాటాకు గ్రంథాల్లో అనేకం క్షేత్రగణితం (Geometry) బీజగణితం (Algebra) ఇత్యాది గ్రంథాలు ఇటీవలనే నేను చూడటం+ తటస్థించింది. తాటాకుపుస్తకంమీదే, వృత్తాలూ త్రిభుజాలూ ఈనాడు పైథాగరస్ సిద్ధాంతం అనుకునే సూత్రమూ - పావులూరి మల్లన వ్రాసిన అనేక గణిత గ్రంథాల్లో చూడవచ్చు.*

---

*చూ॥ తాళపత్ర గ్రంథముల పట్టిక—రాళ్ళబండి సుబ్బారావు స్మారక పురావస్తు గ్రంథాలయం రాజమండ్రి.

+"పావులూరి మల్లన" రాసిన క్షేత్ర బీజగణితం—తాటాకు గ్రంథాల పట్టిక "రాళ్ళబండి సుబ్బారావు మ్యూజియమ్" (తాటియాకులమీద బొమ్మలతో సహా జ్యామెట్రీ రచించబడివున్నది)



"లీలావతీ గణితం చాలామంది వినేఉంటారు; ఈనాటి క్షేత్రగణితం (Geometry) భూమి కొలతలు, మొదలైన శాస్త్రమంతా వేదాంగమైన కల్పశాస్త్రం. "కల్ప సూత్రములు" మొదలైన వాటినుంచి మనకు లభిస్తున్నాయి. ఈనాటి గణితశాస్త్రమంతా వేదాల్లోంచి వచ్చిందే.

4. వైద్యం - ఈనాడు అనేకమందులు, రోగాలు—వాటి నివారణ గురించి పరిశోధన జరుగుతున్నది. ఈనాటి వైద్యశాస్త్రం చాలామట్టుకు (Hippocratis) అను గ్రీకువైద్యుడిచ్చిన శాస్త్రమే అతడీవైద్యశాస్త్రాన్ని అరబ్బులదగ్గరనుంచి నేర్చుకున్నట్లు చరిత్రతెలుపుతున్నది. చరక సంహితా సుశ్రుతాదులూ ఇతర రస సిద్ధాంత గ్రంథాలు (పాదరసంతో తయారుచేయబడిన మందులు) అరబ్బీభాషలోకి అనువాదం చేయబడినవి ఇంకా ఈనాటికీ దొరుకుతూ ఉండటంవలన ఆయుర్వేదమే అరబ్బీదేశానికి తీసుకుపోబడి, అక్కడనుంచి పాశ్చాత్య దేశాలకు తీసుకు పోబడినదే - భారతీయుల "ఆయుర్వేదమే" అని తెలుస్తున్నది.

ఈ వైద్యశాస్త్రాన్ని వేదాలలో ఒక భాగమైన ఆయుర్వేదము అని పిలుస్తారు. ఇది ఒక ఉపవేదము-అంటే వేదములకు అనుబంధమైన భాగము. ఇది మొట్టమొదట భరద్వాజమహర్షి ఇంద్రుని అనుగ్రహంవల్ల మానవ జాతికి ఉపదేశించాడు. ఆత్రేయసుడనే ముని, అగ్నివేశునికి ఉపదేశించినట్టుగా ఈ ఆయుర్వేదమంతా ఒక గ్రంథంగా వ్రాయబడి మనకు లభ్యం అవుతున్నది. దీన్నే "చరక సంహిత" అంటారు.

ఈ చరక సంహిత-రోగలక్షణాలు, చికిత్సచేసే విధానం,శరీరంలోని ధాతువులు, వాటిలో ఉద్భవించే దోషాలూ, మానవుడు జన్మించేవిధానం పిండోత్పత్తి, గర్భిణీస్త్రీలకు చేసే, ఉపచారచికిత్సలూ, మొదలైన అపూర్వ విషయాలతో నిండివున్నది. మొట్టమొదటిసారిగా ప్రపంచసాహిత్యంలో

మనుష్యుడి శరీరంలోకి, జీవం ఎలా ప్రవేశిస్తుందో ఆ పిండోత్పత్తిక్రమం అంతా వేదాలకు "ఉపవేదమైన" ఈఆయుర్వేదంలోనే వర్ణించబడిఉన్నది.

**శస్త్రచికిత్స:**- ఈనాడు మనం ఆపరేషనులు చేయడం చూస్తున్నాము. దీన్ని "శస్త్రచికిత్స" అంటాము. మూలికలతో రోగం నయంకాకపోతే ఆపరేషన్ చేయవలసివస్తుంది.

ఆపరేషన్ చేసే విధానం: ఎటువంటి శస్త్రాలు ఎలా ఉపయోగించాలి, శరీరంలో ఏయేభాగంలో ఏ ఏ అవయవాలుంటాయి మొదలైన అంశాలతో శస్త్రచికిత్సవి తెలిపే ప్రాచీన ఆయుర్వేద గ్రంథం సుశ్రుతము. దీన్ని సుశ్రుతుడు అనే మహర్షి రచించెను.

**వాస్తుశాస్త్రం:**- ఇంగ్లీషులో Architecture లేక Town Planning అని ఈనాడు చెప్పబోయే శాస్త్రమంతా వేదాలలో 'వాస్తుశాస్త్రం'గా మనకు కనపడుతున్నది. ఇందులో నగరనిర్మాణం. వీధులు ఏవిధంగా ఉండాలి, ఊరికి నాలుగుప్రక్కలా వేరువేరు కులాలవాళ్ళు నివసించేందుకు పేటలూ— గాలి, నీరు, మొదలైన వసతులూ: ఇలాంటి విషయాలెన్నో తెలిపేది "నగరవాస్తు".

అలాగే—ఇళ్ళుకట్టడాలు, వాటి ప్లానులు, ఇళ్ళలోనిలోపాలు మనకే విధంగా కష్టనష్టాలు కలిగిస్తాయోవాటి వివారణగురించిచెప్పేది గృహవాస్తు..

5. **దేవాలయాలు** - వాటి నిర్మాణం, రకరకాల దేవతలు, ఆ విగ్రహాల కొలతలు, వాటిని ప్రతిష్ఠచేసే విధానము, ఏయేతిథులు, ఏఏ నక్షత్రాల్లో ఏ ఉత్సవాలు చేయ్యాలి. రకరకాల దేవాలయాల నిర్మాణం—ఇదంతా దేవాలయ వాస్తు. మయుడనే విజ్ఞానవేత్త వ్రాసిన "మయవాస్తు" అనే ఒక గ్రంథం చాలా ప్రాచీనమైంది. శల్యవాస్తు, సమరాంగణసారం మొదలైన అనేక గ్రంథాలు వేదంలో చెప్పబడిన "వాస్తుపురుష" పూజను తెలిపే మంత్రాలమీద ఆధారపడ్డవే.

**వివిధకళలు:-** గ్రంథవిస్తరణభీతిచేత వివరాల్లోకి పోకుండా సూక్ష్మంగా ఇతర వేదవిద్యలు ఏమిటో ఇక్కడ ఉదహరిస్తాను :—

1. **గాంధర్వవేదం:-** ఇది వేదాంగాలలో ఒకటి.సంగీత శాస్త్రం— స్వరాలూ, రాగాలూ, మొదలైన విషయాలు తెలిపే శాస్త్రం.

2. **ధనుర్వేదం లేక యుద్ధవిద్య:-** శస్త్రాలూ. అస్త్రాలూ, ధనుర్విద్య, అస్త్ర దేవతా మంత్రాలూ తెలిపే "యుద్ధశాస్త్రం."

3. **శిక్ష:-** సంస్కృత శబ్దాలు ఉచ్చరించే విధానం వేద మంత్రాల ఉచ్చారణ సరిగా ఉచ్చరించకపోతే వాటిల్లే ఆపదలు, వాటి నివారణ విషయాలు తెలిపేది 'శిక్ష.'

4. **వ్యాకరణం:-** ఇది అందరికీ తెలిసినదే. పాణిని మహర్షి వ్యాకరణ సూత్రాలద్వారా, భాషయొక్క నిర్మాణమంతా మనకు తెలియజేసేరు. ప్రపంచంలో ఇన్ని భాషలున్నా, శాస్త్రీయమైన వ్యాకరణయుక్తమైన నిర్దుష్టమైన పదజాలం ఒక్క సంస్కృతభాషకుతప్ప, మరే ఇతర భాషకూ లేవని "మాక్స్ ముల్లరు" వంటి జర్మను పండితుడు, ఇతర పాశ్చాత్య పండితులూ కూడా అంగీకరించారు.

**వేదము సర్వవిజ్ఞానమునకూ ఆధారం :-** ఈ నాడు చాలా మంది మనలో, వేదాలు శాస్త్రీయ గ్రంథాలని ఎరుగరు. అందులో సైన్సుకి సంబంధించిన విషయాలు అనేకం ఉన్నాయని ఎరుగరు. ఇవి కేవలం మత గ్రంథాలనుకునేవారికి కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి ఈ క్రింది వాక్యాలే గమనార్హములు—

"వేదము సర్వజ్ఞానమునకు భూమి; మత విషయమైన గ్రంథముగా గర్వించుటు. అసలు మన మతమే విలక్షణమైనది. ఇతర దేశములలోని మతములు పట్టి మతములు. దేవుని గురించి ధ్యానించుట, ఎవడో ఒకడు ప్రవక్తయనుట, వాడు చెప్పినవి చేసినచో మోక్షము వచ్చుననుట. ఆ మత ప్రచారము పేర రాజకీయమైన మహాద్రోహములు చేయుట.

"ఈ వేదమత మట్టిదికాదు. ఈ మతము, ఈ శాఖలు సర్వత్ర సంయోజించి చూచినచో యిది అంతయు ఒక ఏకాకారమైన విషయము. దేవతలున్నారు. వారందరూ మానవుని శరీరములో నున్నారు. కర్మలున్నవి. అవి యన్నియు మానవుని శరీరమందున్న భిన్నశక్తులకు పరిపోషకములు. సర్వవేదకర్మలు మానవునియొక్క క్రియాశక్తికి సంబంధించినవి. దోహదము చేసెడివి—

"ఈ మానవశక్తితో సమానమైన యజ్ఞయాగాది కర్మలుండగా యీ మానవుని శరీర నిర్మాణము పంచభూతాత్మకమైనది పంచ భూతములున్నవి. గాలి, నీరు, నిప్పు, భూమి, ఆకాశము. ఇందులో "భూమి" యున్నది. భూమియందు ఓషధులున్నవి సర్వమైన ఓషధులు శరీరగతమైన అవి, రక్తమాంసాదులకు సమాధానము చెప్పునవి. వానికి వీనికి సంబంధమున్నది. ఓషధులు మానవశరీర గత మృత్, రక్త, ముఖ్యవిషయములకు దోహదములు. ఎందుచేతననగా తత్త్వతః అవియే యివి గనుక. అగ్ని యున్నది. అగ్ని అనంతవిధములైనది. "అగ్నిమీళే పురోహితమ్"—అన్న యీవేద వాక్యంలోని 'అగ్ని' లౌకికాగ్నియా? యాజ్ఞికమైన దైవికాగ్నియా? ప్రాణధారణకు హేతువైన జఠరాగ్నియా? మహాచైతన్యమైన అగ్నియా? ఇది సర్వదృష్టినీ పరిష్వంగము చేసుకొని యున్నది. ఇందులో నేదియూ విడివిడిగా లేదు.

"ఆకాశమునందు గ్రహములున్నవి. ఆ గ్రహముల గమనముచేత మానవజీవితములు నడుచుచున్నవి. వానివల్లనే ఉప్పెనలు, భూకంపములు,

జంతువులు, నదులుపొంగుట వచ్చుచున్నవి. అందుచేత మానవశరీరమున. గ్రహములు ఓషధులు, ఆకాశము వివియన్నియు నొక్కటిగా నుండుచున్నది.

“మరియు మానవుడున్నాడు. పంచేంద్రియములున్నవి. మనస్సున్నది. బుద్ధియున్నది : ఆత్మయున్నది : వీనికి అనంతాకాశమందున్న శబ్దమునకు సంబంధము. వీని యూహలకు క్రియాకలాపమునకును సంబంధము. ఈ రీతిగా సర్వసృష్టియు నేకాకారము.

“ఈ రీతిగా యీ సర్వ మహావిజ్ఞానమును చెప్పునది వేదము. ఈ మహావిజ్ఞానమునకు స్థానము వేదము, ఇంత మహావిజ్ఞానము, ఏ ఒక్కరికిని పరిమిత కాలములో నవగతముగాదు.

“ఒక యంత్ర నిర్మాణ విషయమున దాని భిన్నాంగములు భిన్న స్థలములయందు భిన్న భిన్న వ్యక్తులచేత సిద్ధము చేయబడి, అన్నింటి నొకచోట సమీకరించినప్పుడు అది యంత్రముగా పనిచేసినట్లుగానే, యీ మహా వేద రాశిలో భిన్న భిన్న స్థలములయందున్న యీ భిన్న భిన్న విషయముల విజ్ఞానము భిన్న భిన్న శాఖలుగా వెలసినది.

“అందుచేత వేదములు నాలుగు అయినవి వాని అరణ్యకములువేరు. ఉపనిషత్తులువేరు : ఇట్లు అనంత గ్రంథములు బయలుదేరినవి.

“పరదేశములు మన దేశమును దండెత్తినట్లు పైకి కనిపించును మన ఆర్థిక సంపత్తును కొల్లగొట్టినట్లు కనిపించును. కాని, వారు నిజముగా నాశనము చేసినది మన విజ్ఞానమును. దానినేక విధముల పాడుచేసినారు. కర్మలన్నియు మూఢకర్మలని, అవియనవసరము లేనివనియు, చేసెడివారు మూర్ఖులనియు నొక బోధ చేసిరి. ఒక చదువు చెప్పిరి. ఏమని : కర్మయొక్క రహస్యము తెలియకుండ కర్మచేసెడివాడు మూర్ఖుడు. అట్లైనచో విద్యుత్ ఎట్లు సిద్ధము

చేయుచున్నారో తెలియకుండా ఇండ్లలో వాడుకొను వారెల్లరు మూర్ఖులే! కొన్ని విషయములు చేయరానివి చేసినచో ప్రత్యక్షముగా అపకారము జరుగదు. కొన్నింటివల్ల జరుగు అపకారము ప్రత్యక్షముగాదు. ఆహారము లట్టివి. వాటి ఫలితములు సూక్ష్మముగా నుండును. అవి యన్నియు మూర్ఖుల యాచారములని చెప్పుట చాల సులభము. ఈ మహా విషయము గురించి ఎంత చెప్పినను తరుగదు.

"ఇతర మతకర్తలు వారి రాజ్యములు వ్యాపింపజేసి మన ఆచార విశ్వాసములను ధ్వంసము చేసినట్లే లక్షలాది గ్రంథములను తగులబెట్టి వేసిరి. కనుక మనకు మిగిలిన జ్ఞానము అసంపూర్ణమని చెప్పుటలో ఎంత న్యాయ మున్నదో చూడవచ్చును.

"ఇట్లుండగా, మిగిలిన మన జ్ఞానమే పాశ్చాత్యుల జ్ఞానమునకు పదింతలు. ఈనాటి భారతీయులు పాశ్చాత్యులచేత చేయబడిన జోగులు.

"మనుష్యుడు పుట్టినాడు. వాడు బ్రతుకవలెను: అన్నము కావలయును. ధనము కావలయును. వీని నన్నింటినీ, రాజైనవాడు తన చేతిలో పెట్టుకొన్నచో ఎంతటి జ్ఞానమైనను నాశనము చేయవచ్చును! ఇది ఇప్పటిస్థితి."

కవిసామ్రాట్ :— శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

"ఆధునికులలో ఋషి—వేద వాఙ్మయంపై వైజ్ఞానిక వ్యాఖ్యాత" అన్న వ్యాసంనుండి (USCEFI సంచిక 1970)

---

# మనచరిత్రప్రారంభం-'ఆధునిక యుగం'

మనదేశపు చరిత్ర మహాభారత కాలంలో ప్రారంభ మవుతుందని చెప్పవచ్చు. ఎందువల్లనంటే 'చారిత్రక యుగం' లేక చరిత్ర వర్తించే కాలం మహాభారతం నుంచే మనకు ప్రారంభ మవుతుందని చెప్పవచ్చు.

ఇలా చెప్పడానికి ముఖ్యంగా మూడు కారణా లున్నాయి. ఒకటి మన ప్రాచీన 'చరిత్ర యుగాన్ని' మూడు భాగాలుగా విభజిస్తే అందులో మొదటిది వేదకాలం. నిర్దుష్టమైన శాసనాలు, రాజులపేర్లు, ఇదమిద్ధమనిచెప్ప గల చరిత్రాత్మక సంఘటనలూ దొరకని అతి ప్రాచీనయుగం ఈ వేద కాలం. రెండవది పురాణాలు, ఉపనిషత్తుల కాలం. దీనిని గురించి తర్వాత అధ్యాయంలో తెలుసుకుందాం. ఇక పోతే "చారిత్రక కాలం" మూడోది. అంటే మన చరిత్రలో నిర్దుష్టంగా 'ఫలానా రాజు ఈ కాలంలో పరిపాలిం చాడు' అని నిరూపించడానికి తగిన ఆధారాలున్నకాలం. రాజులూ వారి పరి పాలనా కాలాలూ, రాజవంశాల చరిత్ర, ఇవన్నీ నిర్దుష్టంగా ఒకనిశ్చయ మైన తేదీనుంచీ ప్రారంభమవుతాయి. ఈ తేదీ 'మహాభారత యుద్ధ' కాలంతో* ముడిపడివుంది. ఈ తేదీ పాశ్చాత్య శాస్త్రజ్ఞులు కూడా గణితం చేసి నిర్ధారణ చేసిన సమయం.

---

* ఈ తేదీనుంచే-మన పంచాంగాల్లో మన జ్యోతిష్కులు అనాదిగా గణితం చేస్తూవున్న 'కలియుగాది' అనే మైలురాయి. ఈ తేదీని సరిచూసి, అల్‌బెరూని (Alberuni), జాకొబీ (Jacobi), లాకైలీ (Lacaille) బ్లావెట్‌స్కీ (Blavatsky) కౌంట్‌స్టర్నా (Count Bjornastern) బైయిలీ (Bailley) వంటి శాస్త్రజ్ఞులు చరిత్ర పరిశోధకులూ, యోగులూ ఏక గ్రీవంగా అంగీకరించిందే. అన్ని గ్రహాలూ —మొదటి రాశిఐన 'మేషం'లో చేరి అక్కడనుంచి కాలం లెక్కించే బిందువు (Point of Time) ఈ "కలియుగం" యొక్క ఆది.

ఫిబ్రవరి 18 క్రీ॥ పూ॥ 3102 రోజున సరిగ్గా ఈ చారిత్రకకాలం ప్రారంభమయింది. ఆరోజునే మన దేశచరిత్రలో అతిముఖ్యమైన సంఘటనలు జరిగినట్లుగా మనకు మహాభారతంవల్ల తెలుస్తోంది. అందులో మొదటిది—శ్రీకృష్ణుని అస్తమయం. భారత దేశచరిత్రను ఒక నూతన మార్గాన నడిపించిన ఆదర్శమూర్తి శ్రీకృష్ణుడు—

మన దేశం మొట్టమొదటిసారిగా ఏకీకరణం చేయబడి ఒక 'భారత దేశం'గా ప్రసిద్ధికెక్కినదికూడా శ్రీకృష్ణుని కృషిఫలితంగానే.

(చూ. "యుధిష్ఠిర శకం")

మనకొక కొత్త రాజ్యాంగవిధానం యుధిష్ఠిరుని పరిపాలనలో ప్రారంభమై-దేశంలో 18 రాష్ట్రాలు ఈనాడు సర్దార్ పటేల్ నాయకత్వాన ఎలాగ సంఘటితం చేయబడ్డాయో అలాగే సరిగ్గా— ఆనాడూ అదేవిధంగా శ్రీకృష్ణుని రాజకీయ ప్రతిభవల్ల సంఘటితం చేయబడి మనదొక దేశంగా, జాతిగా రూపొందించిన 'యుగపురుషు' డైన శ్రీకృష్ణుడు మరణించిన తేదీయే*, పైన చెప్పిన 'చారిత్రకకాల' ప్రారంభసమయం. అంతేకాదు మన చరిత్ర ప్రారంభం చేయటానికి నూతన శకం (దీనిని "కలిశకం"అంటారు) ప్రారంభించబడి, మన పంచాంగాలు, కాలమానం జ్యోతిశ్శాస్త్రపు గణితం అన్నీ సరిగ్గా ఈరోజునుంచే లెక్కింపబడటమే కాకుండా యీనాటికీ కూడా మన పంచాంగాల్లో ఈ 'కలిశకం' అనుసరింపబడుతూనే వున్నది. మనజాతి-కలియుగ ప్రారంభ కాలానికి సరిగ్గా 36 సంవత్సరాలకు పూర్వం (అంటే క్రీ. పూ. 3138) ఒక భయంకరమైన యుద్ధం జరిగినట్టుగా మన చరిత్రే విశదపిస్తున్నది. ఈ 'ప్రపంచ యుద్ధం' పేరే ఈనాటికీ ఇంగ్లీషువాళ్ళు

---

* ఇంకా వివరాలకు: నా గ్రంథం "యుగ పురుషుడు" లో 'శ్రీకృష్ణుని కాలం' ఆయనజాతకం, జన్మించిన తేదీ యివ్వబడినాయి ఆ గ్రంథంలో.

వ్రాసిన చరిత్రలో అస్తవ్యస్తంగా తేదీలు తలక్రిందుచేయబడి, కురు పాండవులనే యిద్దరన్నదమ్ముల మధ్య జరిగిన ఒక చిన్న అంతర్యుద్ధంగా రూపించబడిన "మహాభారత యుద్ధం"

మహాభారత యుద్ధం తర్వాతనే మనదేశచరిత్రలో "చీకటియుగం" అని చెప్పదగిన 'కలియుగం' ప్రారంభమైంది. ఈ కలియుగకాలంలోనే మన దేశానికీ, మన సంస్కృతికీ, అడుగడుగునా కడగండ్లూ పరాజయం తీరని అన్యాయమే అన్నింటా జరుగుతూ వచ్చింది. అంతేగాకుండా మనదేశం ఈ యుగంలోనే విదేశీయుల దండయాత్రలకి లెక్కలేనన్నిసార్లు గురియై, స్వరాజ్యాన్ని కోల్పోయి — దాసిసత్వం కూడా అనుభవించింది. గ్రీకులు, ముసల్మానులు, మొగలాయీచక్రవర్తులు పారసీకులు. అప్పటివంటి అనాగరిక క్రూరజాతుల చేతుల్లో మన జాతి చాలసార్లు ఓడిపోయి,కలకాలంవారికాళ్ళక్రిందక్రుంగుతూ దాసిగాపరిపాలించబడి చివరికి 1947 లోనే స్వాతంత్ర్యాన్ని చేయకో గలిగింది. ఇటువంటి ఘోరమైన పరిణామాలతో కూడుకున్న మన "చారిత్రక కాలాపి" మహాభారత యుద్ధంతోనే ప్రారంభమని చెప్పడానికి ఇదే ! కారణం.

ఈ మహాభారత శకానికి యింకొక ప్రాముఖ్యత కూడా వున్నది. పూర్వరాజుల శాసనాలు +శిల్పాలమీద దేవాలయాలపైనా చెక్కబడిన శిలా శాసనాలు వాటివల్ల మనదేశాన్ని పరిపాలించిన రాజులకాలం. మహాభారత కాలంనుంచీ యీనాటివరకూ ఈ కలిశకాన్ని ఆధారం చేసుకొని కాలగణితం చేస్తూవచ్చారని పైన తెలుసుకున్నాం. ఈ కాలగణితంవల్ల, మనకో గొప్ప సౌకర్యం వున్నది. అదేమిటంటే ఈ "కలియుగ" శకమే గనక ఈశాసనాల్లో

---

+చూ. ఐహోల్ (Aihole) శాసనం "జనమేజయుని" శాశనాలా ఇత్యాది ఎన్నో శాశనాలున్నాయి. అవి అణగద్రొక్కబడి మన చరిత్రలో ఉదహరించకుండా దాగి ఉన్నాయి—నేటికీ !!!

ఉదహరించకపోయి వున్నట్లయితే మన దేశ చరిత్రలోని తేదీలను ఇంగ్లీషు వాడు ఇష్టం వొచ్చినట్లు తారుమారుచేసిన, గందరగోళాన్ని సరిదిద్దుకోడానికి యీనాటికీ వీలయ్యేదే కాదు. అంతేకాదు. అసలు మనదేశపురాణం కాలాన్ని ఇంగ్లీషు చరిత్రకారులు తలక్రిందులు చేసిన సంగతి కూడా, మనకసలు తెలిసేదే కాదు!! అందువల్ల యీ కలియుగ ప్రారంభకాలమైన (18-2-3102 B. C.) శ్రీకృష్ణనిర్యాణ కాలము: మనమందరమూ బాగా గుర్తుంచుకోవలసిన మైలురాయివంటి తేదీ.

ఇలాగ 'ఫలానా తేదీనుంచి కలియుగం ప్రారంభ మయిందని' చెప్పడానికికూడా అనేక సాక్ష్యాలు ఎవరూ కాదనలేని ఆధారాలు ఉన్నాయి. అవన్నీ శ్రీ కృష్ణ ని కా ల ం అన్న అధ్యాయంలో వివరిస్తాను.

ఇక్కడమట్టుకు మనపూర్వులుఏవిధంగాచరిత్రలోని కాలాన్నిలెక్కకట్టేవారో సూక్ష్మంగా చెబుతాను:- భారతీయులు ఇంగ్లీషువారి లాగ "క్రీస్తుశకం" లాంటి ఏవొక్క వ్యక్తిమీదా ఆధారపడి, మన'శకాలను'గానికాలాన్ని గాని లెక్కించలేదు. ఆకాశంలో కనపడే సూర్యచంద్రుల నడకలవల్ల ఆనాటి నక్షత్రం తిథి వారం మొదలైన అంశాలమీద ఆధారపడి, పంచాంగాలు తయారుచేశారు. అవే, యీ శాస్త్రి గణితాధారంతో ఈనాటికీ మనం పంచాంగాలు చూసి, రానున్న గ్రహణాలు, అమావాస్యలు, పూర్ణిమలు, తిథి, వారం, వర్జ్యం మొదలైనవన్నీకూడా ప్రత్యక్షంగా నిర్ణయించుకుంటాం. ఈ పంచాంగాలన్నీకూడా పూర్వంనుంచీ యీనాటివరకూ గ్రహాల నడకలను ఆధారంచేసుకుని వ్రాయబడ్డవే. పరదేశాలలో టెలిస్కోప్ల సహాయంతో యీనాడు గ్రహాల నడకలను కొలుస్తున్న సైంటిస్టులు కూడా యీ నడకల నాధారం చేసుకుని వెనక్కు లెక్కవేసి ఐదువేల (5000) సంవత్సరాలనాడు మనఋషులు కలియుగప్రారంభసమయానికి ఏ గ్రహగతులున్నట్టుగా వర్ణిం

వారో, అవేస్థితులు సరిగ్గాలాగే ఈనాటిశాస్త్రజ్ఞుల లెక్కలతో సరిపోయి పూర్వుల లెక్కలనికూడా ఋజువుచేయడంచూసి ఆనాటి భారతీయవిజ్ఞానానికి ఎంతో ఆశ్చర్యపోయారు. బైలీ (Bailey) లాకైలీ (Lacaille) మొదలగు పాశ్చాత్య జ్యోతిష్కులు : ఈ శాస్త్రజ్ఞులుకూడా, మన పంచాంగాలను గణితంచేసిన ప్రాచీన బ్రాహ్మణుల విజ్ఞానాన్ని ఎంతగానో కొనియాడారు.

ఈ కలిశకం గురించి అది ఎలాగ నిర్ణయించేశారో కూడా చెబుతారు. ప్రతిసంవత్సరం సూర్యుడు 364¼ రోజులతర్వాత తిరిగిమళ్ళీ సంవత్సరం ప్రారంభమవుతుంది. ఇది మనకందరకూ తెలిసిన విషయమే. ఈరోజునే సంవత్సరాది అంటాము. ఇలాగ 12-నెలలూ సూర్యుడు సంచారంచేసి తిరిగివచ్చే కాలచక్రాన్ని జ్యోతిశ్శాస్త్రంలో రాశిచక్రం అంటారు.నెలకొక్క రాసిచొప్పున సూర్యుడు సంవత్సరంలో 12-రాసులు చుట్టివస్తాడు. తిరిగి మళ్ళీ సంవత్సరాదిని "మేషరాశి" మొదటికి (అంటే అశ్వినీనక్షత్రం మీదికి) వచ్చి చేరుకుంటాడు. ఈ మేషరాశి మొదటిబిందువే కాలచక్రానికి ప్రారంభబిందువు. సూర్యచంద్రులు మాత్రమే కాకుండా నవగ్రహాలన్నీ కూడా, ఒక్కసారి యీమేషరాశి మొదటికి చేరుకున్నతేదీయే యుగ ప్రారంభమయ్యే సమయం.

అంటే సరిగ్గా క్రీ. పూ. 18-2-3102 B. C. నాటి కన్ని గ్రహాలూ సూర్యునితోకలిసి మేషరాశి మొదటికి వచ్చి చేరుకున్నాయన్నమాట. ఆ కారణంచేతనే యిది కలియుగ ప్రారంభకాలమయింది.

ఆనాటి గ్రహస్థితి యీక్రింద 'రాశిచక్రం'లో చూడవచ్చు.*

| | | | |
|---|---|---|---|
| | సూర్యుడు<br>చంద్రుడు<br>కుజుడు<br>బుధుడు<br>గురువు<br>శుక్రుడు<br>శని | | |
| ల | 'కలియుగం' (శ్రీకృష్ణనిర్యాణం)* సమయానికి ఉన్న గ్రహస్థితి. ఇదే, 'కలియుగం'శకం లేక 18-ఫిబ్రవరి-3102 B. C. నాటి గ్రహస్థితి. | | |
| | | | |

ఈ తేదీనుంచి వరుసగా మనచరిత్రనంతా లెక్కించుకుంటూ "కలి శకంగా" యీనాటికీ వాడుతున్నాం. ఇంతేగాక యీ తేదీతో ముడిపడివున్న యింకొక విశేషమేమిటంటే సరిగ్గా అదేరోజున భారతీయులంతా భగవంతుని అవతారంగా పూజించుకొనే శ్రీకృష్ణభగవానుని నిర్యాణసమయంకూడా, అదే! అంచేత, యీ తేదే కలిశకంగా మనచరిత్రలోనేగాక మానవచరిత్రలో కూడా మైలురాయి వంటిది.

## మహాభారత కాలంనాటి మనదేశం :-

మహాభారతంయొక్క ప్రాముఖ్యత ఒక్క కలియుగ ప్రారంభమైన "కలిశకం" వొక్కటేగాదు. మహాభారతం మనజాతి నాగరికతకీ, మన ధర్మానికీ అనాడు మనదేశస్థితిగతులు, మన ప్రాచీన వైభవం ఇంకాఎన్నో అంశాలు మనకి తెలిపే మహాగ్రంథము. అందుకే దీనికి, వేదాలతో సమానమైన ప్రతిపత్తిని యిచ్చి 'పంచమ వేదం' అని గౌరవిస్తున్నాము యీనాటికీ.

దీనికి ఇంకో కారణంకూడా వున్నది. ఈనాడు మనలో చాలా మందికి భారతమంటే కేవలం కురుపాండవయుద్ధంకి కథ మాత్రమే మనకి వ్యాసమహర్షి వ్రాశాడని అనుకుంటారు. కాదు. ఇది ప్రపంచ చరిత్ర గురించి ఎన్నో వింతవింత విషయాలనూ అపూర్వ సత్యాలనూ మనకి తెలుపుతుంది. అందులో మొదటిది—మహాభారతం ప్రపంచ యుద్ధం—అంటే ఇది కిందటి రెండవ ప్రపంచయుద్ధం (హిట్లరుయుద్ధం) మొదటిప్రపంచ యుద్ధం (కైజరు యుద్ధం)లో ఎలాగ అనేకదేశాలు పాల్గొని కొన్ని కోట్లకొద్దీ జనం నశించి, లక్షలజనం నిరాశ్రయులై పోయారో అలాగ మానవజాతిలో అనేక శతాబ్దాలు గడిచినా మరుపలేనంత ఘోరమైన యుద్ధమన్నమాట.

**విదేశాలతో మన సంబంధాలు :** ఇంగ్లీషువాళ్ళ చరిత్రల మీద ఆధారపడి తయారుచేసిన గ్రైజుచదివి డిగ్రీలు పొందిన, మనలో చాలామందికి

అసలు మనదేశానికానాడు విదేశాలతో సంబంధంవుండేదా? అసలు మన దేశాలవాళ్ళకి పరదేశీయులకి రాకపోక లుండేవా? అని సందేహంకూడా కలగవచ్చు.

**రోము సామ్రాజ్యం రాయబారి :-** మహాభారతంలో ధర్మరాజు రాజసూయయాగం చేసినప్పుడు అనేక దేశాలనుంచి రాజులు వారివారి రాయబారులను వెలలేని కానుకలతో యజ్ఞసమయానికి పంపినట్టు మనకి వ్యాస మహర్షి వ్రాసిన సంస్కృత మహాభారతంద్వారా స్పష్టంగా తెలుస్తుంది. సభాపర్వం—52వ అధ్యాయంలో కూడా నానాదేశాలనుంచి, విదేశాల రాజులు అనేకమంది సామ్రాట్టు అయిన (Emperor) ధర్మరాజుని దర్శించినట్టు తెలుపుతోంది. విక్టోరియా మహారాణినాటికి బ్రిటిషు సామ్రాజ్యం ఎలాగ ఉన్నత స్థితిలో వుండేదో అలాగ ప్రపంచసంస్కృతికే కేంద్రంగా మహాభారతకాలంలో ఢిల్లీ (హస్తినాపురం) వైభవంతో వెలిగిపోయింది. యీనాడు 'అట్లాసు'లో మనంగనక చిన్ని ఇంగ్లాండు పటమును చూస్తే యీ దేశమేనా ప్రపంచాన్ని పాలించింది? అనిపిస్తుంది. యింత చిన్నదేశమే అంతవైభవంగల సామ్రాజ్యాన్ని అనుభవించినదనగా, మన భారతదేశం ఆనాడు ఎంతో సంపదతో వృద్ధిపొంది, సరైన ప్రభుత్వం గలిగివుండి బలవంతులైన రాజులతో, విదేశీయులకు కన్నెత్తిఅయినా చూడటానికి వీలులేకుండా వైభవంగా వెలిగిందంటే ఆశ్చర్యం ఏమున్నది?

మహాభారతంలో రోము(Rome) రాయబారి విషయంమాత్రమేగాకుండా క్రీస్తుపూర్వం మనదేశానికి సముద్రంఅవతలి దేశాలతో సంబంధాలున్నట్టు ఎన్నో ఆధారాలున్నాయి. 'ఐతరేయ బ్రాహ్మణం' వేదకాలంలోది. అందులో 'సుదాసు'అనే పేరుగలచక్రవర్తి, సముద్రాలను దాటి విదేశాలతో యుద్ధాలు జరిపి బైటిదేశాలు జయించిన విషయం వున్నది.

కర్నల్ టాడ్ (Col. Todd) అనే ఇంగ్లీషు చరిత్రకారుడు "సగరుడు అనే హిందూరాజు సముద్రయానం చెయ్యగల నావికులైన అరవై వేలమందికి తండ్రిగా తెలియబడుతున్న "సముద్రపు రాజు", అని వ్రాశాడు. "Sagara Emphatically called the Sea-king, whose sixty thousand sons were so many mariners" (Todd's Annal's of Rajasthan P. 602 Vol—I)

హరవిలాసశారద అనే హిందూ చరిత్రకారుడు "The Maha-Bharata (Sabha Parva Ch. 51) describes the Romans coming to Emperor Yudhistira with precious presents of the Rajasua yagya at Delhi." మహాభారతం సభాపర్వం (51 అధ్యాయం)లో రోము రాయబారి ఢిల్లీకి వచ్చి యుధిష్ఠిరుడికి రాజసూయ యజ్ఞ సమయంలో అనేక కానుకలు ఢిల్లీలో సమర్పించినట్లు చెబుతున్నది" అని వ్రాశారు. ఆయన మహాభారతం ఆదిపర్వం "పురూరవసు"దనే భారతీయ చక్రవర్తికి నౌకాబలం వుండడమేగాక 13-ద్వీపాలపైన రాజ్యాధికారం వున్నట్లు తెలుస్తున్నది" అనికూడా వ్రాశాడు.

ఇంతేగాదు. ప్లినీ (Pliny) అనే గ్రీకుచరిత్రకారుడు హిందూదేశం గురించి "Some consider the four Sastrapies of Gedrosia, Atachosia, Aria and Paropamisus to belong to India" "గెద్రోసియా, అటాకోసియా, ఆర్రియా, పరోపమిసస అనేదేశాల నాలుగుసాత్రపీలుకూడా భారతదేశానికే చెందివుండెవని" వ్రాసాడు. యీ విషయాన్నే ఎలిఫిన్‌స్టన్ దొర (Eliphinston's History of India) తన భారతదేశచరిత్రలో ఉదాహరిస్తూ యీ నాలుగు 'సాత్రపీ'లూ కలిసి "పర్షియాదేశంలో మూడొంతులభాగం" అవుతుందని (This would include about two-thirds of Persia") ఉద్ఘాటించాడు.

'స్ట్రాబో' (Strabo) అనే యింకొక గ్రీకుచరిత్ర కారుడుకూడా "పర్షియాలో చాలభాగం భారతదేశపు ఆధీనంలో వాడిపోయేవారు, మాసిడోనియన్లు", అని వ్రాశాడు.

చరిత్రకారుడు, స్మిత్ (V. A. Smith)టాలెమి ఫిలడెల్ఫస్ క్రీస్తు పూర్వం 285 నుంచి 247 B. C. కి మధ్యలో ఈజిప్టునుపాలించిన రాజుల కాలంలో ఇండియాచక్రవర్తి కి. డయనీసియస్ అనే పేరుగల రాయబారిని పంపినట్టు తెలుపుతున్నారని వ్రాశాడు.

మహాభారతానికి ఎన్నోవేలఏళ్ల ప్రాచీనమైన రామాయణంలోగూడా అయోధ్యకి విదేశాల రాజులు రాయబారులువచ్చి దర్శించినట్టు ఆధారా లున్నాయని ఇంగ్లీషు రచయిత్రి Mrs. మేనింగు తన భారతదేశచరిత్రలో వ్రాసింది.* మాక్డొనెల్ పండితుడు (Prof Mac-Donell) భారతదేశ శాసనాలలో యవన, గ్రీకు కన్యలను కప్పముగా భారతదేశంకు పంపినట్టు తెలుస్తున్నదని వ్రాసాడు. కాళిదాసుకూడా యీ యవన యువతులచేత పరిచర్య లందుకోవటం గురించి వ్రాసాడుఅనికూడా మాక్డొనెల్ వ్రాస్తు న్నాడు.

అసలు మన రామాయణ మహాభారతాలనాటి సామాజిక పరిస్థితులూ. అందులో వివరించిన విజ్ఞానవిషయాలూ, నాగరిక ప్రపంచానికిప్పుడిప్పుడే కొస్త కొస్త అర్థమవుతున్నాయనడంలో ఎంతైనా నిజముంది. దీనికొక కారణంకూడా వుంది. ఉదాహరణకు అంతరిక్షయానం తీసుకుందాం. పురాణాల్లోవేదాల్లో విమానాల గురించి అంతరిక్షయానంచేసే 'వ్యోమనౌక'ల గురించి సవివరంగా వర్ణన ఉన్నాయంటే. అవి కేవలం అసంభవమనుకొనే

Mrs. Manning's "Ancient and Medieval India" Vol-II P. 27.

రోజుల్లో వాటిని కేవలం కవి ఊహా, అతిశయోక్తి వర్ణనలుగా కొట్టిపారేయడం సహజం. కాని మానవుడు చంద్రమండలంమీద కాలుపెట్టాడు. పురాణాల్లో వర్ణించిన "అంతరిక్షయానం" మానవచరిత్రలో మళ్ళీ యింకొకసారి కన్నులారా సిద్ధించింది. బహుశః ఇతరగ్రహాలమీదికి, బహుదూరాన వున్న ఇతర లోకాంతరాలకుకూడా మానవుడు ప్రయాణంచేయడం కొద్ది కాలంలోనే సంభవంకావచ్చు. అప్పుడు మన పూర్వఋషులు వర్ణించిన వైజ్ఞానిక విశేషాలను; వింతలను పరిశీలనాభావంతో ఇంకొంచెం జాగ్రత్తగా పరిశీలించి ఇంతవఱకూ కనుక్కోని విశేషాలింకెన్నివున్నాయో అవి పురాణాలను వేదాలను మానవుడు పరిశోధించడం జరుగవచ్చు.

ఇట్టి పరిశోధనా గ్రంథమే రష్యన్ విజ్ఞానవేత్త అయిన "వెలీకోవ్స్కీ" (Velikovsky) రచించి ప్రపంచాన్ని ఆశ్చర్యంలోముంచివేశాడు. భూమియొక్క అతిపురాతనచరిత్ర, భూమియొక్కబాల్యము, మానవజాతి అప్పుడప్పుడేఅవనిపీద తప్పటడుగులు వేస్తున్న ఆదికాలంనాటి ప్రకృతి చిత్రాలు; వింతలూ, గూర్చి జరిగిన అపూర్వపరిశోధనా ఫలితమే, ఈయన రచించిన మూడు గ్రంథాలు. అందులో మొదటిది మానవజాతి పుట్టడం యీ భూమిమీద జరగలేదని, ఈయన వాదం. ప్రపంచంలో ఎక్కడా భూగర్భశాస్త్రజ్ఞులు ఇన్నేళ్ళుగా త్రవ్వకాలు సాగిస్తున్నా మానవజాతి పుట్టినదేశం 'ఇది' అని నిర్ధారణ కాకపోవడానికి కారణంకూడా ఇదే కావచ్చు.

ఎప్పుడో వేలాది సంవత్సరాలక్రితం ఏదోవొక అంతరిక్షనౌక అనంతమైన ఆకాశంలో ప్రయాణంచేస్తూ భూమిమీదకొచ్చి పడిపోయింది ; అందులోని మానవాతీతజాతి ఒకశాస్త్రీయ ప్రయోగంకోసం భూమిమీద వదలివేసిన మొదటి జంటలు యీనాటి మానవజాతికి ప్రారంభమని 'వెలికోవ్స్కీ' (Velikovsky) వాదం. దీనికీయన బైబిలునుంచి బేబిలోనియా,

ఈజిప్టు, ఖాల్డియా మొదలైన దేశాలలోని అతి ప్రాచీన మత గ్రంథాలలోని వర్ణనలను శ్రమపడి సంవత్సరాలుగా పరిశోధించి యీనిర్ణయానికి వచ్చేరు. అంతేగాక ప్రపంచసాహిత్యంలో దేవతలని, రాక్షసులని వర్ణించబడ్డ జాతి యొక్క, అతిప్రాచీన యుగంనాటి చరిత్ర. ఆనాటి బాల్యావస్థలోవున్న మానవజాతికి అర్థమైన భాషలో వ్రాయడం జరిగిందని వెలికోవ్స్కీ వెలికి తీసిన ఆధారాలతో మనకు కూడా అనిపించక మానదు.

ఈయన ఇలా ప్రాచీన ప్రపంచసాహిత్యపు మతగ్రంథాలమీద మాత్రమే కేవలం ఆధారపడలేదు. అనేకచోట్లకు పోయి ఈ ప్రాచీన దేశాలలో త్రవ్వకాలు జరిపారు. ఫినీషియా, అస్సీరియా, మెసపొటేమియా, ఈజిప్టు, ఆఫ్రికా మొదలైన ప్రాచీన భూఖండాలలో కొన్ని కొన్ని విలువైన విగ్రహాలు, రాతిశాసనాలు యింకా ఇతర లోహపు డిజైన్లు పోత పోసిన అచ్చులు ఈయన సంగ్రహించారు. వాటిలోచాలాభాగం యీనాటి అంతరిక్షనౌక లోపలిభాగాల 'ప్లానును' పోలినవి. ఈనమూనాలు దొరకడం ఈయన వాదాన్ని మరింత బలపరిచినవి. అంతేగాక కొన్నికొన్ని భూఖండాల చిత్రాలు (Mpas) ఆకాశంలోనుంచి చూస్తే కనిపించినట్టు వంపుగా వ్రాయబడివుండడం యింకొక ఆశ్చర్యకరమైన విషయం.

ఈ దృష్టితో చూస్తే మన పురాణాలు, అందులో వర్ణించిననాటి మానవచరిత్ర-కొన్ని లక్షల సంవత్సరాలవెనుకజరిగివుండిన ఆదిమచరిత్రగా (Pre history)తెలుస్తోంది. ఇందులోనివిషయాలు ఈనాటికి నమ్మశక్యంకానంత మాత్రాన అసత్యాలని కొట్టిపారేయడం శుద్ధ అవివేకమని చరిత్రకారులకిదొక గుణపాఠం. అహంకారపు, మూఢత్వ పరిధిలోనే మానవచరిత్రనంతా మూటగట్టాలనిచూచే యీనాటి పాశ్చాత్య సంస్కృతికీ, యీనాటి మానవుని దురహంకారానికీ, ఇది కాలం యిచ్చిన గొడ్డలి పెట్టు.

రామాయణంలో పుష్పక విమానం గుండ్రంగా పుష్పంలాగ వర్ణించటం చూస్తే ఇది కేవలం ఏరోప్లేను (Aeroplane) గా ఊహించటానికి వీలుగాదు.—ఎందువల్లనంటే అంతరిక్షంలో ప్రయాణంచేసి 'వ్యోమనౌక' లేక ఎగిరే పళ్లెములు (Flying Saucers) వంటి అంతరిక్షనౌక పుష్పకమయి యుండవచ్చు. ఎందువల్లనంటే యిటీవల కొన్ని సంవత్సరాలుగా అమెరికా వైమానికదళంవారు ఆకాశంలో ఫోటోలు తీసిన Flying Saucers సరిగ్గా యీ ఆకారాలు పోలినవే అయివుండటం. యీ విషయాన్ని మరింత ధ్రువ పరుస్తోంది. అదీగాక గుర్తుతెలియని వస్తువులు (Unidentified Object) అనే అంశంక్రింద బహుశా అంగారకగ్రహంనుంచి భూమిమీదకు రావడానికి ప్రయత్నంచేస్తున్నజాతులు ఉపయోగించేది, ఇటువంటి అణుశక్తి నౌకలని భావిస్తున్నారు. ఏది ఎలాగున్నా యీనాడు మానవజాతి సాధించిన పురోగతికంటే వెయ్యిసంవత్సరాలు ముందున్నజాతి ఎక్కడైన యింకోగ్రహం మీద వుండటం అసాధ్యంకాదని యీ పరిశోధనలవల్ల తేలిపోతుంది.

ఆది కాలంలో యీ భూమిమీద నివసించే మానవాతీత జాతులకు యీ భూమిమీద గుత్తాధిపత్యానికై జరిగిన భయంకర వైజ్ఞానిక యుద్ధంలో (Scientific Warfare) అణుబాంబులవంటివి. హైడ్రోజను బాంబుల వంటివి ప్రయోగించటం జరిగి, తత్ఫలితంగా మానవసంస్కృతి నాశనం అయి భూఖండాలు తారుమారై విజ్ఞానం పూర్తిగామరుగుపడి మళ్ళీ ప్రాథమిక దశనుంచి ప్రారంభించడం జరిగిందని తెలుస్తుంది. ఈ అంశాన్నే పెలికోవ్స్కీ పరిశోధనలుకూడా బలపరుస్తాయి. ఈ విషయాన్నే మన పురాణాలు దేవదానవ యుద్ధంగా ఇంద్రపదవికోసం జరిగిన ప్రపంచ యుద్ధంగావర్ణించినవేమో! ఈజరిగిన మహాప్రళయంలో కొన్ని దేశాలుపాతాళానికి అణగద్రొక్కబడినట్లూ.—బలిచక్రవర్తి యీ పాతాళానికి తడుమబడినట్టు చెప్పబడే గాథల అంతరార్థం ఇదే అయివుండవచ్చు. ఎందుకంటే

యీనాడు బలిద్వీపం (Bali Islands) గా మిగిలిపోయిన దేశానుంచి సరిగ్గా భూమికి అట్టడుగున (అర్ధరాత్రి సూర్యుడుండె బిందువు) 'పాతాళ' మని వర్ణించబడినచోట యీనాడు అమెరికా ఖండం ఉండడం ఒక బలమైన ఆధారం.

ఇంకో విషయమేమంటే అమెరికాలో ఈ తెల్లదొరల ప్రవేశం జరగక ముందు ప్రాచీనహిందూసంస్కృతి వుండినట్లు యిటీవల పరిశోధనల వల్ల తేలింది. అమెరికాలో దొరికిన గణపతి విగ్రహాలు, సూర్య, దేవీ సంబంధమైన పురాతన వస్తువులూ. దీనికి ప్రబలమైన సాక్ష్యాలు.

'మాయా'సంస్కృతి - అన్న పేరుకూడా సంస్కృతపదమే. మయాసురుడు అనే పేరుగల విశ్వకర్మ అంటే (Engineer) శిల్పి ఈ అమెరికా ఖండంలోనివసించినట్టు అతడుకొన్నివేల సంవత్సరాలనాడు భారతదేశానికివచ్చి తనఅపూర్వవిజ్ఞానపటిమతో(Scientific Knowledge) ఒక అద్భుతమూ అపూర్వము అయిన "సభ"ను నిర్మించి ఢిల్లీలో ధర్మరాజు కిచ్చినట్టు మహాభారతంవల్ల మనకు స్పష్టంగా తెలుస్తుంది. మనం మహాభారతం సభాపర్వం గనుక జాగ్రత్తగా చదువుతే యీ మయుడనే యింజనీరు ఆ సభను (పార్లమెంటు హాలు) నిర్మించడంలో అపూర్వ ప్రతిభ మనకు అర్థంకాగలదు. భౌతికశాస్త్రంలో (Physics) కాంతిపరావర్తనం (Refraction) ప్రతిబింబించడం (Reflection) ద్వైధీభూతం కావడం (Difraction) ఇంద్రధనుస్సులాగ విరిగి వికృతిపొందడం లాంటి శాస్త్ర విషయాల నాధారంగా చేసుకొని ఉన్నవస్తువులు లేనట్టుగాను, లేనివస్తువులు ఉన్నట్టుగాను కనిపించే అద్భుతరీతిలో ఈ మయసభా నిర్మాణం జరిగినట్లు మనకు తెలుస్తుంది. ఇంతేగాక దుర్యోధనుడు ఈ సభ చూడ్డానికే వచ్చి, నీళ్ళున్నచోట లేవనుకొని జారిపడడం, లేనిచోట ఉన్నవనుకొని భ్రమించడం చూచి ద్రౌపది పక పక నవ్విందట.

ఏది ఏమైనా ఈనాటి సైన్సు కాంతిరేఖలు పంగటంవలననే ఎవారి లోకూడా నీళ్ళున్నట్లు కనిపించే, ఎండమావులు. జరగటంవల్ల మనకు తెలుస్తోంది. ఇవే ఆశ్చర్యాలు మయసభ నిర్మాణానికి వినియోగించిన వైజ్ఞానిక సత్యాలు అని స్పష్టంగా తేలుతుంది. ఈ దృష్టితో చూస్తే, మానవచరిత్ర అంతా బహుశా తిరిగి వ్రాయాల్సి వస్తుందేమో! ఏమైనా ఈ వైజ్ఞానిక యుగంలో కాలం మారింది. దానితోపాటు మానవుని బుద్ధికూడా పెరగాలి. తాతల కాలంనాటి యింగ్లీషువారి చరిత్ర, చెత్తబుట్టలో పారెయ్యాలి అన్నది నగ్నసత్యం. విజ్ఞానం సరిగ్గా పురోగమించని కాలంలో జీవించిన యింగ్లీషు చరిత్రకారుల మూఢవిశ్వాశాలముందు—భారతీయచరిత్రని పురాణాల్లోను, వేదాల్లోను వర్ణించిన వైజ్ఞానిక సత్యాలను బలికావివ్వడం జరగని పని. ఇది చరిత్రకే ఘోర అన్యాయం: పురోగతి కావాలని. ప్రతిమానవుడూ బూజు పట్టిన మూఢనమ్మకాలతో తయారైన యింగ్లీషువారి భారతచరిత్రను నిరసించి. శాస్త్రీయ సత్యాలమీద (Scientific truths) వైజ్ఞానిక పరిశోధనల మీదా (Scientific Reseasch) ఆధారపడి, మానవచరిత్రను వ్రాయవలసిన తరుణం ఆసన్నమయిందని గుర్తుచెయ్యటం వరకేయిక్కడ నావంతు. రానున్నది ఒక మహాయుగం (New Age). గడిచిపోయిన కాలం నాటి చరిత్ర. చరిత్రకారుల ఊహలు, డార్విన్‌నాటి సిద్ధాంతాలూ, మార్క్సు (Marx) నాటి ఆలోచనలు మారాలి అని, మారుతున్న కాలమే మనకు నేర్పుతుంది. దీంట్లో భారతచరిత్రను సరిగా వ్రాయడం ఒక మెట్టు మాత్రమే.

———

# 'మహాభారతము'—
# దాని కాలనిర్ణయము

ఆర్యులవిజ్ఞానమంతా వేదసాహిత్యంలో—అంటే వేదాలూ, ఉపనిషత్తులూ, బ్రాహ్మణాలూ, ఉపవేదాలూ కలిసిన సాహిత్యం—ఏవిధంగా నిండి వుందో గత అధ్యాయంలో స్థూలంగా గమనించాము. వేదమంత్రాలూ వాటిని ఉపయోగించే క్రతువులూ, యజ్ఞాలూ, అస్త్రశస్త్రాలూ మొదలైన వైజ్ఞానిక పారిభాషిక విజ్ఞానమంతా, అంటే Scientific & Technical books కలిసి: ఈ వేదసాహిత్యంక్రిందకు వస్తాయి. ఇక మిగిలింది "పురాణవాఙ్మయం", ఈ పురాణవాఙ్మయం గురించి స్థూలంగా ఇంతకు ముందు అధ్యాయంలో వివరించాను.

ఈ ప్రపంచం ఏవిధంగా సృష్టిఅయిందో: అందులోని గ్రహగోళాల పుట్టుక, భూమి ఉద్భవము: ఈభూమ్మీది ఖండాలూ, ఆయాదేశాలలోని ప్రజలు: ప్రపంచంలోని వివిధ పర్వతశ్రేణులు, నదులూ, పుణ్యక్షేత్రాలూ: లక్షలాది సంవత్సరాలుగా జరిగిపోయిన మానవచరిత్ర, అందులో నామరూపాలులేకుండా కాలంలో కలిసిపోయింది. పోగా చరిత్రగా మిగిలిఉన్న రాజులు, అవతారపురుషులు, యుగధర్మప్రవక్తలవంటి చారిత్రక వ్యక్తులయొక్క ఇతిహాసం: మానవజాతికి వారిసందేశం: ఇలా ఈవిధంగా సమీకరించబడిన 'విజ్ఞానసారం'-అంటే చరిత్రవలన మనకితెలిసే గుణపాఠం (Lessons of History)—ఈవిషయమంతా కలిసి, ఈ పురాణాల లోని కథావస్తువు. అంతేగాక చరిత్రమధించగా వచ్చినసారం. ఈనాడు

మానవుడు చదివి నేర్చుకోవలసిన నిత్యజీవితావసరాలైన మహాసత్యాలు: వాటిని అనుష్ఠించటంవల్ల, మానవుడికీ మానవసమాజానికీ ఏవిధంగా మేలు చేకూరుతుంది అన్నవిషయంకూడా మనపురాణాలలోని కథావస్తువే.

ఈ సారాంశాన్ని విడిచిపెట్టి పురాణాలను కేవలం "మతగ్రంథాలుగా" అనువదించటంవల్ల ప్రజలలో ఆ సంస్కృత మూలగ్రంథాలయొక్క నిజస్వరూపంపోయి, వాటిలోని అసలైన విజ్ఞానమంతా అడుగున పడిపోవటం కూడా ఎలాజరిగిందో స్థూలంగా మనకందరికీ తెలుసు. తెలుగులోకి పురాణాలూ వేదశాస్త్రాలవంటి మహాసాహిత్యాన్ని సరిగ్గా అనువదించకుండా —ఆయాకవులు స్వంతపోకడలు పోయి, కల్పనలుచేస్తూ, శతాబ్దాలతరబడి ఈతీరున ఇలాగే జరగటం వల్ల ప్రజల్లో ఈనాడు ఈ పురాణాలయొక్క ముఖ్యసందేశంఏమిటో కూడా అసలే ఎవరికీ తెలియకుండాపోయింది. అందుకే పురాణాలు కేవలం మతగ్రంథాలు కావని ఈనాడు నేను ఇంతగా నొక్కి చెప్పవలసివస్తున్నది.

**పురాణాలలోని మానవచరిత్ర** - పురాణాలు, మానవజాతి యొక్క చరిత్ర, మానవసంస్కృతి యీ భూమిమీద ఏవిధంగా పరిణామం చెందిందో, కోట్లాదిసంవత్సరాలుగాజరిగిన విషయాలు, అతిప్రాచీన భౌగోళిక, ఖగోళవిషయాలూ ప్రపంచంలో మరేసాహిత్యంలోనూ దొరకని శాస్త్ర విషయాలు మొదలైనవెన్నో ఈనాడు మనకి ఈపురాణాలవల్లనే లభిస్తున్నాయి. ఇవిగనక నశించిపోతే, శాశ్వతంగా ఈప్రాచీనాతిప్రాచీనమైన మనభూగోళచరిత్రా, దానితోపాటువచ్చిన అంతులేనివిజ్ఞానం, ఇదంతా కూడా నశించిపోగలదు. ఈకారణంచేతనే భారతీయులమైన మనం యీనాడు మన పురాణాలను సరిగ్గా అర్థంచేసుకోవటం మనఅవసరం, మన విధి, అయి ఉన్నది. అందుకే ఈ అధ్యాయంలో 'పురాణాల్లోని చరిత్ర' (History in the Puranas) అన్న ఒకేఒక చిన్నఅంశాన్ని తీసుకుందాం. ఎందు

కంటే పురాణాల్లోని అనేక శాస్త్రాలగురించి వ్రాస్తే అదివొక్కటే, ఒక పెద్ద గ్రంథంగా అవుతుంది.

అందులోని చరిత్రమాత్రం ఇక్కడగమనిద్దాము. 'మహాభారతం' మనపురాణాల్లోకల్లా ముఖ్యచారిత్రక గ్రంథం. అందుకే దీన్ని 'ఇతిహాసం' అన్నారు.

**మహాభారతము - మన భారతదేశ చరిత్ర :-** మన ఆధునిక చరిత్ర భారతయుద్ధంతోనే ప్రారంభమవుతుంది. అందుకని ఈనాటి మన "చారిత్రక కాలానికీ" అంతకుపూర్వంనడచిన 'పురాణకాలానికీ' మధ్య వంతెనవంటిదీ మహాభారతయుద్ధం. ఇదిజరిగి 5-వేల సంవత్సరాలు పైగా రావస్తున్నది.* బుద్ధిపూర్వకంగా ఈభారతంలోని అనేక చారిత్రకాంశాలని వెలికితీయకుండా, దాచివేసి విదేశీచరిత్రకారులు ఇది కేవలం ఒక కావ్యం క్రిందా ఊహాసంబంధమైన విషయంగానూ, తీసివెయ్యానికి ప్రయత్నం చేసారు. ఈమహాభారతకాలంలోని ప్రముఖ పాత్రధారి శ్రీకృష్ణదేవుడు. శ్రీకృష్ణుడు చారిత్రకవ్యక్తి మాత్రమే కాదు! చరిత్రాత్మకమైన వ్యక్తి. ఆయన మనదేశ భవిష్యత్తునే తీర్చిదిద్దిన నవభారతనిర్మాత, అనేక రాష్ట్రాలుగా, ఏరాజుకారాజు వేరేవేరే అయి, ఐకమత్యంలేక కొట్లాడుకుంటూన్న సమయంలో ఆయన జన్మించాడు. దేశాన్ని సంఘటితంచేసి "రాజసూయ" యాగంమిషగాదేశాన్ని 18 రాష్ట్రాలతోకూడిన ఏకైక ప్రభుత్వాన్ని స్థాపించ

---

* మహాభారతయుద్ధంజరిగి, ఇప్పటికి సరిగా 5072 సం॥లు అయింది. అంటే క్రీస్తుపూర్వం 3138 B. C. నవంబరు నెలలో భారతయుద్ధం జరిగినట్లు చరిత్రవల్ల తెలుస్తోంది.
చూ. "Astrological Magazine Bangalore March 1972 (Page. 293)

టానికే తనజీవితంఅంకితంచేసి అందులో ఎందరువీరులూ బంధువులూ (అవి మన్యువివలే), మిత్రులూ, రాజులు ఆహుతి ఐపోయినాసరే లెక్కచేయక "మహాభారత స్వాతంత్ర్య సంగ్రామాన్ని" విజయవంతంగా పరిపూర్తి చేసి ఢిల్లీలో కేంద్రప్రభుత్వాన్ని స్థాపించి, దానికి ప్రజానురంజకుడూ ధర్మమూర్తీఅయిన యుధిష్ఠిరుడుని పట్టాభిషిక్తుడినిచేసి నిస్వార్థంగా తానేమీ పుచ్చుకోకుండా తిరిగి ద్వారకకుచేరిన దేశభక్తుడు, త్యాగి, మహా రాజనీతి ధురంధరుడు. అందుకే భారతదేశచరిత్రలోనే ఈయన ఒక 'శకకర్త'— యుగపురుషుడు. 'భారతం' అన్నపేరుతో యీనాటికీ మనదేశమంటూ పొకటున్నదంటే అది ఈయన పెట్టిన భిక్షే! రామాయణంలోకూడా మనం ఒక 'భారత' దేశంగా అవతరించడం జరగలేదు. అది నిర్మించినవాడు శ్రీకృష్ణుడే. అందుకే మనం యీనాడు మనచరిత్రలో శ్రీకృష్ణదేవుని "భారత భాగ్యవిధాత"గా పూజిస్తున్నాం. మహానాయకుడు, కర్మయోగి, ఈయన మన భారతదేశ నిర్మాత.

చరిత్రలో ఈయన మహాభారత యుద్ధానికి సూత్రధారిమాత్రమే కాదు. కృష్ణనిర్యాణంతో మహాభారతకాలం అంతమై 'ఆధునిక కాలం' లేక చారిత్రకయుగం (కలియుగం) ప్రారంభమైంది. దీన్నే 'కలియుగాది' అని, మనపంచాంగాలు ఈనాటివరకు జరిగిన సం॥లలెక్కలతో సహా, పంచాంగకాల గణితంలో యీనాటికీ అనుసరిస్తున్నాయి: శ్రీ కృష్ణుని నిర్యాణకాలం, జ్యోతిశ్శాస్త్రాధారాలతో అనేక నూతన విషయాలు ఉదహరిస్తూ విడిగా ఒకగ్రంథంగా వ్రాశాను* పైవివరాలన్నీ చర్చిస్తూ.

---

Note :- * "యుగపురుషుడు"—ప్రచురణ,

పద్మశ్రీ చిత్తూరు నాగయ్య, USCEFI

రచన : ఇ. వేదవ్యాస I A S

ప్రస్తుతం మనకి కావలసిన విషయం మన ఆధునిక చరిత్ర ప్రారంభమయ్యే, ఈ కలియుగ ప్రారంభమైనరోజు సరిగ్గా—(18-2-3102)B. C. నాడు, అని పైన తెలుసుకున్నాం కూడా!

ఇదే శ్రీకృష్ణుడు నిర్యాణంచెందినరోజు కూడా! ఆ రోజు మానవ చరిత్రలోనే మైలురాయివంటిది. చరిత్రాత్మకమైన ఒక ముహూర్తంగా నిలిచిపోయింది ఈ రోజు, మానవచరిత్రలోనే! ఈ తేదీకి మనభారతదేశ చరిత్రలోఉన్న ప్రాముఖ్యత ఏమిటి? అది యీ క్రింది అంశాలలో తెలుస్తోంది.

(1) 18-2-3102 B. C. అర్థరాత్రి సుమారు 12-గంటల కాలంలో ప్రపంచమంతా గాఢనిద్రలో మునిగిఉన్నప్పుడు—ఈ "కలియుగం" అవతరించింది. ఇది ప్రమాదినామ సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమి శుక్రవారంనాడు జరిగినట్టుగా, ఆనాటి గ్రహాల సరళులనుబట్టి 'సైన్సు' (Science) ఆధారంగా విదేశీచరిత్ర కారులైన, Bentley, Mons, Bailley, H. P. Blavatsky మొదలైన పాశ్చాత్యులు కూడా అంగీకరించారు. (కలియుగప్రారంభకాలం నాటి గ్రహస్థితి యింతకుముందు రాశి చక్రంలో ఇచ్చివున్నాను). అలాగే శ్రీకృష్ణుని జనన కాలంకూడా గుణించాను.*

(2) ఇదే సంవత్సరం, హస్తినాపురం (ఢిల్లీ)లో ధర్మరాజు రాజ్య పరిత్యాగంచేసి తమ్ములతోసహా 'మహాప్రస్థానం'గా హిమాలయాలకు ప్రయాణమై వెళ్ళింది.

---

Foot Note : * 'శ్రీకృష్ణుని కాలము—అన్న అధ్యాయం. చూ' వివరాలకు—'యుగపురుషుడు' (పేజీ 29)

(3) ఇదే సంవత్సరంలో ధర్మరాజు మనుమడైన పరీక్షిత్తు హస్తినాపురంలో సింహాసనం అధిష్ఠించాడు. ఇతడు చక్కగా రాజ్యపరిపాలన చేసినట్టు కలియుగంలోని అధర్మం, పాపాలు పైకిరాకుండా నిగ్రహించి ధర్మపరిపాలన చేసినట్టుగా భాగవత, విష్ణుపురాణాలు మనకి తెలుపుతున్నాయి.

(4) ఈ పరీక్షిత్తు, పాముకరచి మరణించగా అతని కుమారుడు 'జనమేజయుడు' హస్తినాపుర సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఈయన చేసిన 'సర్పయాగం' సమయంలో అనేక దానధర్మాలు, బ్రాహ్మణుల కిచ్చినట్టు భారత భాగవతాలు తెలుపుతున్నాయి. మైసూరులో దొరికిన దానశాసనాలు కూడా ఈ విషయాన్ని ధృవపరుస్తున్నవి.

(5) ఈ విధంగా పురాణాలు తెలుపుతున్న అంశాలను ధృవపరచే శాసనాలూ, మన ప్రాచీనచరిత్ర ధృవపరుస్తూ మనకినాటికీ సాక్ష్యంగా ఉన్నాయి. కాని ఇవేవీ ఎరగనట్టు యిటువంటి శాసనాలే లేనట్టు విదేశీయులే కాకుండా మన దేశంలోని History ప్రొఫెసర్లుకూడా నటించడం మాత్రం ఆశ్చర్యం, విచారం వేస్తుంది.

(6) కలియుగం ప్రారంభమైన సంవత్సరంలోనే అంతర్యుద్ధంతో యాదవులరాజ్యం నాశనం అయింది. ఆదేసమయంలో ఒక భూకంపం, జల ప్రళయమూ సంభవించింది. ద్వారకానగరం సముద్రపు ఉప్పెనలో మునిగిపోయింది.*

---

* Era Diluvii (జలప్రళయశకం) అన్న పేరుతో 17–18 ఫిబ్రవరి–క్రీ. పూ. 3102 గురువారం-కరం 'అల్బెరూని' తెలిపిన వైదిలులోని 'ఆదమ్' శకం Era Adami ని ధృవపరుస్తూ బర్గెస్ 'ఇండియన్ యాంటిక్వరీ' (Indian Anti-quary (1901) వ్యాసం చూడు.

(7) ఇదే విదేశీగ్రంథాల్లో "జలప్రళయం" లేక Deluge* అనే పేరుతో వ్యవహరించబడుతున్నది. ఈ జలప్రళయం జరిగిన విషయం బైబిలులోకూడా వివరంగా ఉన్నది.

(8) 'అల్‌బెరూని' అనే మహమ్మదీయ చరిత్రకారుడు ఈ 'జల ప్రళయం' జరిగినతేదీని సరిగ్గా లెక్కకట్టి మన కలియుగ ప్రారంభకాలమైన శ్రీకృష్ణుని నిర్యాణకాలంగా ఋజువుచేశాడు. ఆ తేదీ 17 ఫిబ్రవరి 3102 B. C. గురువారం అని తేలింది.

-(Indian Antiquary 1901)

(9) 'ఇండియన్ ఏంటిక్వరీ' అనే గ్రంథంలో 'బర్గెస్' పండితుడు (Burgess) పై విషయాలను తెలిపే తన సిద్ధాంత వ్యాసంలో ఈవిధంగా వ్రాశాడు*

"జలప్రళయం జరిగిన శకం" ...గురువారం 17వ తేదీ ఫిబ్రవరి 3102 క్రీ.పూ. ఐడిలరు పండితుడు ఈజిప్షియన్ సం॥లో యీ శకం భారతీయుల 'కలియుగం' ఆరంభమైన శకకాలంతో. అంటే శుక్రవారం అర్ధరాత్రి 17-18తేదీల నడుమ-ఫిబ్రవరి 3102క్రీ.పూ. లేక చంద్రునిలెక్కప్రకారం

---

* Foot Note :— A era Diluvii :—

588465 Thursday, 17–18 th February* 3102 B. C. Egyptian years and Months.

* Ideler says Friday (see P. 405). This Era is the same as the Kali Yug which began at midnight 17–18 th February 3102 B.C The lunar Ahargana is counted from Thursday, the solar from Friday."

పై లెక్కలనుబట్టి చూడగా బైబిలులో వాళ్ళ 'సృష్టి' అని చెప్పబడే 'ప్రళయకాలం' మన 'కలియుగం' ఆదిలో కృష్ణనిర్యాణం సమయంలో జరిగిన జలప్రళయమేనని తెలుస్తోంది.(దీంట్లోనే ద్వారక సముద్రంలో మునిగిపోయింది. చూ. భాగ. 10 స్కం.)

588465 వరోజు, గురువారం-లగాయితులెక్కిస్తారు. సౌరదినాలు సూర్యుని గతితో లెక్కించే లెఖ్కమాత్రం శుక్రవారంతో ప్రారంభం అవుతుంది.

(10) అదే సంవత్సరం కురుపాండవ వినాశమూ, ఘోరమైన భారతప్రపంచయుద్ధమూ, ఆతర్వాత జరిగిన యాదవుల అంతర్యుద్ధం రెండూ చూచి వ్యాసమహర్షి మనస్సు క్షోభించి మానవజాతికి శాంతి, ధర్మం, సత్యం గాఢంగానాటుకొనేలాగ సందేశమిచ్చే 'మహాభారత' మనే చరిత్ర వ్రాయడం ప్రారంభించాడు.*

(11) "జయ" మనే పేరుతో వ్యాసమహర్షి కేవల చరిత్ర విషయా లను సంక్షేపిస్తూ ఈ కలియుగం మొదటిసంవత్సరంలోనే రచించాడు. తర్వాత ఇదే గ్రంథాన్ని మహాభారతంగా పెద్దదిచేసి, అనేక ధర్మాలూ, నీతికథలూ, యోగశాస్త్రవిషయాలూ, హిందువులకు ప్రాణమైన భగవద్గీత, విష్ణుసహస్ర నామం మొదలైన మోక్షధర్మప్రతిపాదకాలైన విషయాలతో నిండివున్న మహాభారతంగా రచించాడు. ఇది 'పంచమవేదం'గా—అంటే వేదాలలో ఉన్నసారం అంతా—స్త్రీలకూ, పామరజనానికీ కూడా తెలిసేలాగ సరళమైన భాషలో వ్యాసమహర్షి రచించారు. "స్త్రీ, శూద్ర ద్విజ బంధూనాం త్రయీ నశ్రుతిగోచరా. ఇతి భారత మాఖ్యాతం" అంటూ.

ఇదే ఈనాటి మనకి లభించే చరిత్ర. మన ఆధునిక చరిత్రలోనే ఇది మొదటి అధ్యాయం. మహాభారతయుద్ధం మన కలియుగ ప్రారంభమూ కలిసిఉన్నాయి. యీ చరిత్ర ప్రారంభంతోనే. ఇది నవీన యుగానికి మెలురాయి.

---

Foot Note :— * "ఊర్ధ్వ బాహు ర్విరౌమ్యేష
న చ కశ్చిత్ శృణోతి మే"

(చేతులెత్తి ఆక్రోశిస్తున్నా నా సందేశం యీ మనుషులు వినడం లేదు') అని వ్యాసమహర్షి వాపోయారుగదా!

**మహాభారతంలోని చారిత్రక అంశాలు :-** మహాభారతం లోనిది నిజంగా జరిగిన చరిత్రేనా ? అని యీనాడు మనకి అనుమానం రావచ్చు. ఇంగ్లీషు విద్యావిధానంలో తయారైన మన మనస్సులకి అలా అనిపించడం సహజమే ! కాని సంస్కృత మహాభారతం చదివితే అందులోని విషయాలన్నీ యథార్థంగా జరిగినవేనని, అందులోని పాత్రలు నిజంగా జీవించిన వ్యక్తులేనని తెలిపే విషయాలు అనేకం మనకీనాటికీ దొరుకుతాయి. దీనికై అనేకమంది పరిశోధన చెయ్యాలి. ఇలాగ పరిశోధనచేసి శ్రీకృష్ణుని జీవితంలో నిత్యదినచర్య మొదలు ఆయన పుట్టినతేదీ, మరణించిన సమయం ఆయన జాతకం, భగవద్గీత ఉపదేశించినప్పుడు శ్రీకృష్ణుని వయస్సు మొదలైన అనేకవిషయాలు సంస్కృత మహాభారతంలోంచి సేకరించగలిగాను. అవన్నీ "యుగపురుషుడు" అనే గ్రంథంలో ప్రచురింపబడింది. అంతేగాక పాండవుల జననం, వారు ఎప్పుడు పుట్టినదీ, టైము, తేదీలతో సహా, లెక్కించుకోడానికి కావలసిన అంశాలుకూడా ఎన్నో మహాభారతంలో ఉన్నాయి. అంటేనే చాలామందికి ఆశ్చర్యం కలగవచ్చు. అందులో కొన్ని అంశాలు మాత్రం మచ్చుకి ఈ క్రింద ఉదహరిస్తాను. ఏనాటికైనా సంస్కృత భారతం చదవాలనే కుతూహలం, ఈ విషయాలు తెలుసుకున్న ప్రతీ హిందువుడి హృదయంలోనూ పుట్టగలదని ఆశతో ఈ క్రింది వివరాలు వ్రాస్తున్నాను :—

(i) అర్జునుడు తీర్థయాత్రలతో 12 మాసాలు గడిపి ద్వారక చేరుకుని సుభద్రను వివాహం చేసుకునే సమయంలో ఒక అపూర్వమైన గ్రహస్థితి జరిగినట్లూ—శ్రీకృష్ణుడు ఆ గ్రహాల శాంతికై పూజలూ, జపాలూ, శాంతులూ జరిపేనిమిత్తమై యాదవులను ఆజ్ఞాపించినట్లు తెలుస్తున్నది. ఆ సంవత్సరం శని, గురు, కుజుల మూడుగ్రహాల అపూర్వ సంయోగంలో, ఆగ్రహాలు వక్రించడం, ఇది చారిత్రకంగా జరిగిందని, మన పంచాంగాల వల్లా, ఆనాటి గ్రహస్థితులు లెక్కించడంవల్లా ఋజువవుతున్నది.

(ii) అర్జునుడు గాంధర్వ విధిలో సుభద్రను వివాహం చేసుకు తీసుకొనిపోయిన రోజు వైశాఖశుద్ధతదియా, మకరలగ్నంలో జరిగినట్లు గానూ, తర్వాత అభిమన్యుడు మాఘమాసంలో జన్మించినట్లూకూడా తెలు స్తున్నది. (మరుసటి సంవత్సరం). ఇతడు 16 సంవత్సరాలు జీవించి, భారతయుద్ధంలో ప్రాణాలు కోల్పోయిన మహావీరుడు*.

(iii) భీష్ముడు మాఘశుద్ధ అష్టమి రోహిణీ నక్షత్రం మధ్యాహ్నం సుమారు 12 గంటలకు మరణించినట్లు మహాభారతం తెలుపుతున్నది. (శాంతిపర్వం—46వ అధ్యాయం. అనుశాసనిక—అధ్యా. 272, 274.)

(iv) భారతయుద్ధం జ్యేష్టానక్షత్రం, అమావాస్య కలిసిన రోజున ప్రారంభమైనట్లు శ్రీకృష్ణుడు కర్ణునితో చేసిన సంభాషణవలన తెలుస్తున్నది. (ఉద్యోగపర్వము - 142 వ అధ్యాయము.)

(v) పాండవుల జననము :-

(vi) ధర్మరాజు :—జ్యేష్టశుద్ధపంచమి తిథినాడు, జ్యేష్టా నక్షత్రం మధ్యాహ్నం 12 గంటలకు అభిజన్ముహూర్తంలో జననం (ఆదిపర్వం-7వ అధ్యాయం—సంభవపర్వం-129వ అధ్యాయం 21వ శ్లోకం)

(vii) భీమసేనుడు :— త్రయోదశి కృష్ణపక్షం, మఘా నక్షత్రం 'రోహిణీ' ముహూర్తంలో (—9వ ముహూర్తంలో) జననం.*

---

Foot Note :—

| | | |
|---|---|---|
| * అభిమన్యుని జననం— | 1 | సంవత్సరం |
| పాండవుల వనవాసం— | 12 | సంవత్సరాలు |
| అజ్ఞాతవాసం — | 1 | సంవత్సరం |

14

భారతయుద్ధంనాటికి 15 సంవత్సరాలు పూర్తయి 16వ సంవత్సరంలో అభిమన్యుడు విహతుడైనాడు. పుష్యమాసంలో అభిమన్యుడు మరణించి నట్లు సంస్కృత భారతం తెలుపుతున్నది.

* భీమసేనుడు :— అధ్యాయం—130. శ్లో. 66.

అర్జునుడు :—అధ్యాయం—132. శ్లో.17—అధ్యాయం.134 శ్లో.9.

(viii) అర్జునుడు :—మాఘమాసంలో పూర్వ-ఉత్తరఫల్గుణీ నక్ష
త్రాల్లో అర్జునుని జననం. శ్రీకృష్ణుడు అర్జునుడూ ఒకే వయస్సులోని
వారు. దాదాపు కొద్దిరోజుల తేడాలో జన్మించారు.

(ix) పాండవులందరూ సంవత్సరంతేడాతో అయిదుగురూ అయిదు
సంవత్సరాల యుగంలాగ జన్మించారు. (అధ్యాయం-133-శ్లో.124.)

(x) బలరాముడు :— శ్రీకృష్ణుని అగ్రజుడైన బలరామదేవుడు
కృష్ణునికన్న -3సంవత్సరాలు పెద్దవాడు. (అధ్యాయం-134-శ్లో-9.)

ఇదే విధంగా మహాభారతంలోని ప్రముఖ పాత్రల కాలంకూడా స్పష్టంగా ఈనాటికీ మనకి తెలిసే విధంగా అనేక ఆధారాలు లభిస్తూండగా 'మహాభారతంలోని పాత్రలు నిజంగా జీవించారా ?' అని అనుమానించడం కేవలం మూర్ఖత్వమే అవుతుంది. ఆ వ్యక్తులు చారిత్రక వ్యక్తులని తెలియడానికి వాళ్ళ జననకాలమే ఆధారం.

ఇంతేకాక, ఏరోజున యుద్ధంప్రారంభమైందీ, ఎన్నిగంటలకు ప్రారంభమైందీ, ఏయే రోజున, ఎవరెవరు హతులయ్యారో: అప్పటి తిథి వారనక్షత్రాలూ: ఏరోజున శ్రీకృష్ణుడు రాయబారం బయలుదేరివెళ్లాడో, ఆమాసం, ఆనాటి నక్షత్రం, ముహూర్తం, ఒక్కటీ విడిపోకుండా ప్రతి చిన్నవిషయాలుకూడా వ్యాసమహర్షి చరిత్ర గ్రంథమైన మహాభారతంలో శాశ్వతంగా వ్రాసిపెట్టాడు. ప్రపంచంలో ఏయితరచరిత్రకారుడూ (ఈనాటి ఆధునికచరిత్రకారులతోసహా) వ్రాయని విధంగా అతిసూక్ష్మమైన వివరాలతో ఆనాటి సంఘటనలూ, వ్యక్తులూ, వాళ్ళ కాలం, నిర్ణయంచేసి గణితం చేయడానికికూడా అనుకూలమైనవిధంగా మహత్తరమైన చారిత్రక గ్రంథంగా ఆనాడు వ్యాసమహర్షి రచించాడు. ఇవన్నీ చదువుతుంటే ఆయా వ్యక్తులూ, ఆ సంఘటనలూ, కళ్ళకు కట్టినట్టు కనబడతాయి. అదంతా చదువుతూంటే

అని జరుగుతుండగా చూచిన, ఒకవ్యక్తి అనాటి సమకాలికుడైనవాడు కళ్ళతో చూసి వ్రాసిన ఇతిహాసమే ఇది. అని నిశ్చయంగా దృఢపడుతున్నది.

అంతేగాక కావ్యంలో సామాన్యంగా కవులు చేసినట్లు తను పాత్రల లోని లోటుపాట్లను కప్పిపుచ్చి సంఘటనలను సరిదిద్ది మెరుగులు పెట్టడం లాంటివి చేయకుండా, జరిగిన విషయాల్ని జరిగినట్లు, యధాతథంగా లిఖించాడు వ్యాసమహర్షి. అందుకే మహాభారతంలో ఎవరెవరు ఏయే తప్పులు చేశారో కూడా, ఏ అక్రమాలూ అన్యాయాలూ, పశుప్రవర్తనా, అధర్మాలూ ఇత్యాది సంఘటనలు ఆ పాత్రలలో ఎవరు చేసినాసరే, వాటికి ఎటువంటి మెరుగులూ పెట్టకుండా, తన కవితాశక్తితో వాటిని మరుగుపరచకుండా, తానొక మహత్తర చరిత్రకారుడిలాగ, అన్ని విషయాలూ జరిగినవి జరిగినట్టు తెలుపుతోంది, సంస్కృతమహాభారతంలోని వ్యాస రచన. ఇలాంటి అంశాలే అభిమన్యుడివధ, సభలో ద్రౌపది వస్త్రాపహరణం, భీముడు దుర్యోధనుని అక్రమ యుద్ధంలో తొడలు విరగగొట్టడం, ద్రోణవధ, కర్ణ భీష్మల వంటి మహావీరుల హత్య, ఆభీరులవల్ల అర్జునపరాభవం, యాదవ వినాశం, కృష్ణ భార్యల అపహరణ (అష్టభార్యలు కాదు); ఇత్యాది అనేక చారిత్రక విషయాలను, కథలో ఏమీ మార్పుచేయకుండా వ్యాసమహర్షి ఇలా యథాతథంగా వ్రాసిన చరిత్రే మహాభారతమని స్పష్టంగా తెలుపుతున్నాయి. ద్రౌపదిని అయిదుగురు భర్తలు వివాహం చేసుకోవడం, యాదవులకు దుర్వాసుని శాపం, శ్రీకృష్ణునికి గాంధారీశాపంకూడా ఇటువంటివే.

మహాభారతము నిజంగా జరిగిన చరిత్రేనని చెప్పడానికీ, అందులోని వ్యక్తులు సంఘటనలూ ఊహలుకావని తెలపడానికింతకంటె ఏం నిదర్శనం కావాలి ?

# భవిష్యపురాణం - భారతదేశచరిత్ర

మనలో ప్రతివాడూ జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు, తన భవిష్యత్తు ఎలాఉంటుందో తెలుసుకోవాలని ఆశపడనివాడు వుండడు. జీవితం ఒకప్పుడు సుఖంగానూ, దిగ్విజయంగానూ, నడుస్తూఉండటం, మరొకప్పుడు కష్టాలూ సమస్యలే ఎదురుకావడం అనేది అందరికీ అనుభవమే. ఇలా కష్టాలు దాపురించినప్పుడూ, సమస్యలు ఎదురైనప్పుడూ 'మన భవిష్యత్తు ఎలా ఉంటుందో తెలుసుకోవాలని' మన మనస్సు సహజంగానే ఉబలాట పడుతుంది.

అలాంటి పరిస్థితే దేశం విషయంలోనూ కలుగవచ్చు. "మన భారత దేశం భవిష్యత్తు ఎలావుంటుంది?" మన స్వాతంత్ర్యం సుస్థిరంగా ఉంటుందా? లేక పరదేశాల దురాక్రమణ, ఇతరుల కాలిక్రింద బానిసత్వం మనకేదైనా వ్రాసిపెట్టి ఉందా? గతంలో జరిగినట్టే రానున్న భవిష్యత్తులో ఈ దేశపు రాజకీయజీవితం ఎలాగనడుస్తుంది? అని శ్రీకృష్ణుడంతటి మహామహుడు నిర్యాణంచెందిన సమయంలోనే, పరీక్షిత్తుకు సందేహం కలిగింది. ఆయనకి అదృష్టవశాత్తూ ఆ భవిష్యత్తును యోగదృష్టిలో చూచి చెప్పగల శుకయోగి ప్రక్కనేవున్నాడు. అంతే లేదా:

ఈ కలిగిన సందేహానికి సమాధానంగా శుకయోగి జరుగనున్న భావి కాలగతులూ అందులో దేశంయొక్క భవిష్యత్తూ తన దివ్యదృష్టితో దర్శించి రానున్న కాలంలోని సంఘటనలన్నీ వివరంగా కళ్ళకు కట్టినట్టువర్ణిం

చాడు. ఈవిషయం ఈనాడు 'బమ్మెరపోతన' రచించిన 'ఆంధ్రభాగవతం'లో ద్వాదశస్కంధం చదివితే మన కళ్ళకు కట్టినట్లు స్పష్టంగా కనపడుతుంది.

ఈ ద్వాదశ స్కంధంలో మనదేశచరిత్ర అంతా మొదటినుంచి చివరి దాకా వర్ణించబడి ఉంది. రాజులపేర్లతోసహా, వారివారి వంశాలా, ఎవరు ఈ దేశాన్ని ఎంతకాలం పరిపాలిస్తారో; అవన్నీకూడా మనం 'భవిష్య పురాణం' లో చూడవచ్చు. ఈ భవిష్యపురాణం, భాగవతంలో శుక యోగి చెప్పిన ద్వాదశ స్కంధంలోని విషయాల్నే, విస్తరించి ఇంకా వివరాలతో వ్రాయబడినది.

రానున్నకాలపు ప్రజలకోసం దేశభవిష్యత్తును అన్నివివరాలతో సహా ఈ భవిష్యత్‌పురాణం స్పష్టంచేస్తుంది. ఈ భవిష్యత్పురాణ గ్రంధం ఈస్టిండియా కంపెనీ (East India Company) వారి పరిపాలనలోనే ముద్రించబడింది. ఇది ముద్రించబడినతర్వాత అనేక విషయాలు ఇందులో వ్రాయబడినవి. దేశచరిత్రలో జరిగాయి.

## దేశ భవిష్యత్తును దర్శించడం అసంభవమా :—

ఒకమనిషి భవిష్యత్తు జాతకం చూచి చెప్పవచ్చునుకాని, దేశభవిషత్తు చెప్పటము ఎలాగు సాధ్యం ? అని మనలో చాలామందికి ఆశ్చర్యం కలుగ వచ్చు ! నిజమే. ఇది మనకు అసాధ్యంగా కనబడవచ్చు.

కాని మానవచరిత్ర్లో పూర్వం అనేకమంది మహర్షులు, ద్రష్టలు, ప్రవక్తలు మనుషులయొక్క, దేశంయొక్క భవిష్యత్తు ముందుగా చెప్పడం, తర్వాత—అచెప్పినవి చెప్పినట్లుగాజరగడం, ఈనాటి ఆధునిక కాలంలో కూడా మనం అనుభవంతో గ్రహించిన నగ్నసత్యం.

"కీరో"(Cheiro)అనే పేరుతో ఒక ఇంగ్లీషు యువకుడు అనేక మంది వ్యక్తుల భవిష్యత్తునూ, ప్రపంచ భవిష్యత్తునూ చెప్పి. ప్రపంచాన్ని ఉర్రూతలూగించాడు. ఈయనొక ప్రపంచ ప్రఖ్యాత జ్యోతిష్కుడు. "బోల్షివిక్" విప్లవం రష్యాలో రాకముందు "జారు"చక్రవర్తి తనభవనంలో (Winter Palace)తన జాతకాన్ని "కీరో" ద్వారా తెలుసుకున్నాడు. రష్యన్ విప్లవం, అందులోని రక్తపాతం—"జారు"వంశస్థుల పరిపాలన అంతంకావటం ఇవన్నీ కూడా "కీరో"ముందుగానే చెప్పిన సంగతి ఆనాటి వార్తాపత్రికలు చూచిన వారందరికి తెలుసును.

ఇంకోసంగతి, బ్రిటిష్‌ప్రభుత్వంలో సర్వసేనానిగా పనిచేసిన "లార్డ్‌కిచెనర్" (Lord Kitchner) సముద్రంలో మునిగి మరణించే జరగడం, బెల్జియం రాజైన లియోపాల్డు చక్రవర్తి (King Leopold) రాజ్యభ్రష్టత, దేశబహిష్కారం జరగడం, విక్టోరియా మహారాణిమరణం పర్ష్యాదేశపు "షా" (Shah)పైనా ఇరాన్‌దేశపు రాజులపైని హత్యా ప్రయత్నాలు, గాంధీమహాత్ముని "సహాయనిరాకరణోద్యమమూ"(Non-Cooperation Movement)భారతదేశ స్వాతంత్ర్యమూ, ఇలాంటివన్నీ కూడా ఎన్నో సంవత్సరాలకిముందే 'కీరో' ప్రపంచమంతా ఆశ్చర్యపోయే లాగ, ముందుగానే తన రచనలద్వారా, గ్రంథాల ద్వారానూ ప్రకటించాడు. ఇవి యీనాటికీ గ్రంథాలలో చూడవచ్చు.

ఏనాడో అంటే1923–వసంవత్సరంలోనే,మనదేశానికిస్వాతంత్ర్యం వస్తుందని ఎవరికీ ఊహలోకూడా నమ్మకంలేని కాలంలో—ఆనాడె కీరో తన "ప్రపంచ భవిష్యత్తు" అనే గ్రంథంలో (Cheiro's World Predictions) మన స్వాతంత్ర్యం గురించి వ్రాశాడు. యీ క్రింది వాక్యాలు:—

"గ్రహస్థితులు సర్వవిధాలా ఇంగ్లండుకు ప్రతికూలంగా ఉన్న

ఇటువంటి కాలంలో భారతదేశాన్ని తనచేతిక్రింద ఉంచుకోవాలని బ్రిటను ప్రయత్నం చేయడం కేవలం భ్రమ. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చితీరుతుందనేది ఖాయమైనవిషయం. బ్రిటనువీనిని ఆపుచేయాలనిప్రయత్నించడం సముద్రపుఅలల్నివెనక్కి పొమ్మని ఆజ్ఞాపించడం లాంటిది. ఆకాశంలో తిరిగే చంద్రుణ్ణి నిలిచి పోమని కోరటం వంటిది. ముందుగానే స్నేహ భావంతో, బుద్ధి పూర్వకంగా భారతదేశానికి స్వాతంత్ర్యంఇచ్చినట్టయితే కనీసం ఆదేశపుసహృద్భావంమనకు దక్కుతుంది.*—(కీరో "ప్రపంచ భవిష్యత్తు")

ఇంతేకాదు: మనదేశానికి స్వాతంత్ర్య రాగలదని రూఢిగా, చెప్పడమే కాకుండా ప్రఖ్యాత బ్రిటిషు జ్యోతిష్కుడైన ఈ "కీరో"—ఇండియా పాకిస్థాన్ల రూపంలో దేశవిభజన జరగడం కూడా, తథ్యమని—తనగ్రంథంలో నిస్సంశయంగా చెప్పిన యీ మాటలే అందుకు తార్కాణం:—

> "భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినతర్వాత హిందువులూ ముస్లిములూ కలిసిమెలిసి ఐకమత్యంగా దేశాన్ని, పరిపాలించుకుంటారనేమాట కల్ల! అసంభవం. జరగబోయే దేమిటంటే, దేశంలో రాబోయే మతకలహాలూ, రక్తపాతమూ. దేశాన్ని రెండుగా చీల్చివేస్తాయి. —'కీరో' "ప్రపంచ భవిష్యత్తు."

---

Foot Not :—* "If this, then, is the "Voice of Heavens" ,how can England hope to hold India' a country that, in the events that are coming will respond more to Aquarian influence then, Perhaps any other· No ! England with all her power, Might just as well tell the Sea to go back or the Moon to stand still, then to attempt to stem planetary forces that, for the time being' are arrayed against her."

"That Buddists and Mohammedans will join together to make India a united nation, is out of the question. The utmost one hopes for is that, in a native Government they would form opposition parties and so rule the country together. The danger is, however a form of religious-civil war that will keep the country in a state of continued upheaval."

ఈవిధంగా దేశభవిష్యత్తును అనేకమంది ముందుగా దర్శించి చెప్పిన విదర్శనాలు మనకాలంలోనే జరుగుతున్నాయి ఇందులో ఎలాంటి అసంభవమూ లేనప్పుడు, వ్యాసమహర్షివంటి మహాయోగి ; దివ్యదృష్టి సంపన్నుడికి 'భవిష్యపురాణం'లో వ్రాసిన విధంగా, దేశానికి జరగబోయే భవిష్యత్తును ముందుగానే వ్రాయడం సంభవమా ? అని మనం ఆశ్చర్యపోనక్కరలేదు. ఈ నాటికీ అనేకమంది విదేశాల్లోకూడా, జరగబోయే భవిష్యత్తును చెప్పిన జ్యోతిష్కులూ, యోగులూ, దివ్యదృష్టికలవారూ ఇంకా ఎంతోమంది యీ రోజుల్లో కూడా వుండటమే, దీనికి తార్కాణం.

అందువల్లనే భవిష్యపురాణం నిజమైన భారతదేశచరిత్ర—అని పై విషయాలవల్ల చూచినా ఋజువు అవుతున్నది. "నాడీగ్రంథాల"లో కూడా యీ భవిష్యపురాణంలోలాగే, మనుష్యుల పేర్లుకూడా జరుగనున్న భవిష్యత్తుతో బాటు, ఇవ్వబడినాయి.

## భవిష్యత్తు, నాడీగ్రంథాలూ—
## విదేశాలలోని అనుభవాలు :—

అమెరికాలో 'డిక్సన్ సతి'(Mrs. Dixon) ఇటీవలనే అమెరికా భవిష్యత్తు ప్రపంచ భవిష్యత్తు ముందుగానే చెప్పడం, అవి యథాతథంగా

జరగడంకూడా, అమెరికాలో ప్రచురించిన పుస్తకాలవల్ల మనకి తెలుస్తున్న సత్యమే.

కెన్నెడీ అమెరికా ప్రెసిడెంటుగా రావడం, తర్వాత అతడి హత్య, రష్యాచే రోదసిలోకి ఉపగ్రహం ప్రయోగించబడడమూ, క్రుశ్చేవ్ పతనం 1962 లో—జరిగిన అష్టగ్రహకూటమి. అదేరోజున హిమాలయ పర్వతాలలో ఒకమూల ఆశ్రమములో—ప్రపంచాన్నే మార్చివేయగల ఒక 'అవతారపురుషుడి' జననం—ఇవన్నీకూడా 'డిక్సన్ సతి' (Mrs. Dixon) తన దివ్యదృష్టితో తెలిపింది. ఇలాంటి సాక్ష్యాలు కొల్లలు.* యీ పుస్తకాలు ఎవరయినా చూడవచ్చు.

ఇలాగే 17వ శతాబ్దంలో షిప్టన్‌సతి (Mother Shipton) అనే యోగిని, యూరపుకు జరుగనున్న భవిష్యత్తుసంతా చిన్న చిన్న ద్విపద పద్యాల్లో (Complete) రచించింది. నోస్టర్‌డేమస్ (Nastradamous) అనే పేరుగల ఫ్రెంచియోగి, జ్యోతిష్కుడూ, యూరపు భవిష్యత్తు సంతా పద్యాల్లో ప్రకటించడం పాశ్చాత్యు లందరికీగూడా తెలిసిన సత్యమే. అందుకే ఈనాటికీ ఇంగ్లండును పరిపాలించిన ఏరాజుకూ జ్యోతిష్కులు నిర్ణయించిన ముహూర్తం లేకుండా పట్టాభిషేకం జరగదు. ఇంగ్లండు ఇన్నాళ్ళు మనల్ని పరిపాలించినా, ఈ రనీసపుచరిత్ర ఎరుగని భారతీయులున్నారంటే అది గ్రుడ్డితనం, మన దురదృష్టమే అనాలి. అలాగేభారత దేశం

---

Note :- * "Crystal Ball"లో శ్రీమతి డిక్సన్ జీవితము (Mrs· Dixon) గ్రంథంగా వచ్చింది. ఇది ఆవిడ అద్భుతశక్తులను గురించిన పుస్తకము. ఇంకా 'డిక్సన్ సతి'ని గురించి ఒక అద్భుత వ్యాసము :. "Reader's Digest" sept 1965 సంచికలో చూడవచ్చు.

లోనూ, ఇదివరలో దేశభవిష్యత్తును దర్శించి చెప్పిన యోగులు అనేకమంది ఉన్నారు. వారి గ్రంథాలు ఈనాటికీ మనం చూడవచ్చు. వీరబ్రహ్మం గారు సంస్కృత శ్లోకాల్లో రచించిన 'కాలజ్ఞానం' అనే గ్రంథమూ, సిక్కు-మత గురువైన 'గురుగోవిందసింగు', 'గురునానక్'లు వ్రాసిన రానున్న అవతారవిశేషాలూ, శ్రీశైలంలో యోగసమాధిలోఉండి-శివాజీమహారాజు* భారతదేశ భవిష్యత్తును చెప్పిన విషయాలూ అన్నీకూడా ఈ తరగతిలోనివే.

ఇంకా ఇటువంటివి అనేక సాక్ష్యాలు ప్రత్యక్షంగా నిరూపిస్తున్న విషయం-ఎంతమూఢుడికైనా అర్థమయ్యే నగ్నసత్యం అసత్యమేమిటంటే దివ్య దృష్టితో, లేదా జ్యోతిషంతో దేశభవిష్యత్తును ఏనాడో వ్రాసిపెట్టినరచనలే, అవి. అలాంటి "దేశభవిష్యత్తు తెలిపేదే మన 'భవిష్యపురాణం.' కూడా !

## "భవిష్యపురాణం" - భారతదేశపు భవిష్యత్ చరిత్ర :-

ఈనాటి చరిత్రకారులు పురాణాల్లో వ్రాయబడింది సరైన చరిత్ర కాదని, అది తాము సరిదిద్ది, ఋషులు వ్రాసిన తప్పులు లేకుండా—తెల్ల దొరలు అభిప్రాయాన్ని అనుసరించవ్రాసిందే నిజమైన చరిత్రఅన్న ప్రచారం—ఇప్పటికీ శతాబ్దంపైగా జరుగుతున్నదే! అందువల్ల పురాణాలంటే భారతీయుల్లో అగౌరవం, నిరాదరణ పెరిగితే, అది క్రైస్తవమత వ్యాప్తికి తోడు పడుతుందనే ఉద్దేశ్యంతో బ్రిటిషుసామ్రాజ్యవాదులుచేసినకుట్ర. అవి తెలిపే అనేక ప్రమాణాలు మనకీనాటికీ చరిత్రలో లభిస్తున్నాయి. ఇలాటి వనేకం ముందుముందు అధ్యాయాల్లో తెలుసుకుందాం.

దీనికి కారణం, మొదటగా మనదేశ చరిత్రవ్రాసిన రచయితల్లో చాల మంది క్రైస్తవ మిషనరీలూ: పాదరీలే! వాళ్ళు సద్భావంతో భారతజాతిని

---

Foot Note :- * శివాజీమహారాజు తెలిపిన మనదేశ భవిష్యత్తు- "The Grand Rebel" అన్న గ్రంథంలో Charles Kincaid వ్రాసినది. చూ.

ఉద్ధంచడానికని మన చరిత్ర వ్రాయలేదు. అన్నివిధాలా హిందూదేశచరిత్రను ఆ చరిత్రకాధారమైన హిందూవుల పురాణాలనూ, హిందూ సంస్కృతినీ హిందూజాతినీ; చివరికి హిందూదేశాన్నే అగౌరవపరచి హిందూవులు నీచులని, ఈ సంస్కృతి నీచమైనదని, మనల్ని నమ్మించే ఉద్దేశ్యంతోనే వారు మన చరిత్రనీ తారుమారు చేయడం మొదలుపెట్టారని, 1700-1900 మధ్యకాలంలోని విదేశీచరిత్రకారుల రచనలు చదివితే తెలుస్తుంది. అటు వంటి కొన్ని మచ్చుతునకలీ క్రింద ఉదహరిస్తున్నాను.

The Puranas in general contain no authentic history, there is no plot, no finish, no humour, no wit, no poetry, but mere versification and continuation of irrelevent and incoherent facts—

—Rev. Benerjee.

"ఈ పురాణాలలో చరిత్రగాని, సరైన కథగాని, కవితాశక్తిగాని, శిల్పంగాని, సరైన కథనంగాలేవి. చెత్త పద్యాలతో అర్థంలేని విషయాలు కలగాపులగంగా ఉంటాయి."

—రెవరె. బెనర్జీ.

Monier Williams says: - The complete list of 18 Puranas given in all the Puranas is absurd and must therefore be later interpolations.

మూనియరు విలియంస్ ఇలా రాశాడు :— "18-పురాణాల జాబితా, అన్నిపురాణాల్లోనూ, ఈయబడిన ఈ 18-పురాణముల పేర్లూ. అర్థంలేనివి : కేవలం అబద్ధం. అందుచేత అవి ఇటీవల కల్పించబడినవే అయి ఉంటాయి". ఇలాంటి ఉదాహరణ లెన్నో ఇంకా వున్నాయి.

ఇకపోతే ఒక్క విషయం మిగిలిఉన్నది. అది ఈ తెల్లదొరలు చేసిన దుష్ప్రచారం-మన పురాణాలలోని భారత దేశ చరిత్ర, జరగనున్న భవిష్యత్తుగా

వ్రాయబడలేదట ? అంతేగాదు. ఆ సంఘటనలు జరిగిన ఎంతోకాలానికి తర్వాత మనం అది అంతా వ్రాసి ఆ భవిష్యత్ రాజులచరిత్ర-అన్నపురాణ భాగాన్ని వ్రాయటం, అందులో చొప్పించటం, జరిగిందట ! వీరి కల్పనలకూ. దుష్ప్రచారాలకూ హద్దులేదా ?

ఇంతేకాదు. ఇంకొక ద్వేషపూరితమైన అసూయావాదాన్ని కూడా అనాటి బ్రిటిషు సామ్రాజ్యవాదుల పవిత్రమైన క్రైస్తవ పాదరీలు మిషనరీలూ —యీ పురాణాలు,గుప్తరాజుల కాలంలో వ్రాయబడినవని, ఇంకో అర్థంలేని వాదాన్నికూడా లేవనెత్తారు. దీనికి ఋజువేమిటి? అని మనం అడిగితే-సమాధానం—"పురాణాల్లోని రాజులచరిత్ర గుప్తరాజుల వరకే ఉన్నదిగనుక: తర్వాత చరిత్రలేదు కనక, ఈ పురాణాలుగుప్త రాజుల కాలంలోనే వ్రాయబడినవి" అని. అప్పటివరకూ జరిగిన చరిత్రమాత్రం ఆనాటికే పురాణాల్లో వ్రాయబడింది. భవిష్యతులో జరగబోయేది వ్రాయడం అసంభవం కాబట్టి, పురాణాలలో రాబోయే చరిత్ర వ్రాయడం పూర్తిగా జరగలేదు: ఇదీ వీరివాదం.

దీన్ని గుడ్డిఎద్దుల్లాగ మన విశ్వవిద్యాలయాల్లోని ప్రొఫెసర్లు, హిస్టరీ అధ్యాపకులూ, సూరేళ్ళుగా వల్లెవేస్తున్నారు. ఇది ఎంత దుష్ప్రచారమో ఎంత అసత్యమో ఒక్కనిమిషంలో తెలుసుకోవాలంటే, "పురాణాలలో వ్రాయబడిన దేశభవిష్యత్తు గుప్తరాజులవరకేనా ?" అన్నది గమనిస్తే తెలుస్తుంది. అది ఇప్పుడే చూద్దాం.

అనేక పురాణాల్లోని అమూల్యమైన చరిత్ర గ్రంథాలను ఈ బ్రిటిషు సామ్రాజ్యవాదుల కాలంలో—బుద్ధిపూర్వకంగా తగులబెట్టి, మనదేశచరిత్రని సమూలంగా నాశనంచేయాలని అనాటిక్రైస్తవపాదరీలు చేసిన దురాగతాలు తెలిపేందుకు వారి మాటలే మనకు సాక్ష్యం. అవి గత అధ్యాయం (పేజీ 15)లో 'జకోలియట్' (Louis Jacolliot) వాక్యాలలో చూచాము.

**ఫలితం:-** పై కారణాలవల్ల, ఇంగ్లీషువారి చేతుల్లోపడ్డ అనేక పురాణాలలోని చరిత్రభాగాలు నాశనంచేయబడ్డాయి. గుప్తరాజుల తర్వాత చరిత్రని తెలిపే గ్రంథభాగాలెన్నో తగులబెట్టబడ్డాయి. భారతకాలంలోని జనమేజయ 'పరీక్షిత్తు'లు చారిత్రక పురుషులని ఋజువుచేసే అనేక శాసనాలు కట్టగాకట్టి, పైకిరాకుండా—అణచివేయబడ్డాయి* అవన్నీ పైకివస్తే పురాణాంలోని చరిత్ర ఋజువవుతుందనే భయంతో వాటిని తప్పుడు శాసనాల క్రింద జమకట్టి 'ప్లీటు' దొర వ్రాసిన వ్యాసమే దీనికి ప్రత్యక్ష నిదర్శనం. ఇలా తప్పుడు శాసనాలుగా జమకట్టినవి జనమేజయుడు సర్పయాగాలు చేసిన శాసనం, జనమేజయుడు—'కలిశకం' 89వ సంవత్సరంలో (క్రీస్తుపూర్వం 3031 B. C.) కిష్కింధలో చేసిన దానశాసనం మొదలుగాగల, అతిప్రాచీనమైన శాసనాలే—ప్రత్యేకంగా ఎన్నికచేయబడినవి. కారణం?

మళ్ళీ అదేసమయంలో—ఇలా ఒకప్రక్క, దొరికిన చారిత్రక ఆధారాలనూ, శాసనాలనూ "జోన్సు" స్మిత్ (Sri William Jones, V. S. Smith) వంటిఅనేకమంది విదేశీచరిత్రకారులు అణచివేస్తూ-ఇంకొకప్రక్క "క్రీస్తుపూర్వం రెండువేలసంవత్సరాలకిముందటి భారతీయచరిత్రకు, ఆధారాలే లేవని" ఎలావ్రాశారు? ఈనాటికి మనభారతీయచరిత్రకారులుకూడా పై శాసనాల ఉనికిని గుర్తించకపోవడం శోచనీయం ఇలాగ శాసనాలు అణగద్రొక్కి, ప్రాచీన శాసనాలేలేవని వ్రాయడమేగాక—పురాణాలలోని దేశ భవిష్యత్తుని వర్ణించే భాగంలో—గుప్తరాజుల తర్వాత వర్ణనచేసే పేజీలను తగలబెట్టడం ఇంకొక దురాగతం.

---

Foot Note :— * జనమేజయునిదానశాసనాలు యీ గ్రంథంలో అనుబంధంగా అధ్యాయం చివరఇవ్వబడినవి. అవి ఇంతవరకూ ఈవిధంగా అణచివేయబడ్డ—220-శాసనాలలోనివే !!

అసలు పురాణాలలో గుప్తరాజుల తర్వాత చరిత్రయేదా వ్రాసి వుండని నీ వెలాగ చెప్పగలవని అనవచ్చు. అదృష్టవశాత్తు భవిష్యపురాణంలో మాత్రం ఈ భాగాలు తగలబెట్టకుండా మిగిలిపోయినాయి. ఇది వెంకటేశ్వర స్టీమ్‌ప్రెస్ (Bombay) ముద్రాక్షరశాల వారు ప్రచురించిన 'భవిష్యపురాణం' ప్రతిసర్గపర్వం చూస్తే తెలిసిపోతుంది. అదృష్టవశాత్తూ ఈ భాగాలు కూడా మిగిలివుండక పోయినట్టయితే మనవాళ్లు తెల్లదొరలుచెప్పినట్టు, గుప్తరాజులవరకే పురాణాలు చరిత్రను వ్రాసినాయంటూ, మనం విధిగా ఒప్పుకోవలసిన దుర్గతి పట్టేది.

ఇందలి కథావస్తువు :—భవిష్యత్పురాణంలోని భారతదేశ చరిత్ర, ఒక నాడీగ్రంథంలోని జాతకంలోలాగే, పేర్లతో సహా, రానున్న భావి కాలగతులన్నీ వివరంగా వర్ణించి వున్నాయని వ్రాశాను. దానికి ఉదాహరణలు ఈ క్రింద మచ్చుకు కొన్ని :—

విక్రమాదిత్యుడు :— ఈ విక్రమాదిత్యుడన్న రాజే అసలు భారత చరిత్రలో లేడన్న విదేశీ చరిత్రకారుల వ్రాతలు చూడండి. "There is no such king of that name in History."— [Cambridge History of India, V. S. Smith]

పూర్ణే త్రింశత్ శతేవర్షే
కలౌ వతిభయంకరే
శకానాం చ వినాశార్థం
ఆర్య ధర్మ వివృద్ధయే
విక్రమాదిత్య నామానం
పిత్రా కృత్వా ముమోద హ.

—భవిష్య (ప్రతి సర్గ. పర్వ)

చాలమందికి మన భవిష్యపురాణంలో ప్రపంచ చారిత్రక విషయా లెన్నో వున్నాయని కూడా తెలియదు. అందులో మత ప్రవక్తలందరి గురించీ వుంది. మహమ్మదు, బుద్ధదేవుడు, శంకరాచార్యులవారు, శ్రీ మద్రామానుజులూ, శివాజీ అందరి పూర్వజన్మ వృత్తాంతాలతోసహా యీ పురాణం వర్ణించి వున్నది, పరీక్షిత్తు కాలంలోనే.

ఇక్కడమాత్రం ఏసుక్రీస్తు, శకకర్త అయిన విక్రమార్క మహా రాజుకి సమకాలికుడని తెలిపే అంశం—విక్రమార్కుడూ, క్రీస్తూ కలుసు కున్నట్లు భవిష్యపురాణంలో వుంది. (ఇటీవల క్రీస్తు సమాధి కాశ్మీరులో కనపడింది!) ఈ క్రీస్తుగురించిన శ్లోకం ఒకటి, మచ్చుకు :—

ఏసుక్రీస్తు :—

"ఈశపుత్రం చ మాం విద్ధి
కుమారీగర్భ సంభవం
మ్లేచ్ఛ ధర్మస్య వక్తారం"........

అలాగే అక్బరు గురించి :—

అకస్మాచ్ఛవరో జాతః
తస్మా దకవర స్మృతః

(అకవర్ అనేపేరు బెంగాలీ భాషలో "వా"ట "బా" ను, ఉపయో గిస్తారు.—అలా చేర్చడంవలన "అకవర్" 'అకబర్' అయిందని భవిష్య పురాణ నిర్వచనం.)

హుమయూన్‌ను, "హోమాయువు" అని వర్ణించింది "భవిష్యపురాణం":-

"హోమాయుస్తనయస్తస్య
కృతం రాజ్యం పితుస్సమమ్"........

సలీం (జహాంగీర్) :—

"సలోమా తనయ స్తస్య......

ఈవిధంగా భారత దేశచరిత్రలో మనదేశాన్ని పాలించిన రాజులం దరూ ఒకరితర్వాత ఒకరుగా—ఈనాటివరకూ జరిగినదంతాభవిష్యపురాణంలో ఇలాగ, వర్ణించబడివున్నారు. ఇటువంటి ప్రబల సాక్ష్యాలు బ్రిటిషు ప్రభుత్వం ఉన్నరోజుల్లోనే అచ్చువేయబడిన, భవిష్యత్పురాణంలో కన బడుతూంటే—యిక, మన చరిత్రకారుల నేమనాలి ?

ఈ భవిష్యపురాణంలో, గుప్తరాజుల తర్వాతఎన్నోవేల సంవత్స రాల చరిత్ర—ఎంతో విపులంగా వర్ణించబడింది అక్కడ. హుమాయూను జహంగీరు, షాజహాను, ఔరంగజేబు మొదలగు మొగలుచక్రవర్తులు శివాజీ మొదలైన హిందూరాజులూ, విక్టోరియా మహారాణి, ఆమెభర్త ఆల్బర్టు విక్టరూ కలసి కలకత్తా రాజధానిగా మనదేశాన్ని పరిపాలించడం, యివన్నీకూడా మనకళ్ళకి స్పష్టంగా కనబడతాయి :—

"వికటే పశ్చిమే ద్వీపే
తత్పత్నీ వికటావతీ
అష్టకౌశల మార్గేణ
రాజ్యమంత్రం చకారహ"

ఈవిధంగాభారతదేశచరిత్రంతా, అంటేశ్రీకృష్ణ నిర్యాణం మొదలుకొని కలి యుగంఅంతమై'కల్కి'అవతారంవచ్చేటంతవరకూ-(1980-85)యావత్తు చరిత్ర అంతాకూడాపై విధంగా భవిష్యపురాణంలోస్పష్టంగావర్ణించబడింది. దీన్నిబట్టి రెండువిషయాలు ఋజువు అవుతున్నాయి. అవేమిటంటే :—

(1) పురాణాలు గుప్తరాజుల కాలంలో వ్రాయబడలేదు—అన్నది. అందులోని చరిత్ర విక్టోరియా పరిపాలన వరకూ ఇంకా ముందూ, ఇంకా

యిప్పుడు జరగబోయేదీ, కూడా వ్రాయబడి ఉన్నది. (అనలిలాంటి అను మానమే మామూలుగా మనిషికి రాదు. విదేశీయుల తెలివి తలకెక్కి ఇటు వంటి విపరీతాలు వాదాలయిపోతున్నాయి. అవి మనపురాణాలు చూస్తే నిరాధారాలని తేలుతుంది.)

(2) పురాణాలలోని రాజవంశావళి చరిత్ర-జరిగినతర్వాత అందులో కొత్తగా చేర్పబడిన రాజుల పట్టిక కాదు (ఇంగ్లీషు దొరలు కల్పించినట్టు) ఇవి, నాడీ గ్రంథాలవలే, బ్రహ్మంగారి కాలజ్ఞానంలాగ, బ్రిటిషు జ్యోతిష్యుడు "కీరో" (Cheiro) వ్రాసినలాగ, మదర్ షిప్టన్ (Mother Shipton) వ్రాసిన ప్రపంచ భవిష్యత్తు వంటి—ఇలాగ భవిష్యత్తును తెలిపే మహత్తర గ్రంథమే ఈ "భవిష్యత్పురాణం". ఇది యీనాటికీ-సంస్కృతంలో లభ్యం అవుతున్నది.

భారతీయుల పురాణాలు అమూల్య వజ్రాలు. వాటిని సైన్సు దృష్టితో నిష్పక్షపాతంగా పరిశోధించవలసిన అవశ్యకత— భారతీయుల విధి, భారత ప్రభుత్వం ధర్మం అయి ఉన్నది.

భారత పౌరాణిక చరిత్రకు
ప్రత్యక్ష ఆధారాలు

# "జనమేజయ మహారాజు శాసనాలు"

[ Shikharapur And Tirthahalli & Other Inscriptions ]

## 1. జనమేజయ "దానశాసనం" (సర్పయాగంలోది) :—

I (B) ... .... ఆవిష్కృతం విష్ణోర్వా రాహం ఞో .... ....
... .... .... .... ...భువనం విప్రః ॥

స్వస్తి సమస్త భువనాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర పరమభట్టారక, హస్తినాపురవరాధీశ్వర, ఆరోహక భగదత్తరిపురాయ కాన్తా దత్తవైరివైధవ్య పాండవకులకమల మార్తాండ ఏకాంగవీర రణరంగ ధీర అశ్వపతిరాయ దిశాపట్ట, గజపతిరాయసంహారక నరపతిరాయ మస్తక తల ప్రహారి హయారూఢ ప్రౌఢరేఖా రేవన్త సామంత, మృగచమూర కొంకణ చతుర్దిశా భయంకర, విత్మకర పరాంగనాపుత్ర సువర్ణ వరాహ లాంఛన ధ్వజసమస్తరాజావళివిరాజితసమాలంకృత శ్రీసోమవంశోద్భవశ్రీ పరీక్షిచ్చక్రవర్తీ, తస్యపుత్ర జనమేజయచక్రవర్తీ, హస్తినాపురే సుఖ సఙ్కథా వినోదేన రాజ్యం కరోతి. దక్షిణ దిశావరే దిగ్విజయయాత్రేయం విజయంకరోమి. తుంగభద్రా హరిద్రాసంగమే శ్రీహరిహర దేవసన్నిధౌ కటకం ఉత్కీలితం, చైత్రమాసే కృష్ణ....కరణ ఉత్తరాయణ సం....
II (a) వ్యతీపాత నిమిత్తే సూర్యపర్వణి అర్ధగ్రాస గ్రహీతసమయే సర్పయాగం కరోమి. బనవాసీ పన్నిర్భాహస్రమధ్యే(?)ఖమ్పణ సాంతలిగే సాహస్రమధ్యే (?)గౌతమి గ్రామాత్ బ్రాహ్మణ కన్నడశాఖేయగౌతమి గోత్రజ గోవింద పట్టవర్ధనం, కన్నడశాఖీయ వశిష్ట గోత్రజ వాయనపట్ట వర్ధనార్యం. కన్నడ శాఖీయభారద్వాజగోత్రజ కేశవయాజ్యదీక్షితం. కన్నడ శాఖేయ శ్రీవత్సగోత్రజ నారణదీక్షితం. చతుర్ముఖ నానాగోత్రేభ్యో ద్వాత్రింశతసహస్ర బ్రాహ్మణ సర్పయాగ పూర్ణాహుతి తదజ్ఞసమయే మంత్రాంగప్రదానం కరోతి. తస్యగ్రామస్య ధారాపూర్వకం దత్త తస్య గ్రామస్య సీమాన్తరాణి కథం. .... ....

(rest containing details of boundaries and usual final verses )

---

## 2. జనమేజయ దిగ్విజయ శాసనం :-

I (b) శ్రీ శఙ్కరనేగతి శుభమస్తు....
జయతి ఆవిష్కృతం విష్ణోర్వారాహం....
క్షోభితార్ణవం.... ....
దక్షిణోన్నత దంష్ట్రాగ్రే విశ్రాన్త భువనం వపుః॥

స్వస్తి సమస్త భువనాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహారాజాధిరాజ రాజపరమేశ్వర పరమభట్టారక హస్తినాపుర వరాధీశ్వర ఆరోహక భగదత్త రిపురాయకాన్తాదత్త వైరి వైధవ్య పాండవకులక [మల] మార్తాణ్డ కదన ప్రచణ్డ కలిగకోదణ్డచణ్డ మార్తాణ్డ ఏకాఙ్గ వీర రణరఙ్గ ధీర అశ్వపతిరాయ దిశాపట్ట గజపతిరాయ సంహారక నరపతిరాయ మస్తక తలప్రహరి సామన్త మృగ చామూర కొఙ్కణ చాతుర్దిశా భయఙ్కర చచ్ఛపుట కాచ్ఛపుట ఈశ్వరముఖ కమల వినిర్గత బ్రహ్మవీణాది భరతశాస్త్ర ప్రసిద్ధ అనేక శాస్త్ర ప్రవీణ కోరణ్డ వ్యాళి నాగార్జునాది మన్త్రిత్రయ బుద్ధప్రసిద్ధ సముదాయ నమిత పాదారవిన్ద అరిరాయకుల విలయకాలానల నీతి ఆకార పరాఙ్గనా పుత్ర సువర్ణవరాహలాంచన ధ్వజ। శ్రీసోమవంశోద్భవ పరీక్షిత చక్రవర్తి తత్పుత్ర జనమేజయచక్రవర్తి హస్తినాపురే సుఖసఙ్గదా వినోదేన దక్షిణదిశా వలయా దిగ్విజయ యాత్రేయం తుంగభద్రా హరిద్రా సఙ్గమే శ్రీహరిహర దేవ సన్నిధౌ కటకమ్, ఉత్కలితం చైత్రమాసే కృష్ణపక్ష సోమదినే భరణీ మహానక్షత్రే సఙ్క్రాన్తి వ్యతీపాత నిమిత్త సమయే సర్వయాగంకరోమి.

జయతి ఆవిష్కృతం విష్ణోర్వారాహం క్షోభితార్ణవందక్షిణోన్నత దంష్ట్రాగ్ర విశ్రాన్త భువనం వపుః

స్వస్తి సమస్త భువనాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర పరమభట్టారక హస్తినాపురవరాధీశ్వర ఆరోహ భగదత్త రిపురాయ

కాంతా దత్త వైధవ్య పాండవకుల కమల మార్తాండ ఏకాంగవీర రణరంగ ధీర అశ్వపతిరాయ దిశాపట్ట గజపతిరాయ సంహరక నరపతిరాయ మస్తక తల ప్రహారి సామంత మృగచామూర కొంకణ చతుర్థిశాభయంకర చప్పుపుట చాఖపుట ఈశ్వర ముఖకమల వినిర్గత శుద్ధసారంగ బ్రహ్మవీణా (వా) ది భరతశాస్త్ర ప్రసిద్ధానేకప్రవీణ కోరంటక, వ్యాళి, నాగార్జునాది మంత్రశాస్త్ర ప్రసిద్ధ సముదయ నమిత పాదారవింద అరిరాయకుల విలయ కాలానల నిత్యాకర పరాంగనాపుత్ర సువర్ణవరాహలాంఛన ధ్వజ సమస్త రాజ్యావళీ విరాజిత సమాలంకృత శ్రీసోమవంశోద్భవ శ్రీ పరీక్షిచ్చక్రవర్తీ, తత్పుత్ర జనమేజయ చక్రవర్తీ హస్తినాపురీ సుఖసత్కథా వినోదేన దక్షిణాదిశోపక్రమమ్ రాజ్యం దిగ్విజయం యాతి విజయంకరోమి. తుంగభద్రా హరిద్రా సంగమే శ్రీహరిహరదేవ సన్నిధౌ కటకమ్. ఉత్కలితం- చైత్రమాస కృష్ణ పక్షే సోమదినే తృతీయాయాం విశాఖనక్షత్రే సంక్రాంతీ వ్యతీపాత తన్నిపాత్తే సర్వయాగంకరోమి.

శ్రీ కురువంశావతంస శ్రీ జనమేజయ భూపాలానాం

## 3. "జనమేజయ దానశాసన" పత్రమ్ :-

శ్లో॥ పాంతువో జలదశ్యామాః శార్ఙ్గజ్యా ఘాతకర్కశాః ।
త్రైలోక్యమండప స్తంభాశ్చత్వారో హరిబాహవః ॥

స్వస్తి శ్రీ జయాభ్యుదయే యుధిష్ఠిర శకే ప్లవంగాఖ్యే (ఖ్య)ఏకోననవతీ(89)వత్సరే సహస్యమాసి అమావాస్యాయాం సోమవాసరే శ్రీమన్మహారాజాధిరాజ పరమేశ్వరో వైయాఘ్రపదీ యాఘ్ర (?) పాతగోత్రజః శ్రీజనమే జయభూపః। కిష్కింధా నగర్యాం సింహాసనస్థః సకల వర్ణాశ్రమ ధర్మ ప్రతిపాలక పశ్చిమదేశస్థ సీతాపుర వృకోదరక్షేత్రే తత్రత్య మునిబృంద మతస్య గరుడవాహనతీర్థ శ్రీమచ్ఛిష్య కైకయచార్యై రారాధిత సీతారామస్య

పూజార్థం కృత భూదాన శాసన మస్మత్ప్రపితామహ యుధిష్ఠిరాధిష్టిత ముని బృంద క్షేత్రస్య చతుస్సీమా పరిమితి క్రమః :—

పూర్వభాగే.... .... ఉత్తరవాహిన్యాస్తుంగ భద్రయోః పశ్చిమే దక్షిణ భాగే అగస్త్యాశ్రమ సంగమా దుత్తరే। పశ్చిమే పాషాణ నద్యాః పూర్వే। ఉత్తరభాగే భిన్నానద్యా దక్షిణే। మే (వి) తన్మధ్యస్థిత ముని బృందక్షేత్రం భవచ్ఛిష్య పారంపరా చంద్రార్క పర్యంతం నిధి నిక్షేపజల పాషాణా క్షిణ్య ( ? ) గామిసిద్ధ సాధ్యతేజః స్వామ్య మహితం స్వబుద్ధ్యా సుకాల్యే నాస్మతాపితౄణాం విష్ణులోక ప్రాప్త్యర్థం హరిహర సన్నిధౌ వుపరాగ సమయె సహిరణ్యేన తుంగ భద్రాజలధారా పూర్వకం క్షేత్రం యతిహస్తే దత్తో (త్తవాన్, అ ?) స్మహం ఏతద్ధర్మ సాధనస్య సాక్షిణః.

శ్లో॥ ఆదిత్యచంద్రా వనిలానలశ్చ ద్యౌర్భూమిరాపోహృదయం మనశ్చ
ఆహశ్చరాత్రిశ్చ ఉభేచసంధ్యే ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్. 2

శ్లో॥ దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనాదచ్యుతం పదమ్. 3

శ్లో॥ స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనే
పరదత్తా పహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్ 4

శ్లో॥ మద్దత్తా పుత్రికా జ్ఞేయా పితృదత్తా సహోదరీ
అన్యదత్తాతు జననీదత్త భూమింపరిత్యజేత్. 5

శ్లో॥ అన్యైస్తు భరితం భద్వే శ్వభిశ్చ భర్దితంనతు
తతఃకష్టతరో నీచః స్వయందత్తాపహారకః 6

శ్లో॥ స్వదత్తాం పరదత్తాం వాబ్రహ్మవృత్తింహరేత యః
షష్టివర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః 7

— o —

# "పురాణయుగం" — ఉపసంహారము

మన ప్రాచీన చరిత్రలో పురాణయుగం "మధ్యయుగ"మని చెప్పవచ్చు. ఎందుకంటే అది, మనకి, అతిప్రాచీనమైన వేదకాలానికీ అటు ఇటు నవీన చారిత్రక శకానికీ నడిమధ్యయుగంకాబట్టి—వేదకాలపు సంస్కృతి పురాణకాలంలో ఎలా మార్పులుచెందుతూవచ్చి ఆధునిక కలియుగ చారిత్రక పరిస్థితులలోకి పరిణామం చెందటం ఈ మధ్యయుగంలో మనకి గోచరిస్తాయి.

ఈ పురాణాలు చారిత్రక గ్రంథాలన్నవి ఏకొద్దిమందికో గాని తెలియని విషయం. అసలు అవి కావ్యాలలాగ కల్పిత కథలని—సినీమాలూ అవీ చూసి పురాణగాథల గురించి తెలుసుకునే సామాన్య ప్రజలలో, ఒక తప్పు అభిప్రాయం పాతుకుపోయింది. గత అధ్యాయాలలో పురాణాలలోని రాజ వంశావళులేగాక అనేక విజ్ఞాన సంబంధమైన-ఖగోళ సంబంధమైన, అంతరిక్ష యానం, మంత్రశాస్త్రం. వైద్యశాస్త్రం, కళలు వంటి—గతించిన మనదేశంలోని విజ్ఞానసంపద అంతా చూచాయగా పరిశీలించటం జరిగింది. ఇక్కడ నుంచీ మనం "చరిత్ర" అని యీనాడు 'హిస్టరీ' పుస్తకాలలో వర్ణించబడిన అధ్యాయాలలోకి అడుగు పెట్టబోతున్నాము. ఆచరిత్రకు ప్రారంభం-అహింసాజ్యోతిగా విశ్వంఅంతా ఎవరి ఉపదేశసారం 2500- సంవత్సరాలుగా మారుమ్రోగిందో-ఆ బుద్ధదేవుని జననం. ఈయన జన్మించినకాలం కూడా, చాల తగ్గింపులతో అనేక పాశ్చాత్య చరిత్రకారులచేత అనేక విధాలుగా మార్చబడి, తర్వాతి చరిత్రనికూడా గల్లంతు చేసింది. అందుకని

లయనకాలం, ఆయన జీవితంకూడా "కలియుగం" ప్రారంభమైన శ్రీకృష్ణుని—నిర్యాణసమయం, మహాభారతయుద్ధంజరిగిన కాలంలాగే మన "జాతీయచరిత్ర" (National History)ని పునర్నిర్మాణం చేయడానికి సహాయపడే ముఖ్యమైన మెలుకాయి. ఒది వొచ్చే స్కంధంలోని అధ్యాయాలలో చూద్దాము. ఇక్కడమాత్రం పురాణయుగంలో మనం ముఖ్యంగా అకళింపు చేసుకొని గుర్తుంచుకోవలసిన అంశాలన్నీ, వొక్కమాటు సింహావలోకనం చేద్దాము.

**"పురాణం" లోని ముఖ్య విషయం :-** 'పురాణం' అంటే యిక్కడ నేను 18—పురాణాలుగా వ్యాసమహర్షి, పరాశరమహర్షిచేత, వ్రాయబడిన పురాణాలు కావు. ఈ పురాణా లన్నింటికీ—'మాతృక' లేక మూలగ్రంథం—వొకటి వుండేది. ఉందులో అన్ని విషయాలూ కాలంకషంగా—అంటే విశ్వం పుట్టుకనుంచీ అణువులవరకూ గల—యావత్తు విజ్ఞానం, చరిత్ర, యోగశాస్త్రం అంతా నిక్షేపించబడిన ఆదిగ్రంథాన్ని "పురాణం" అని అంటున్నాను.

ఈ "పురాణసంహిత" వేదాలకంటె ముందుకాలానికి సంబంధించినది.* ఇలాటి, వేదాలకంటె ప్రాచీనతమమైన "పురాణం" వుందని చాలమంది వేదపండితులకే తెలియదంటే ఇక చరిత్ర రాసే ప్రొఫెసర్లకీ ఇంగ్లీషు చరిత్రలో "Vedic Age" "Epic Age" అన్న గోడంతో విదేశీయుడి చిలకపలుకులు చదువుకుని, డిగ్రీలు సంపాదించుకున్న చరిత్రకారులకేం తెలుస్తుంది ?

---

Foot Note :— * యీ పురాణసంహిత ఎన్నివేల యుగాలు, లేక సహస్రాబ్దాల నాటిదో ఊహాతీతం. దీనిలోని విషయంఅంతా నాగ్రంథం "Wisdom of the Gods" అన్నదానిలోనూ, "Text Book of Hinduism" (Publ. USCEFI. New Delhi-60) లోను చూడవచ్చు.

ఈ పురాణసంహిత గురించి శ్రీ 'హాజ్రా' (R. C. Hazra)మహాశయుడు తన "విష్ణుపురాణ" గ్రంధానికి వ్రాసిన తొలిపలుకులలో యీ విధంగా నిరూపించారు.

"అసలు వేదాలకంటే కూడా ప్రాచీనమైన "పురాణ" సంహిత వున్నదని ఒక ప్రాచీనమైన ప్రమాణం కూడా వున్నది" అని. దానిలోని విషయాల వివరాలు కూడా ఆయన సూచించారు.

రష్యదేశపు మహాయోగిని, సిద్ధురాలు అయినన్ 'బ్లావెట్స్కీ' సతి (Madam Blavatsky) తాను వ్రాసిన "ప్రాచీన రహస్య విద్య" (Secret Doctrine) అన్నగ్రంథంలో—అనాదిగా హిమాలయ పర్వతాలలోని ఆశ్రమాలలో నివసించే సిద్ధులవద్ద ఉన్న అతి ప్రాచీనమైన ఆదిమ విజ్ఞాన గ్రంథాన్ని—చూసి ఈ విధంగా వ్రాసింది.

Along the ridge of Altyn-Toga, whose soil no European foot has ever trodden so far, there exists a certain hamlet, lost in a deep gorge. It is a small cluster of houses, a hamlet rather than a monastery, with a poor there-looking temple in it, with one old lama, a hermit, living near by to watch it. Pilgrims say that the subterranean galleries and halls under it contain a collection of books, the number of which, according to the accounts given, is too large to find room even in the British Museum.

అంటే 'ఆల్టిన్—టోగా శిఖరాల సమీపాన ఏ తెల్లవాడు ఇంతవరకూ అడుగు పెట్టని ప్రదేశంలో ఒక చిన్న కుగ్రామం వుంది—లోతయిన లోయలో దాగి. అసలది ఒక గ్రామంకూటమి అనాలి ఆశ్రమం అనేకంటె.

అందులో అతిసామాన్యంగా కనిపించే దేవళం. అందులో ఒక ముసలి యోగి ("లామా")—దాన్ని కనిపెట్టుకుని వుంటాడు. అక్కడి ప్రజలు ఏమి చెబుతారంటే ఆ గుడి అడుగున వున్న పాతాళగుహ క్రింది అరలలో, అపూర్వమూ అమూల్యమూ అయిన ప్రాచీన గ్రంథా లెన్నివున్నాయంటే ఈనాటి"బ్రిటిషుమ్యూజియం" పట్టనన్ని గ్రంథాలు రహస్యంగా ఆ గుడి క్రింద నిక్షిప్తమై వున్నాయని, ఆయోగి రక్షణలో."

—"ది. సీక్రెట్ డాక్ట్రిన్"
P. XXIV

ఇంతేగాక హిమాలయాలలో అనేక సంవత్సరాలు బ్రహ్మజ్ఞానం కోసం యోగులూ సిద్ధులతో గడిపిన రష్యన్ యోగిని "బ్లావెట్‌స్కీ" అతి ప్రాచీనమైన ఆదిమ "పురాణం" గ్రంథంయొక్క ఉనికిని తానుప్రత్యక్షంగా కనుగొన్నట్టు, ఆమె వ్రాసిన మహద్గ్రంథం "సీక్రెట్‌డాక్ట్రిన్"(లేక గుప్త విజ్ఞానం) అన్న పుస్తకంలోని యీ క్రింది వాక్యాలు గమనించదగ్గవి. ఎందుకంటే ఒకపాశ్చాత్య రచయిత్రిగా ఆమెవాక్యాలు మనలో కొందరికి కనువిప్పు:—

The "Very old Book" is the original work from which the many volumes of Kiu-ti were compiled. Not only this latter and the Siphrah Dzeniouta but even the Sepher Fezirah. the work attributed by the Hebrew Kabalists to their Patriarch Abraham (!), the book of Shu-king, China's primitive Bible, the sacred volumes of the Egyptian Thoth-Hermes, the Puranas in India, and the Chaldean Book of Numbers and the Penatatench itself, are all derived from that one small parent volume.

The old book, having described Cosmic Evolution and explained [the origin of everything on earth, including physical man, after giving the true history of the races from the First down to the fifth (our) race, goes no further. It stops short at the beginning of the Kali Yuga just 4989 years ago at the death of Krishna, the bright "Sun-god", the once living hero and reformer.

పైవాక్యాల సారాంశ మేమిటంటే:

"అతిప్రాచీనమైన ఆ "ఆదిమగ్రంథం" ప్రపంచంలోని అన్నిమతాలకూ మూలాధారమైంది. దానినుంచి ఆధారంగాతీసుకునే "కియు-టి" అన్న మతగ్రంథాలు వ్రాయబడినవి. అంతేగాదు, దీనినుంచే యూదుల(Jews)కు మూలగ్రంథాలయిన సెఫిరా, జెనొటా. "సెఫర్ ఫజిరా" గ్రంథాలుకూడా రాయబడినాయి. హీబ్రూజాతిలోని "కబాలా" శాస్త్రపండితులు—ఈ రెండు ప్రాచీనగ్రంథాలనించే బైబిలులోని ప్రవక్త "అబ్రహాము" వ్రాసిన మూలగ్రంథాలు—ఈనాటి బైబిలుకు ఆధారాలు. "పెంటట్యూక్" అవీ కూడా తయారైంది "ఆదిమ" పురాణ (పురాతన) గ్రంథంనుంచే.

"ఈ అతిప్రాచీనాతి ప్రాచీనమైన పురాణం యీ కనిపించే విశ్వం యొక్క పుట్టుక (సృష్టి)—దాని పరిణామం గురించి తెల్పటమేగాక, యీనాడు భూమ్యాది సర్వసముదాయం. అంటే మానవుడు, చెట్టు వివిధ మానవజాతుల చరిత్ర యథాతథంగా జరిగింది జరిగినట్టు వర్ణించి, అంతటితో సమాప్తం అవుతుంది. ఇదిసరిగ్గా ఎక్కడ దాకా వచ్చి ఆగిపోతుందంటే—"కలియుగం" శకం 4989వ. ఈ సం॥ రం వరకూ (1889) అంటే ఒకనాడు భూమ్మీద జీవించిన, మహావీరుడూ జ్ఞానీ అయిన శ్రీకృష్ణుడు మరణించిన —కలిప్రారంభం దగ్గిర వరకూ వర్ణించింది. ఈ "ఆదిమపురాణం"

—బ్లావెట్స్కీ (TheSecret Doctrine P. XXX)

యీ జాతియొక్క మహత్తర విజ్ఞానం, వేలాది సంవత్సరాలుగా సిద్ధపురుషులు, మహాత్ములూ—మానవజాతికి పరమగురువులూ (Masters) ఐన ఆదిపురుషులరక్షణలోని విజ్ఞానం అంతా రాసింది. ఆమె తన గ్రంథంలో, చివరి కామె యిలా అన్నది: "In Century the Twentieth, some disciple more informed, and are better fitted, may be sent by the Masters of Wisdom to give final and irrefutable proofs that there exists a Science called Gupta-Vidya; and that, like the once-mysterious sources of the Nile, the source of all religions and philosophies now known to the world, has been for many ages forgotten and lost to men, but is at last found."

అంటే "రానున్న ఇరవయ్యవశతాబ్దంలో. బహుశః నాకంటె యీ మహోత్తమకార్యానికి బాగా తగివున్న వ్యక్తిని. అన్నివిధాలా అర్హుడయిన ఉత్తమ శిష్యుడిని, మానవజాతికి, కడసారిగా ఈ అనంతవిజ్ఞాన నిధివంటి గుప్తవిద్యయొక్క ఉనికిని ఋజువుచేసే, ప్రత్యక్ష ఆధారాలు చూపేందుకు పంపిస్తారు."

"ఏదైతే అనాదిగా మానవజాతిలోని అన్నిమతాల వెనుకా, అనేక వేదాంత శాఖల అడుగునా, ప్రపంచానికితెలిసిన అన్నిసిద్ధాంతాలకీ మూలంగా ప్రవహించే, జీవనస్రవంతి వంటి ఆ గుప్తవిద్య, రహస్య విజ్ఞానం, ఒకనాడు మానవజాతిఅందరూ, ఏకోదరులవలే పొందినసొత్తు— తర్వాత చేటుపడి పోగొట్టుకున్నదీ—మళ్ళీ దొరికిందని ఋజువవుతుంది."

ప్రపంచ ఖ్యాతిపొందిన జ్యోతిష్కుడు,—బ్రిటిషువాడైన "కౌంట్ లూయీ హ్యామన్" లేక "కీరో" (Count Louis Hamon or Cheiro) కూడా తాను ప్రపంచంలోని అతిరహస్య విజ్ఞానం గురించి సలిపిన అన్వే

షణలో, హిమాలయాలలోని సిద్ధపురుషులవద్ద, అతిగుప్తంగా దాచబడిన 'ఆదిమవిజ్ఞాన' గ్రంథం ఒకటి మానససరోవరందగ్గరచూచానని ఆది మానవ చర్మంమీది పేజీలమీద-కాలం చెరపలేని రంగుసిరాతో వ్రాయబడివున్నదనీ అందులోని అనేక విషయాలకీ జ్యోతిషంకూ, సంబంధించిన పుటలు తాను చూచాననీ—తన ప్రపంచాన్ని ఉర్రూతలూగించే జోస్యం, ఆ "బ్రాహ్మణులు" తనకు ప్రసాదించిన విజ్ఞానంలోనిదేననీ వ్రాశాడు ఆత్మకథలో.

ఇటువంటి అతిప్రాచీనమైనదీ — మానవజాతికంతకూ మొదటి విజ్ఞాన భిక్ష పెట్టిన—"ఆది పురాణం"గురించి యీక్రింద కొన్నిఅంశాలు మాత్రం మనకీనాడు తెలుస్తున్నాయి ; అవి ఏవంటే : :—

(1) మానవజాతి యీభూమ్మీద మొదట ఎలా సృష్టి అయిందీ— అన్న రహస్యగాథను యీ ఆదిగ్రంథం తెలుపుతుంది. అది యీనాటికీ "సైన్సు"కు లొంగని గడ్డుసమస్యే. యీనాటిశాస్త్రజ్ఞులు కనీవినీ ఎరుగని అతిప్రాచీనచరిత్ర యథాతథంగా వర్ణించబడివుంది—ఈ "పురాణం"లో.

(2) యీ భూమిమీద జరిగిన ప్రళయంగురించి—అంటే ఒకటి గాదు—ఇలాగ 'భూమి చరిత్ర' లో వాలసార్లు "ప్రళయాలు" జరిగాయి —అందులో భూమి ధృవాలూ (Poles), దేశాలవిభాగం ఎలాగ, పూర్తిగా మారిపోయాయో అదంతా ఆశ్చర్యమయినవిధంగా కళ్ళకుకట్టినట్టుగా వర్ణించబడివుంది. ఈగాథ సంక్షిప్తంగా ఒక టిబెట్టు యోగి "లామా లోబ్సాంగ్ రాంపా" (Lobsang Rampa) రాసిన గ్రంథంలో వర్ణించాడు. అది మనమందరం చదవచ్చు. ఇందులో టిబెట్టుదేశం సముద్ర తీరంగా వుండివున్నంతటి ప్రాచీనచరిత్ర వుంది. భూగర్భశాస్త్రి జ్ఞులు యీనాటి పరిశోధనలతో ఈవిషయాన్ని ధృవపరచి దీనికి "జెథిస్

సముద్రం" (Tethys Sea) అని పేరు పెట్టారు. వింధ్య లేవటం, అది సూర్యునికి అడ్డంవస్తే అగస్త్యుడు దీనిని అణచటం. గాథ కూడా యీ కాలంనాటిదేనేమో ననిపిస్తుంది.

(3) భూమి తిరుగుడులో, లక్షలాది సంవత్సరాలలోతప్ప కనపడని మార్పులు. 'ధృవం' (Pole) లోని చలనం(Changes in Earth's Axis) తద్వారా భూఖండాల ఉనికిలోనూ అక్షాంశ రేఖాంశాల్లోనూ, భూమ్మీద జరిగిన చలనాలను, కళ్ళకుకట్టినట్టు వర్ణిస్తూంది "పురాణం."

ఉదాహరణకు సంస్కృత భాగవత పురాణంలో ధృవునితో విష్ణుమూర్తి "నీవు 26, 000 సంవత్సరాల తరువాత ధృవపదాన్ని చేరుకుని ధృవత్వాన్ని అధిష్టిస్తావు" అని వరమిచ్చినట్టు వుంది. యీనాటి 'సైన్సు' కూడా ప్రతీ 26—వేల సంవత్సరాలకీ యింకొక కొత్త నక్షత్రం ధృవస్థితి (Polaraxis)కి వస్తుందని ఖగోళగణితంలో ఇటీవలే కనుగొన్న వైజ్ఞానికసత్యం ఆనాటి "పురాణం"లోని ధృవచరిత్రలో వుండటంఒకనిదర్శనం.

(4) వేదకాలంలోని ఋషులు, ఈ సృష్టి, ప్రపంచం పుట్టుక ఎలా జరిగింది? అన్న ప్రశ్నకి సమాధానంకోసం ఎలాగ పరిశోధనలు చేసారో అదేవిధానాన్ని కలియుగం ఆదిలో 'వేదవ్యాసమహర్షి' కూడా అనుసరించినట్టుగా మహాభారతం ఆదిపర్వంమొదటోని "సృష్టిక్రమం"గురించి తెలిపే భాగం వర్ణించి చెప్తోంది. కోటానుకోట్ల సంవత్సరాలక్రితం జరిగిన—సూర్యగోళంఉత్పత్తి, దానికిముందు రోదసిలోని గాఢాంధకారం—ఆ అంతరిక్షంలోని కటికచీకటిని చీల్చుకుంటూ, సూర్యుడూ గ్రహాలూపుట్టడం భూమి సూర్యుడినించి విడివడి గట్టిపడటం, నదీ సాగరముల ఉత్పత్తి. ఓషధులూ— తర్వాత మూడుయుగాల అనంతరం, జంతుజీవరాసుల పుట్టుక ఇదంతాకూడా వ్యాసమహర్షి హిమాలయ పర్వతాలలోని అడవులమధ్య

నున్న ఒక గుహలో యోగసమాధిని పొంది, అందులో దర్శించినట్లుగా భారతంలో ఆయనే వ్రాశాడు. అందులో ఆయన ప్రపంచ జనన, వృద్ధి, ప్రళయాల చరిత్ర (అంటే జరిగిందీ; జరుగుతున్నదీ, ఇంక జరుగనున్నదీ కూడా) వర్ణించిన ఘట్టం—సరిగ్గా ప్రాచీనకాలంనాటి ఆది "పురాణం"లో వర్ణించినదానితో సరిపోతున్నాయి.

(౮) ఇలా యోగసమాధిలో దర్శించిన ఒక "సృష్టిచక్రము"—అంటే సూర్యుడూ గ్రహాలూ పుట్టిపెరిగి భూమితయారై దానిమీద జంతువుల పెరుగుదల, మానవచరిత్ర, రాజులు రాజ్యాల ఇతిహాసం, ఇంకా వ్యాసమహర్షి కాలానికి జరుగనున్న చరిత్రతోసహా, చివరికి "కల్పాంతా"నికి మళ్ళీ యీ గ్రహాలన్నీ తిరిగి సూర్యుడిలో ప్రవేశించి, లయించిపోయే—"మహాప్రళయం" దాకా గూడా ఇలా నిత్యంతిరిగే "చక్రం" (కాలం) అంతా—యీ పురాణసంహితములోని ప్రధానాంశం !! అందులో రాజులూ యుద్ధాలూ రాజకీయాలూ అవంతా ఒక భాగమే—'మానవ' అంకం—కాలపురుషుని ఈ మహానాటకంలో, అన్నమాట !

(౯) పై కాలచక్రంలో అధ్యాయాలవంటివి "యుగాలు". ఈ యుగాలలో ఇటీవలఆరంభమైన 'ఆధునిక యుగ'మే—కలియుగం. అది జరిగినట్లుగా యీ పురాణాలలో యిచ్చినతేదీ నాటి (18-2-3102 B.C) గ్రహస్థితులు లెక్కిస్తే అది, యీనాటి సైన్సు లెక్కలతో సరిపోవడం చూసి, పాశ్చాత్యులే ఆశ్చర్యపోయారు.

(౧౦) దీన్నిబట్టిచూస్తే యీ "పురాణం"లోని కథావస్తువూ- తర్వాత స్వయంగాచూసి వ్యాసమహర్షి సమాధిలోదర్శించి ఋజువుచేసిన యీ "సృష్టిచిత్రం" గాథా, మన విశ్వంకథ—ఊహా కల్పనగాని యితర దేశాల కావ్యాలలోని (గ్రీకు, రోమన్) కథలవంటి కల్పన గానికాదు, అని వైజ్ఞానికం (Scientific) గా ఋజువవుతున్నదన్నమాట.

(8) యీమధ్యకాలం చరిత్రలోని "భవిష్యత్తు"ను పైవిధంగాచూసి అనేక మంది మునులు 'నాడీ' జ్యోతిష గ్రంథాలలో రాసినట్టుగా — యదార్థ భవిష్యత్తును దివ్యదృష్టి (Clairvoyance)తో వ్రాయబడినదే "భవిష్య పురాణం" కూడా అని తెలుస్తోంది.

(9) బ్రహ్మాండంలో జరిగే చరిత్రని — అంటే "విశ్వం ఆత్మకథ"ని సినిమాలోలాగ దర్శిస్తే, ఎలాగ అందులో మధ్య మానవచరిత్ర అన్న "అంకం" వస్తుందో అంతకుముందు — ప్రకృతి అంతా జలమయం అయివున్న ఆదియుగం, తర్వాత వృక్షజాతులు జంతువులూ, ఆ తర్వాత వెన్నెముకగల జాతులూ పక్షులూ మానవులూ ఇలాగ ఒక నాటకంలోని అంకాల లాగ ఒకదానితర్వాతఒకటిగా, చూసిన 'సృష్టి' చరిత్రే — ఈ ఆది పురాణంలోని కథావస్తువు. ఇదంతా గతచరిత్ర.

(10) వర్తమానం — అంటే, వ్యాసమహర్షి మళ్ళీ యీ ప్రాచీన విజ్ఞానమంతా నశించిపోకుండా మానవజాతి ఉపయోగార్థం పద్దెనిమిది పురాణాలుగా విడివిడిగా రాసిన కాలము — కలియుగం మొదలయ్యే సంధికాలం. అదేవిషయం పరాశరమహర్షి వ్రాసిన 'విష్ణుపురాణం'లో — అంటే వ్యాసుడు 18–పురాణాలలో విడివిడిగా విషయానుసారం పద్దెనిమిది కల్పాలలోని చరిత్రంతా వ్రాసినదే — ఒకే గ్రంథంగా పద్దెనిమిది అంకాలూ కలిసివున్న ఒకే గ్రంథంలో "విష్ణుపురాణం"గా వ్రాసిన కాలంకూడా — ద్వాపర యుగం అంతమై 'కలియుగం' ప్రారంభమయ్యే గడప.

ఇది ఊహాకల్పనకాదు. అంటే కథాకల్పనలాగ 'కావ్యం'గా వ్రాసినదికాదు — ఈ 'యుగాలంటే' చారిత్రక కాలాలని తెలిసేందుకు — ఆ టైముకి వుండే గ్రహస్థితులిచ్చారు. అటువంటికాలము శ్రీకృష్ణనిర్యాణం లేక 'కలియుగ ప్రారంభం' అని చెప్పబడే 18-2-3102 B.C. నాటి

మెలురాయి. దీనితో అటు ముందరి రాజుల చరిత్రా, ఇటు కలిలోని చారిత్రకకాలంలోని విభాగాలూ, రెంటినీ సరిగ్గా విభజించుకుని చారిత్రకకాలాలు తెలుసుకునేందుకు కావలసినలెక్కలు "భవిష్య పురాణం"లో ప్రతిరాజు పరిపాలనా వివరాలు విపులంగా ఇచ్చారు.

(11) కలి ప్రారంభంతర్వాత(18-2-3102 B.C.) పరీక్షిత్తు పట్టాభిషేకం, అతని మరణానంతరం జనమేజయుడి రాజ్యాభిషేకమూ, పురాణాలు వర్ణించివున్నాయి. ఈ జనమేజయుడు కొన్ని దానాలుచేసినట్టు శాసనాల ద్వారాకూడా ధృవపడింది. ఈయన "సర్పయాగం"చేసినట్టు మహాభారతం భాగవతం మొదలైన పురాణాలు తెలిపే విషయాన్ని ధృవపరుస్తూ— ఆయన సర్పయాగకాలంలో ఇచ్చిన దానశాసనాలరాగిరేకులుకూడాదొరికాయి.

పోనీ విశ్వదేయులన్నట్టుయీదానశాసనాలు భారతీయులుదొంగతనంగా సృష్టించిన "ఫోర్జరీలు" అనుకున్నా—రాగిరేకులయితే సృష్టించగలంగాని అందులో దానంఇయ్యబడిన అగ్రహారాలు నిజంగా యీనాటికీ మాన్యాల కింద ఈనాములకింద బ్రాహ్మణులు భూమిని అనుభవించటమనేది ఎలాగ జరుగుతుంది, ఏరాజూ ఇవ్వందే. ఇంకేరాజయినా యిస్తే దానశాసనంలో తనపేరు వేయించుకుంటాడుగాని జనమేజయుడిపేర శాసనంఎందుకు రాయిస్తాడు? అందుకని యీ శాసనాలు, అందులోని యీనాములూ, పురాణాలలోని'కలియుగం'కాలంతోసరిపోయేచారిత్రకఋజువులని ధృవపడింది.

ఇవి నిజమని విదేశీయులు కూడా —కలియుగారంభానికి అన్ని గ్రహాలు కలిసి 'మేషరాశి'లో కూడటం—గణితంచేసి, ఆశ్చర్యంతో అంగీకరించిన ప్రశంసావాక్యాలే ఇందుకునిదర్శనం.

**కలియుగంలోని చరిత్ర :-** భవిష్యత్తులో జరగనున్న యావత్ చరిత్ర భవిష్యపురాణంలోని పులంగానూ, భాగవతం (12-వ స్కంధంలో)

సంక్షేపంగానూ—రాజుల కాలాలను లెక్కించుకుంటూ వివరంగా పరిపాలనాకాలాలు ఇవ్వబడినాయి. ఇలాగ వర్ణించే "చరిత్ర" 1980–వరకూ వచ్చి అప్పటికి "కల్కి" అవతారంతో అంతమయింది. ఎందుకంటేకల్కి అవతారంవచ్చేటైము–మళ్లీ యుగంమారి కృతయుగం లేక 'సత్యయుగం' ప్రారంభకాలం. కృష్ణావతారం కలికాలాని కెలాగ నాందియో—అలాగే కల్క్యవతారం 'సత్య' కాలానికినాంది.

ఈమధ్యన రాజులచరిత్ర ఈవిధంగా విభజించ బడింది:—

| | |
|---|---|
| (a) 'హిందూ పర్వం' | — 1500 సం॥లు |
| (b) 'బౌద్ధపర్వం' | — 1500సం॥ లు |
| (c) క్రీస్తుశకపర్వం లేక శాలివాహనశకపర్వం | — 1500సం॥ లు |
| (d) అరాజక పర్వంలేక 'రాజప్రతినిధుల పర్వం' | — 500సం॥ లు |
| మొత్తం — | 5000 కలియుగం మొదటినుంచి |

అటు తర్వాత:—

"యుగసంధి" కాలం — 60 సంవత్సరాలు.

పైకాలాలను ఇప్పటి క్రీస్తుశకం A. D, B C లలోకి మార్చి చెప్పాలంటే:—

కలియుగం—5000సం॥లు పూర్తిఅయినది, 1901 సం. లో
తర్వాత—60సం॥"సంధికాలం"కలిపితే....
1961 వస్తుంది. మరునటిదైన 1962 లో

అష్టగ్రహ కూటమి జరిగి - "నూతనయుగానికి" నాందిజరిగింది. అనంవ

త్సరంలో ఎవరో "యుగపురుషుడు" లేక, ఒక ప్రపంచనాయకుడు—లేక అవతారమూర్తి జన్మించటం *అన్నిపురాణాలలోనూ వ్రాయబడింది. అష్టగ్రహ కూటం కాలంలోనే, అని!!

కలియుగంలోని భారతదేశ చరిత్ర :—పైని చెప్పిన 5080 సంవత్సరాల చరిత్రనీ స్పష్టంగా గుర్తించటానికి, రెండు గ్రహకూటములున్నాయి (A)ఒకటి కృష్ణనిర్యాణం-3102 B.C.లోని కలియుగారంభంలోది (B)రెండోది 1962 A. D.లోని కృతయుగారంభ సంధికాలంలో రెండు గ్రహస్థితులూ, చరిత్రకారుల ఊహలకు తావులేకుండగా మనదేశచారిత్రక కాలాన్ని బంధించే రెండు మైలురాళ్ళు. అసలు మనదేశ ప్రజలకు తెలుసుకునే సావకాశం కలగాలంటే —దానికి "పురాణయుగం" లో పురాణాలలోని అంశాలమీద సైన్సు దృష్ట్యా (మతపిచ్చి, మూఢనమ్మకాలతో జాత్యాభిజాత్యభావాలతో వ్రాయకుండా)పరిశోధన జరిగితీరాలి. దీనికిపురాణాలు తప్ప అతిప్రాచీన "విశ్వచరిత్ర"అంటే(Universal History)తెలిపే సాహిత్యం ప్రపంచంలో మరిలేదు.

(12)పైపరిశోధనతో 'ఇతిహాస' 'పురాణాలను' మధిస్తే యీ నాటి కలియుగంలోని చారిత్రక సూచికగా ఈక్రింది తేదీలు మనకి మైలురాళ్ళుగా నిలిచిపోతాయి. అవి ఏమంటే:—

(a) శ్రీకృష్ణుని నిర్యాణం తేదీ
లేక
"కలియుగం" మొదలైన తేదీ —18-2-3102 B. C.

(b) శ్రీకృష్ణుని జననం తేదీ —19-7-3227 B. C.

(c) మహాభారత యుద్ధం జరిగిన సం॥రం (కార్తీక బహుళ త్రయోదశి) —3138 B. C

(d) పరీక్షిత్తు పరిపాలన కాలం ([illegible] సం.లు)

(e) పరీక్షిత్తు ఢిల్లీ సింహాసనాన్ని రాజైన
నాటినుంచి మహాపద్మనందుడు
(శూద్రరాజు) క్షత్రియుల్ని పూర్తిగా
జయించేనాటికి —15[illegible] సం.నుంచి

(f) తర్వాత వరుసగా మగధరాజ్యాన్ని ఏలిన
రాజవంశాల వేరే కాలాలు :-

**ఉపసంహారము:-** పురాణ యుగాన్ని ముగించేముందు ఒకమాట చెప్పాలి. అదేమిటంటే మనదేశపు ప్రాచీన చరిత్రంతటా, అంటే "విక్టోరియా" రాణీ పరిపాలనవరకూ కూడా యీ పురాణాల ప్రసక్తి అడుగడుగునా వస్తూనేవుంటుంది. దానికారణం యీ పురాణాలలోనివి, నిజమైన మన చరిత్ర—పాశ్చాత్యులూ, వాళ్ళ అనుయాయులూ అణగద్రొక్కినది. నిక్షిప్తమై వున్నది. బైబిలులోని లెక్కలకి సరిపోయేలాగ మన పురాణాలపై దిద్దివ్రాయాలనే దుర్బుద్ధివుండే* తప్ప యిందులోని "భవిష్యద్రాజ చరిత్ర" లోని కాలంతెలిపే లెక్కలను అబద్ధం అనలేము. అబద్ధాలకాలాలు వ్రాయవలసిన, ఆనాటి ఋషీశ్వరులకి, స్వార్థమైన అవసరాలేమీలేవు—బ్రిటీషు సామ్రాజ్యవాదులనుకున్నట్లూ! అందువల్ల ఈ తెల్లవారి ఊహలతో వ్రాసిన దొంగ చరిత్రకన్నా యీ ఋషులు వ్రాసిన ప్రాచీన పురాణాలలోని చరిత్రే, ఎన్నో వేల రెట్లు విశ్వసనీయమూ, నిజమైనదీనూ!

---

Foot Note.- * పై ఉద్దేశ్యంతో పురాణాలలోని చరిత్రను బైబిలు లెక్కలలోకి దిగకొట్టినదాన్ని మనం "Hindu Chronology" అన్న జోన్సు వ్యాసంలో చూడవచ్చు (చూ. "British Discovery of Hinduism"—by P. J. Marshall Cambr. niv Print 1970)

పురాణయుగంలో మనచరిత్రలో ముఖ్యంగా పాడుచేయబడినకాలం అంటే, పరీక్షిత్తుతర్వాత, అలెగ్జాండరు దండయాత్రకూ ఈమధ్యనవున్న కాలం ఏదైతే బుద్ధిపూర్వకంగా తెల్లవాళ్ళు మార్చి, నాశనంచేసి తిరిగి వ్రాశారో—దాన్ని మనకు సరిదిద్దే భోగట్టా యిచ్చారు. అందుకని ఈ అధ్యాయం ముగించేముందు రానున్న "బౌద్ధ యుగానికి" అందించి విడిచి పెడతాను. ఇందువల్ల—ఈమధ్యన పాలించిన రాజుల విషయంలో ఏమీ సందిగ్ధతలేదు. 'పురాణాలలో' —అది కల్పించబడిన గందరగోళమేనని తర్వాత అధ్యాయాలలో తెలుసుకునేందుకుపకరిస్తుంది. ఈ విషయం.

పరీక్షిత్తు 'తక్షకుని'చేత చనిపోయాక, జనమేజయుడు భాగవతంలో వర్ణించినట్టు నిజంగా పరిపాలించినవిషయం ఆయన శాసనాలవల్ల-కలియుగం మొదలైన 89-వ సంవత్సరం "ప్లవంగ"లో దాన్నిబట్టి—తెలుస్తున్నది. ఆయన తర్వాత జనమేజయుని—6-గురి కుమారులలోనూ పెద్దవాడైన శతానీకుడురాజైనాడు, ఆయనవంశీయుల రాజ్యపాలన జరుగుతూండగానే అయోధ్యలో పరిపాలిస్తూన్న "సూర్యవంశ"పు రాజులలోని 23-వ వాడైన శుద్ధోదనుడికి 'బుద్ధదేవుడు' జన్మించాడు. (జనమేజయుడిది చంద్రవంశం.)

ఈ 'సోమవంశీయుల' తర్వాత వరుసగా:- శిశునాగులూ, నందులూ మౌర్యులూ, శుంగులు, మౌనులు, శాతవాహనులూ వరుసగా పాలించారు. వీరితర్వాత గుప్తరాజులు మనదేశాన్ని పాలిస్తూండగా అలెక్జాండరు మన దేశంమీదికి దండెత్తివచ్చి పరాజయంపొంది తిరిగి పోయినట్టు—అలెగ్జాండరుతో వచ్చిన గ్రీకుల వ్రాతలే ఋజువుచేస్తున్నాయి. అలెగ్జాండరు మన దేశానికి వచ్చింది, 273 B.C. కాలంలో. పురాణాల లెక్కలనిబట్టిచూస్తే గుప్తరాజుల కాలంకూడా 275 B. C.—తో సరిపోతుంది.

ఇలా ఇంత చక్కగా పురాణాల చరిత్ర అటు గ్రీకులవ్రాతలతోనూ ఇటు జనమేజయుని శాసనాలతోనేగాక గ్రహాల నడకలనుబట్టి తేల్చిన 'కలియుగం' సంవత్సరాలతోకూడా సరిపోతూంటే దీన్ని విడిచిపెట్టి సొంత అల్లికలుఅల్లారు విదేశీయులు.

వీళ్ళేంచేసారంటే క్రీస్తుపూర్వం 1887 B. C -నాటి బుద్ధునిని 487-B.C. లోకి లాగి ఆయనకాలాన్ని 1400 సం॥ల పైచిలుకు తగ్గించారు. ఇలా చెయ్యడంవల్ల అలెగ్జాండరు ఇండియాకు వచ్చిన కాలాన వున్న (273 B.C.) గుప్తరాజులను క్రీస్తు తర్వాత 400 A D -కి నెట్టి వారి కాలాన్ని తగ్గించారు. గౌతమ బుద్ధునికి ఎంతో దగ్గరకాలంలోని మౌర్యుల లోని చంద్రగుప్తుడిని తీసుకుని వచ్చి అలెగ్జాండరు కాలానికి తగ్గించి— “చంద్రగుప్త”డనే పేరుగల గుప్తరాజును (సముద్రగుప్తుని తండ్రి) మౌర్యుడైన ‘చంద్రగుప్త’డితో గల్లంతు చేశారు.

అయినా తర్వాత రాజులపేర్లు సరిపోలేదు. గ్రీకులు సముద్రగుప్తుడి పేరు (Sandroc tus, or Sandrocypus) అని కూడా చంద్రగుప్తుడి కుమారునిగా వ్రాశారు. అయినా వీన్ని త్రొక్కిపెట్టి తప్పుడు కాలాలతో వ్రాయడాన్ని మనం యీ క్రింది. పురాణాల చరిత్రపట్టికచూస్తే— స్పష్టంగా గ్రహించవచ్చు.

## పురాణయుగంనుంచీ—బౌద్ధయుగందాకా

(పురాణాలలో ఇచ్చిన రాజుల—చరిత్ర కాలం) :—

(a) ‘పరీక్షిత్’ మహారాజు పట్టాభిషేకం
(హస్తినాపురంలో కృష్ణ నిర్యాణం విన్న ధర్మరాజు సన్యసించి, రాజ్యం మనుమనికిచ్చిన సంవత్సరమే ‘కలి-1’)
—3102 B, C.
(ప్రమాదినామ సం॥)

(b) తర్వాత “జనమేజయుడు”
(సర్పయాగంచేసి శాసనాలు వేయించాడు)—“కలి-60 లేక మళ్ళీ వచ్చిన ‘ప్రమాది’ వెళ్ళగా ప్లవంగనామ సం॥లో— “కలి-89” కి సరియైన 3013- B.C.లో

(c) "శతానీకుడు" (జనమేజయుడు—సగురు సమూహంలో జ్యేష్ఠుడు) ఈయన వంశీయులు పరిపాలించినది. } 1468 B. C.

(d) ఈ వంశీయుల కాలంలోనే "గౌతమబుద్ధుని జననం" —10–3–1887 B. C.

**రానున్న బౌద్ధయుగం :-** వేదకాలంతర్వాత పురాణ యుగం ఎలాగ వచ్చిందో అదేవిధంగా చరిత్రలో మౌర్యసామ్రాజ్యం నడుస్తూ వుండగా గౌతమబుద్ధుడు జన్మించాడు. ఆయన సుక్షత్రియుడు. సూర్యవంశ రాజులలోని 23.వ వాడైన శుద్ధోదనమహారాజు కొడుకు. ఈయన జన్మించి నప్పుడు ఋషులు ఆకాశంలో ఒక అద్భుతమైన నక్షత్రం ఆకస్మికంగా (అంతకుముందు లేనిది) కనపడగా—చూసి ఒక 'మహాప్రవక్త' జన్మిస్తున్నాడని గ్రహించినట్టు నేపాల్. టిబెట్టు, చైనా, బీహార్‌లలోని ప్రాచీన గ్రంథాలు తెలుపుతున్నాయి.

ఈయన జన్మించినప్పుడు ఒక అఖండమైన, అపూర్వమైన గ్రహ స్థితి ఏర్పడింది. అది కొన్ని వందలో, వేలో, ఏళ్ళకుగాని ప్రకాశించి రాదు. దాన్నిబట్టి శుద్ధోదనమహారాజుకి పుట్టిన కుమారుడు ఒక జగత్తును పాలించే మహారాజో—లేక జగద్గురువైన ఒక నూతన మతప్రవక్తగానో: అవుతాడని చెప్పారట, ఆనాటి జ్యోతిష్కులు, అంటే గౌతమబుద్ధునికాలం వలానా, అని తేల్చడానికి కావలసిన. తిధి వార, నక్షత్రాల వివరాలు—వున్నాయన్నవిషయం తెలుస్తుంది. వీటిన్ని త్రోసిరాజని: బ్రిటిష చరిత్ర కారులు గౌతమబుద్ధునికాలం ఊహతో—వారి బైబిలులెక్కలందు మించ కుండా—నిర్ణయించారు. అందుకని ఒకరు నిర్ణయించినతేదీ, మరొకరు నిర్ణయించలేక గడబిడ చేసారు. అవి ఒకదాంతో ఒకటి సంబంధం లేకుండా ఎంత అసంబద్ధంగా వున్నాయో తెలియాలంటే యీ క్రింది మచ్చుతునక చాలు :—

## గౌతమబుద్ధుని కాలం

| | | |
|---|---|---|
| (a) సర్ విలియం జోన్సు | — | 1000 B C. |
| (b) స్మిత్ | — | 487 B C |
| (c) రాప్సన్ | — | 483 B C. |
| (d) ఫ్లీట్ | — | 1631 B C. |
| (e) బిషప్ బిగాండెట్ | — | 1887 B. C. |
| (f) జపాన్ / (g) టిబెట్ / (h) చైనా — అన్ని ప్రాచీన బౌద్ధగ్రంథాలు | — | 1887 B C. |

వీన్నిబట్టిచూస్తే పాశ్చాత్యచరిత్రకారులకే. ఏకాభిప్రాయం కుదర లేదు సరిగదా వారు బుద్ధునికాలంగా ఊహించిన ఊహాగానాలమధ్య—1404 సంవత్సరాలు అటో ఇటో వుంది, వార ! ఇది చరిత్రకి పనికిరాదు. చెట్టు కథలకోసం ప్రత్యేకించిన చెత్తబుట్టలోవెయ్యాలి వీళ్లదొంగతనాలు. అసలు "అంచనాల" కేమి ఖర్మవొచ్చింది వీళ్ళకు! చక్కని జాతక వివరాలు జగజ్జ్యోతిగా ప్రపంచాన్ని 2500 సంవత్సరాలు ఉర్రూతలూగించిన మహామహుని పుట్టుకని తెలిపే వివరాలుండగా !

ఇది వీళ్లబుద్ధి పనిచేసే వక్రధోరణికింకో ఋజువు—అంతే !

పై అసంగత కాలనిర్ణయంతో బుద్ధదేవుని అసలు జననకాలం పాది లేసి నందువల్లనే మనచరిత్రలో బుద్ధునితర్వాతా, అంతకుముందూ యిచ్చిన కాలాలతో—తమ ఊహాకాలం (బుద్ధుని) సరిపడటంలేదని వాపోయాడు మాక్సుమూలరు, చాల స్పష్టంగా ! ఆయనంటాడు :—

"Every attempt to go beyond and to bring the Chronology of the Buddhists and Brahmins into harmony has

proved a failure— *Max Muller. అంటే అర్థం : "బ్రాహ్మణుల కాలగణనమూ, బౌద్ధుల కాలగణనమూ ఒక్కవిధంగా సమన్వయం చేయటానికి (మేం) చేసిన ప్రతియొక్క ప్రయత్నమూ వ్యర్థమయిపోయింది: వీరికాలం దాటిపోవటానికి చేసిన ప్రయత్నంకూడా అంతే."

ఇది ఇలావుండగా పురాణాలలోని భవిష్యత్ వర్ణించబడిన శ్లోకాలలో బుద్ధునిగురించిన కాలం తెలుసుకునే లెఖ చాలా స్పష్టంగా వర్ణించబడివుంది ఇలా:-

"మాయామోహ స్వయం పోఽసౌ శుద్ధోదన సుతోభవత్
మోహయామాస దైత్యాన్ తాస్త్యాజితా వేదధర్మకం
తేచ బౌద్ధా బభూవుర్హి తేభ్యోన్యే వేదవర్జితాః

—విష్ణుపురాణం.

పై శ్లోకాలనుబట్టి ఇంకా భాగవత 'భవిష్య పురాణాలలోని రాజుల కాలాలు సమన్వయంచేసిచూస్తే గౌతమబుద్ధుడు కలియుగప్రారంభమైన—1295-వ సంవత్సరంలో—అంటే క్రీ. పూ. 1807 B.C.లో జరిగింది బుద్ధుడు మరణించడం, అని తెలుతోంది.

దీన్నిబట్టి చూడగా గౌతముడు శాక్యవంశంలో అయోధ్యారాజులైన సూర్యవంశపురాజుల "వంశవృక్షం"లో 13-వ వాడైన శుద్ధోదనుడికిజన్మించిన సమయంలో మనదేశాన్ని శతానీకుడనే మహారాజు పాలిస్తున్న సమయం అది! ఈ 'శతానీకుడు' జనమేజయమహారాజు కుమారులైన 5-గురు కొడుకులలో జ్యేష్ఠుడు.

ఈ గౌతమబుద్ధుని జననంతో మన పురాణాల కాలం అంతమై—మనదేశ చరిత్రలోని తర్వాత అంకంలోని "బౌద్ధయుగం"లోకి అడుగుపెదు

*చూ. Max Muller "History of Ancient Sanskrit Literature —P. 135 (Allah. Edn.)

తున్నాము. దీంతో భారతదేశం అదృష్టమే పేరుదారిపట్టి—ఒక కొత్తమలుపు తిరిగిన, చారిత్రాత్మక తేదీ—గౌతమబుద్ధుని జననం (10-3-1887 B. C.)

భారతీయుల జీవన విధానంలోనే బౌద్ధతత్వం ప్రవేశించి—మన రక్తంలో రెండు సంస్కారాలు ప్రవేశపెట్టింది. అవి యేవంటే :

(1) ఒకటి—మన నిజజీవితం అంతా 'మాయ' లేక 'మిధ్య' అన్న శుష్క వేదాంతం—సామాన్యులను కర్మహీనులుగాచేసి జాతిని నిర్వీర్యులనుగాచేసే వేదాంత సరళి.

(2) 'అహింస' అన్న పేరుతో రక్తంచూస్తే భయపడే—క్షాత్రం, శౌర్యం నశించిన జాతి—అంటే, యుద్ధానికి పనికిరాని బౌద్ధభిక్షులతో నిండి పోయింది మన భారతావని. ఫలితం, విదేశీయులదండయాత్రలు మన దేశంమీద విరుచుకుపడినప్పుడు—అది 'మిధ్య'గా అంతా 'మాయ'గా దాన్ని ఎదుర్కోక—యుద్ధం హింసగాబట్టి దేశం ఓడిపోతూంటే చూస్తూ వూరుకునే "అహింస"; ఈ రెండూను వెంటబట్టినాయి.

టిబెట్టును చైనాకమ్యూనిష్టులసేనలురమకిరాతకంతోఆక్రమిస్తూంటే యుద్ధం అలవాటు తప్పిపోయిన 'టిబెట్టు '(Tibet) బౌద్ధులు, ఎలాగ మేకల్లా బలి అయ్యారో అలాగే భారతావని గ్రీసు, ముస్లిం మొగలు, బ్రిటిషు కిరాత కుల సంకెళ్ళకి దీనిప్రభావంవల్ల లొంగిపోయింది. ఆ అధ్యాయం బౌద్ధ యుగంతోనే ప్రారంభం అయింది. ఆ తర్వాత బానిసత్వానికి 'నాంది' పలుక బడింది — ఈ బౌద్ధయుగంలోనే. అదివాచ్చేస్కంధంలోని అధ్యాయాలలో గమనిద్దాం.

## ప్రాచీన భారతదేశాన్ని పాలించిన హిందూ

## రా జ వ ం శా లు

I "పరిక్షిత్" జననంనుంచీ
'మహాపద్మపతి' నందునివరకూ కాలం*. — 1500 సం.లు
ఆ తర్వాత పాలించినది.

II "మౌర్యులు"
[చాణక్యుడు అభిషేకించిన చంద్రగుప్తునినుంచీ
మౌర్యుల వంశం] .... — 137 సం.లు

III "శుంగులు" .... — 112 సం.లు

IV "కాణ్వవశం" ....

"మహాపద్మాభిషేకాత్తు యావజ్జన్మ పరిక్షితః
ఏకమేవ సహస్రంతు జ్ఞేయం పంచశతోత్తరం"

[అర్థం :- పరిక్షిత్తు జననం లగాయితు. 'మహాపద్మ' నందుని వరకూ—పదిహేనువందల సంవత్సరాల కాలం.]

* పై "మౌర్య"రాజు మహాపద్మనందుడూ; చాణక్యుడనే బ్రాహ్మణుడు వాని వంశంలోని 'నవ నందు'లను చంపి, చంద్రగుప్తుడిని అభిషేకించిన విషయమూ—వ్యాసమహర్షి సంస్కృత "భాగవతం"లోని—దేశభవిష్యత్తును తెలిపే 12-వ స్కంధంలో ఇలా వ్రాశాడు :—

"మహానంది సుతోరాజన్ శూద్రా గర్భోద్భవో బలి
హాపద్మాపతిః కశ్చిన్నందః క్షత్రవినాశకృత్
తతో నృపా భవిష్యంతి శూద్రప్రాయా అధార్మికాః"

.... .... ....

---

Foot Note :- * ఈ విషయాన్ని ఋజువుచేసే క్రింది శ్లోకాలు "మత్స్యపురాణం" లోనివి.

**బుద్ధుని జీవితంలోని—రహస్యాలు:—** హిస్టరీలో బుద్ధుని గురించి రాసినదానికంటే రాయనిదే ఎక్కువ. ఇది బుద్ధుడేకాదు, శివాజీ, శ్రీకృష్ణుడూ—ఇలాగ చాలామంది మహానుభావుల జీవితాల్లోగూడా ఇంతే.

వారిజీవితంలోని మెరుపులూ, మనం తెలుసుకోదగిన మహాసత్యాలూ ఏకారణంచేత, ఏమిచూసి ఆనాటిలోకం ఆయామహాత్ముడికి భక్తితో చేతులు మోడ్చిందో, ఎందుకింతకాలం చరిత్రలో వారిపేరు చిరస్థాయిగా వుందో అవేవీ తెలియచెప్పని చరిత్రే యిప్పుడు మనంచదువుకునే విదేశీ చరిత్ర*. అందులో మనకి పనికొచ్చే సజీవమైన రసవత్తర అంశాలన్నీ క్రమశిక్షణతో తొలగించవేయబడ్డాయి. ఇకమిగిలినదల్లాతేదీలు, అంకెలూ (Dates)యుద్ధాలూ సంధులూ బ్రిటిషువారు మనకిచ్చిన రైల్వే తంతితపాలా ప్రజాపాలన వంటి ప్రచారసామాగ్రి. ఇదేపెత్త. మనచేత నెమరువేయించారీ మహామహులు. ఈనాడు విద్యార్థులకి చరిత్రలో 'ఇంటరెస్ట్' Interest) ఆసక్తి పోవడానికిదే కారణం—మనంచదువుకునే చరిత్రలో ఇలాంటి ఆసక్తి దాయకమైనవి రసవత్తరమైనవి దేశభక్తి విపుట్టించేవి ఏవీలేవి ఎండు విషయాలు కాబట్టే! వానికివిద్యార్థులదెలా అవుతుంది దోషం?

ఇలాంటి ఆసక్తిదాయకమైన విషయాలెన్నో బుద్ధుని జీవితంలో ఉన్నవి. ఇక్కడ కొన్నిమాత్రం వివరిస్తాను(అన్నీ అయితే ఒకగ్రంథంగా అవుతుంది కాబట్టి.)

**బుద్ధుడు చూపిన మహిమలు:—** ఒకానొకప్పుడు గౌతమ బుద్ధుడు 'వేణువనం' అనేచోట నివసిస్తూండేవాడు. ఆసమయంలో ఆయన కీర్తిప్రతిష్ఠలు దేశం అంతటాపాకి అనేకచోట్లనుంచి భక్తులు, రాజులు ధనికులూ పెద్దవాళ్ళెందరో బారులుకట్టి వచ్చివాళ్ళసర్వస్వంఆయనపాదాలకి

అర్పించి ఆయనకి 'భిక్ష' ఇచ్చి పాదపూజలు సలిపి ధన్యులయినట్లు సంతృప్తితో వెడుతున్నారు.

కాని, ఆదగ్గిరే వుంటూన్న ఒకబీద గృహస్తుడు తినతిండిలేనివాడు, అతడు. ఈదృశ్యాన్నిచూసి ఎంతో కుంగిపోతూండేవాడు. తనలో తానే అయ్యో! అందరిలాగ బుద్ధదేవునికి సమర్పించి సత్కరించడాని కేముంది? తినతిండి కూడాలేదే! అని.

అలాంటివాడికోసారి గాఢంగా నూరుమంది బ్రాహ్మణులకు అన్న సంతర్పణ చెయ్యాలని కోర్కె అణచుకోలేనంతగా కలిగింది. అది ఒక స్నేహితునితో చెప్పాడు. ఆయన బుద్ధదేవుడిని "ఆశ్రయించి పూజించు! అది వెయ్యిమందిబ్రాహ్మణులకు భోజనం పెట్టిన పుణ్యంయిస్తుం"దనిచెబుతాడు. అప్పుడా బీదవాడు అయ్యో! ఆయనను పూజించి సత్కరించగల తాహతుకి తానేమి రాజునా? ధనికుడినా? రెంటూకాదే అని నిరుత్సాహంచూపుతాడు. అప్పుడా స్నేహితుడు—'అలాకాదు! బుద్ధదేవుడు కరుణామూర్తి ఆయనకు మీశ్రద్ధ, భక్తి యీరెండేగాని గి అంతస్తులతోనూ, నువ్వుసమర్పించే వస్తువాహనాలతోనూ అవసరంలేదు అనిప్రోత్సాహం ఇస్తే, చివరికి బుద్ధదేవుడిని సమీపించి తనకోరిక వెల్లడిస్తాడు. ఆయన తీక్ష్ణప్రశాంత దృక్కులతో విదానించి అతడినిచూసి, సరే నీకుటిగిందాంతోనే భిక్ష తీసుకుంటమ్మన్నాడు—"కాని నూటుగురి సంతర్పణా అభిక్షతోనే చెయ్యి" అంటాడు.

మర్నాడు భిక్షసమయం. బుద్ధుడొక చెట్టుక్రింద ధ్యానం ముగించుకుని ప్రశాంత సుందర నేత్రాలతో కూర్చున్నాడు. ఇతడు భిక్షనూ—వండిన వంటకాలనూ ఆయనచేతిలోని భిక్షపాత్రలో వెయ్యడానికి సమీపించాడు. అప్పుడు, కూర్చునివున్న బుద్ధునిలోంచి లేచి ఇంకొక బుద్ధుడు, భిక్షపాత్ర పట్టి భిక్షను స్వీకరించి లేచి దూరంగావెళ్ళి చెట్టుక్రిందకూర్చుని భుజించడం

ప్రారంభించాడు. మొదటి బుద్ధుడలానే వున్నాడు చెట్టుక్రింద. మళ్ళీ రెండవ సారి యింకో బుద్ధుడు లేచి రెండోభిక్ష పాత్రలో స్వీకరించి, పోయి తన సాగాడు. ఇలాగ ఒకరితర్వాత ఒకరు ఆ బుద్ధుని శరీరంలోనించి లేచి రావడం జరుగుతూనేవుంది. తను తెచ్చిన గిన్నెలోని వంటకాలు వడ్డిస్తూనే వున్నాడు. ఉల్లిపాయలో పొరలు పొరలు ఊడివచ్చినట్టుగా, ఒకొకరే ఆ బుద్ధదేవునిలోంచి వెలువడటం, తరవ తరవకీ, భిక్ష అక్షయం కావటం—ఇలాగ నూర్గురు పూర్తి అయ్యేసరికి చెట్టుకింద కూర్చునివున్న బుద్ధుడు లేచి తృప్తితో మూతితుడుచుకుంటూ "నూరుమందికి భిక్షనిచ్చిన తృప్తి వచ్చిందా?" అంటూ ఆశీర్వదించాడు—అటుకులు తెచ్చిన 'కుచేలుని' ఆశీర్వదించిన కృష్ణభగవానుడిలాగ. ఉదు చూశాడు. భ్రాంతియేమోనని! కాదు! నూర్గురూ ఠోంచేసి లేచి చేతులు కడుక్కొని వేర్వేరుగా చేతులు తుడుచుకొని వెళ్ళి ఒకరి తర్వాత ఒకరుగా వెళ్ళి తిరిగి బుద్ధుడిలో కెళ్ళి కూర్చున్నారు—మొదట ఎలావచ్చారో అలాగే! ఇది ఆయనజీవితాన్ని వర్ణించే పాళీగ్రంథాల్లోనే వుంది.

ఇలాంటి మహిమలు ఆయన ఎన్నోచేసారు. ఇంకోసారి వేరొక భక్తునితో ఆయన "ఇదిగో చూడు నా శరీరంలో ఏముందో:" అంటూ,తన శరీరం పైభాగంలోనుంచి జాజ్వల్యంగా వెలిగే అగ్నిని, క్రిందిభాగంనుంచి నీళ్ళ జల్లనీ పుట్టించాడు. ఆయన ఆకారం ఆకాశానికంటేలావుంది. ఈ అనుభూతితో ఆయన శిష్యులు కొందరిలో, క్షుద్రశక్తులకోసం తాంత్రికుల వెంట పోయే మనస్తత్వం నాశనమయి, తమ గురుదేవుడి విద్యల కన్న హెచ్చువిద్య—మోక్షవిద్యనే, ఇవ్వగలడన్న ధృఢత్వంతో మళ్ళీ ఆ సిద్ధులజోలికే పోలేదు. ఇలాంటివెన్నో వున్నాయి. ఇంగ్లీషువాడి చరిత్ర కెక్కని చరిత్రలో!

ఇలాంటివి వేరే ఒక (నిజంగా జరిగిన) కథల సంపుటిగా 'ఇతిహాస కథా లహరి'గా వేరే వ్రాయాలనే సంకల్పంతో యిక్కడికింతవరకూ

చాలిస్తున్నాను: మనచరిత్రలో ఇలాటి అపూర్వవిషయాలెన్నో నిక్షిప్తమై నాయి. అవి తెలియనిదే బుద్ధుని పెద్దపెద్ద విగ్రహాలు దేవళాలలో పెట్టి ఎందుకు పూజిస్తున్నారో—రాముడినీ కృష్ణుడినీ పూజించినట్లు, అవన్నీ తెలియాలంటే—క్రీస్తు చేసినట్టు వ్రాయబడిన మహిమలూ, ఇంకా అంత కన్న అసాధ్యమైన మహిమలూ కూడా, బుద్ధుడు ఎన్ని చేసిచూపాడో, తెలిస్తేగాని అర్థంకాదు... ఆయనంటే మానవజాతికంత భక్తి ఎందుకో!

"బౌద్ధమతం"లోని హిందూత్వం - పశ్చిమవారి చరిత్రనంత పూర్తిగా పక్కకేసినవాళ్ళకి—బౌద్ధమతం కొత్త "మతం" కాదన్న విషయం తలకెక్కదు సరిగదా, అసలా విషయాన్ని విమర్శగా— యింతవరకూ వున్న హిస్టరీలో వ్రాసే ఆ వాదం "నిజమా కాదా" అని ప్రశ్నించుకోటం గాని—పరిశీలించటంగాని, లేదన్న సంగతికూడా కనపడదు. ఇలాంటివాళ్లకి పై నిచ్చిన అంశాలు—"హిందువుల" భగవద్గీతలోనుంచీ 'బౌద్ధు'ల "బుద్ధ ఉపదేశాల" నుంచీ తీసినవి—చూస్తే వాటి రెండిటిలోని సమానత్వం కళ్ళుతెరిపించేది! అవేగాక ఇంకా యీక్రింది అంశాలుచూస్తే మరీస్పష్టంగా తెలుస్తుంది—"బౌద్ధమతం" యొక్క "హిందూ"త్వము.

1. బుద్ధ చరిత్రలో బుద్ధుడు తపస్సు చేసుకొంటూండే "బోధి" చెట్టు క్రింద - "మారుడు" (మన్మధుడు)ఆయనను మోహింపచేయటానికి యువ్వనంతో నిండిన అప్సరసలనుపంపి తపోవిఘ్నంచేయచూసిన విషయం వున్నది. అది హిందూపురాణాలలో విశ్వామిత్రునితపస్సు చెరిచేందుకు "మేనక" (అప్సరస) రావటం—శంకరుని తపోభగ్నంచేసిన మన్మధుని కథలవంటిదే. అందులో 'హిందూ'దేవత మారుడు లేక మన్మధుడు బౌద్ధులకు గూడా తెలిసిన వాడే.

2. ఇంద్రుడూ ఐరావతం, యింకా బుద్ధదేవుని దర్శించేందుకు దేవతలూ, దిక్పాలకులూ, ఋషులూ వొచ్చినట్లే, వచ్చారని (శ్రీరాముడి శ్రీకృష్ణుడి వంటి అవతారంలో లాగే!) మనం బుద్ధకథలలోనేగాక ఈనాటికీ అజంతా చిత్రాలలోనూ అమరావతీ శిల్పాలలోనూ ఇంకా సార్నాథ్ సాంచీలవంటి—అనేకచోట్ల లభించేశిల్పాలలోనూ చూడవచ్చు. హిందూ దేవతల్ని బౌద్ధులూ ఒప్పుకొన్నారని తెలిపేందుకు ఇంతకంటే ఋజువు ఏంకావాలి? ఇలాగ ముస్లిం, క్రీస్తు జోరాస్తరు మతాలవాళ్ళు మారుడినీ ఇంద్రుడినీ దేవతలగా భావించి విశ్వసించిన ఋజువులుంటాయా? ఉండవు! అవి వేరేమతాలు గనక.

3. "టిబెట్" దేశంలోని బౌద్ధగ్రంథాలూ తంత్ర గ్రంథాలూ చూస్తే యిలాంటి నిదర్శనాలు అనేకం. హిందూమతంలో "తంత్ర గ్రంథాలు"న్నట్లే బౌద్ధంలోనూ తంత్రగ్రంథాలున్నాయి అలాంటివే 'వజ్రేశ్వరి' 'తారా' అవలోకితేశ్వరివంటి బౌద్ధతంత్రాలు. ఇవి బౌద్ధతంత్రాలుగా ఇంగ్లీషుదొరలూ అంగీకరించినవే. వీటిల్లోనూ "తంత్ర" పదమే వున్నది!

4. అంతేగాదు. బౌద్ధమతంలోనూ హిందూమతంలాగే 'మంత్రా'లున్నాయి. ఉండటం మాత్రమేగాదు. అందులో హిందువుల మంత్రాలలోనివే— "బీజాక్షరాలు" కూడా ఉన్నాయి దీనికేమంటారు?

5. అవేమిటో ఋజువులు కావాలంటే; "ఓం" అన్నది శుద్ధ హిందూ బీజాక్షరం—'ప్రణవం' అంటాం. అది బౌద్ధ మంత్రాలలోనూ వుంది.

ఉదా :- "ఓం మణి పద్మ హుం"

అన్నది యీ నాటికీ 'టిబెట్టు'లో జపించబడే మంత్రం. నేను 'దలైలామా' (Dalai Lama)ను కలిసినప్పుడు ఆయనతోటి టిబెట్టు యోగులు (లామా 'Lama'లు) యీ మంత్రం జపించటం చూశాను.

6. ఇలా "ఓం' అన్న ప్రణవం ఒకటేకాదు ఇంకా :-

"హుం" "ఫట్" "స్వాహా" లాంటి వెన్నో కనిపిస్తాయి, బౌద్ధ తంత్రాలలో చూస్తే కొల్లలుగా, వీటికేమందాము !

7. యంత్రాలనేవి—'శ్రీ చక్రం' లాంటివికూడా అనేకం బౌద్ధ మంత్రశాస్త్రం తంత్రశాస్త్రంలో కొల్లలు! "సిద్ధ నాగార్జున తంత్రం" అన్న నాగార్జునా చార్యుడనే బౌద్ధువిగ్రంథంలో ఇంకా వున్నాయి—ఇలాటి 'బోందూత్వపు' చిన్నెలు, కొల్లలుగా.

8. "ధర్మం"—ధర్మదేవత వృషభంలాగ ఎద్దు రూపంలో వుండటం భారతం భాగవతంలో కనిపించే హిందూభావం. ఇది ఢిల్లీలోని బౌద్ధ శిల్పాలు మన 'రాష్ట్రపతి' భవనంలోని మ్యూజియం (Museum)లో వున్న వాటిల్లో "ధర్మదేవత" ఎదురుగా ధర్మచక్రంపైన శిల్పాని వున్నట్టుంది. అంతేగాదు మన ప్రభుత్వచిహ్నం (బౌద్ధచిహ్నమే తీసుకొన్నారు నెహ్రూ కావాలని !) లోని "మూడు సింహాల" క్రిందచూస్తే,ధర్మచక్రం ప్రక్కన ధర్మదేవత ఎద్దురూపంతో చక్కగా చూడవచ్చు. దీని అసలుశిల్పం 'సారనాథ్ దగ్గర మ్యూజియంలో ఆఎద్దును ఇంకా స్పష్టంగా చూడవచ్చు.

9. 'యోగశాస్త్రం' హిందువులకు వేదాలనించీ భగవద్గీతనుంచీ పతంజలి కాలంనుంచీ కూడావస్తున్న ఆస్తి. అందులోని పదజాలం—"ధ్యానం 'సమాధి' (సంబుద్ధి, ప్రాకృతమాటల్లో) "ధర్మం" (పాళీ ప్రాకృతంలో, 'ధమ్మం' బుద్ధి (బోధి) లేక అశ్వద్ధవృక్షం—గీత 16-వ అధ్యాయంలోని దవిన్నీ, జ్ఞానంగాచూపించి తెలిపి యీ అశ్వత్థవృక్షంరహస్యం తెలిసిన వాడు వేదాలుతెలిసినవాడని యిలా స్పష్టంగా వున్నదే—

"యస్తంవేద స వేదవిత్"—(గీత 16 అధ్యా.)

బౌద్ధ పరిభాషలో 'బోధిగా' (బుద్ధి) రావిచెట్టు (అశ్వత్థంగా.)

కనిపిస్తూనేవుంది. ఇది కేవలం కాకతాళీయం. లేక శబ్దాల పోలిక, అంటే యీ క్రిందిది, ఇంకాగట్టి ఋజువు.

10. కొన్ని బౌద్ధ శిల్పాలలో బుద్ధునిని చూపాల్సివొస్తే ఆయనను మనిషిగా చూపక—రావిచెట్టుగా 'చిహ్నం'తో వేశారు, దీనికేమందాం! రావిచెట్టు, లేక అశ్వత్థం జ్ఞానానికి రూపం (అంటే 'బుద్ధి' అని గీతలో ఉపదేశించబడిన 'బోధి'), అది గీతలోని 'వేదార్థం'కు రూపచిత్రణే!

ఇవిచాలు—నిష్పక్షపాతంగా ఆలోచించగల శక్తి మెదడుకి ఉన్న వాళ్లకు, అలాకాకపోతే కళ్లకు బ్రిటిషువారి ఉపదేశా లనే నల్లకళ్లద్దాలున్న 'దొర'లకు సత్యంతీసుకొచ్చి ఎదుటబెట్టినా దాన్నిచూడలేరు! వాళ్ళకి కావల్సింది యదార్థం కాదు—నల్ల కళ్లద్దాలే! అవే పుంచుకోవచ్చును. వారికిష్టమయితే!

## బుద్ధుడూ, శ్రీకృష్ణుడూ—అవతారపురుషులు :-

పై విషయాలే చాలు. కాని ఇంకా ఎవరైనా కొంచం ఓపికచేసుకుని విపులంగా బౌద్ధ సాహిత్యం గనక జాగ్రత్తతో చదివితే బుద్ధుడూ, శ్రీకృష్ణుడూ ఈ రెండూ— అసలు ఒకేమతానికి వేరువేరు కాలాలలోని అవసరాలకు, చేయబడిన రెండు రూపకల్పనలేనని. అసలు వేరేమతస్థులు కారని, వారుబోధించిన యీ క్రింది అంశాలవల్లే ఋజువవుతుంది. హిందూ మతగ్రంథం అనుకునే భగవద్గీతలో కృష్ణుడు బోధించినవీ 'బౌద్ధమత' మనుకునే గౌతముడి ఉపదేశాలనూ ఈ క్రింద పోల్చిచూద్దాము పైదృష్టితో ముఖ్యంగా యీ అంశాలు గమనించాల్సినవి.

కర్మ:- హిందూమతంలోని పట్టుకొమ్మ కర్మసిద్ధాంతం. అంటే, మనిషి ఈ జన్మలోచేసిన కర్మ వొచ్చేజన్మలో అనుభవిస్తాడని, బౌద్ధమతంకూడా కర్మ' సిద్ధాంతాన్నే బోధించింది.

అంతేకాదు. బుద్ధుని పూర్వజన్మలూ—ఏజన్మలో ఏకర్మకి ఏఫలితం వచ్చిందో అన్నివర్ణించాయి-బుద్ధుని "జాతక కథలు". ఇది బుద్ధదేవుడు తన శిష్యులకు సందర్భాన్నిబట్టి తన గతజన్మల అనుభవాలతో చెప్పినవిష యాలనుండి సేకరించినవి.

**బౌద్ధంలో 'పూర్వజన్మ'**:- హిందూమతంలో మనిషి చనిపోయి మళ్లీ జన్మఎత్తుతాడు—మోక్షం పొందేదాకా! అన్నసత్యం బౌద్ధమతంలో యీ పూర్వజన్మ కర్మపరంపరలు మోక్షం. ("సంబుద్ధ"స్థితి) పొందేదాకా బుద్ధుని కెలాగవచ్చాయో అన్నది, "జాతక కథలలోనే" వుంది.

## ఇదే అంశంభగవద్గీతలో :-

"బహూని మే వ్యతీతాని జన్మాని తవచార్జున ..." అర్జునా! నాకూ అనేకజన్మలు గడచినవి, నీకూ గడచినవి. కాని అవి నాకుగుర్తుంటాయి. నీ కుండవు" అని చెప్పినట్టుగానే బుద్ధునికున్నట్టు సామాన్యులకు పూర్వ జన్మలు గుర్తుండవన్నది బుద్ధుని "అవతార" త్వాన్ని—కర్మసిద్ధాంతాన్ని ఖండితంగా నిరూపిస్తోంది ఇతరమతాలైన, ఇస్లాం, క్రిష్టియను మతం లోనూ కర్మ, పూర్వజన్మలు, విశ్వసించరుగదా !

## బౌద్ధమతం యజ్ఞాది కర్మలను నిరసించుట : :-

అయితే ఇంకొకప్రశ్న అడగవచ్చు ఎవరైనా. ఏమంటే హిందూ మతంలోని యజ్ఞ యాగాలవంటి కర్మకాండని బౌద్ధం నిరసిస్తుందిగదా, మరి అది హిందూమతమే అనటం ఎలాగ, అని దీనికి సమాధానం అతి సూక్ష్మంగా పరిశీలించితేగాని పట్టుకోలేము. అదికూడా, గీతలోనేవుంది.

"జ్ఞానయోగేన సాంఖ్యానాం
కర్మయోగేన యోగినాం"

[జ్ఞానులకు జ్ఞానయోగమూ—కర్మయోగులకు యోగం అని, అర్థం.]

అంటే హిందూమతంలో అనేక మార్గాలున్నాయి, అందులో కర్మ మార్గంలోకి వొస్తాయియజ్ఞాలూ, పశుహింసవంటి కర్మకలాపం. జ్ఞాన మార్గంలో వెళ్ళేవాళ్ళ కివేవీ అక్కర్లేదని శ్రీకృష్ణుడే—స్వయంగా పై శ్లోకంలో చెప్పిందికూడా. అయినా యజ్ఞాలని నిందించినట్టేనా?

ఇంకో విషయం: బుద్ధుడు ఏందుకాయికి యజ్ఞాన్ని ఎలాగ మాని పించి క్రతువులను నిరోధించాడో, జంతుహింసకూడదని - అదేవిధంగా శ్రీకృష్ణుడుకూడాతంక్రిందేయమన్న -ఇంద్రయాగాన్ని' వ్యతిరేకించి మాని పించాడు. అంతేకాదు యజ్ఞములన్నిటికన్నా జపం, ధ్యానం (బుద్ధుని మార్గమైనజ్ఞానమార్గం) శ్రేయము అని "యజ్ఞానాం జపయజ్ఞోస్మి" చెప్పాడు. అంతేకాదు. బుద్ధిని ఆశ్రయించినవాడే ముక్తిపొందుతాడని "బుద్ధౌశరణమన్విచ్ఛ" అనిచెప్పాడు. అలా బుద్ధిని శరణుపొందినవాడే "బుద్ధుడు"ఇదే కాలాంతరంలోమారి 'బుద్ధంశరణం గచ్ఛామి'కింద పరిణమించింది. అందుకని కృష్ణుడిని కూడా బౌద్ధమతానుయాయి అందామా-తెల్లదొరల ధోరణిలో

పై విషయాలనుబట్టి తేలిగ్గా తెలిసిపోతూంది -బౌద్ధంవేరేమతంకాదు అందులోనూ హిందూమతంలోని మూలసూత్రాలకి దేమీభిన్నంకాదుసరిగదా హిందూమతంలోని సంస్కరణలవంటివే బుద్ధుని ప్రవచనాలుకూడా, అంటే ఆదిశంకరులు, రామానుజులు, చైతన్యులూ, శ్రీరామకృష్ణపరమహంస వంటి హిందూధర్మంలోని ఒకమహనీయుడే బుద్ధదేవుడూను- అనికూడా అవు తున్నది.

శ్రీరామకృష్ణుడు అన్నిమతాల సాధనలూ, చెయ్యటం శ్రీచైతన్యులు కబీరు, తుకారామ్, నామదేవుడూ ఎలాగ కులమత భేదాన్ని పాటించనంత మాత్రాన హిందూమతానికి వ్యతిరేకులు కాలేదో-ఇంద్రోత్సవం ఆపినంత మాత్రాన శ్రీకృష్ణుడు చర్యలు వేదవిరుద్ధాలు ఎలాకాదో—అలానే బుద్ధదేవుని బోధనలుకూడా హిందూమతంమీద విప్లవంకాని, ద్వేషంగానికాదు. కాక

·పోతేఆయన కాలానికున్న సంఘంలోని మూఢాచారాలన్నిటినీ గాంధీజీలాగే వ్యతిరేకించాడు—బుద్ధుడుకూడా! అది ప్రతిమత ప్రవర్తకుడూ - క్రీస్తు నుంచి యీనాటివరకూ—సంఘ దురాచారాలని ఎవరు వ్యతిరేకించలేదు? బుద్ధుడూఅంతే! వేర్పాటుధావాలకు, ఆయనబోధనలని హిందూమతంతో పోల్చిచూస్తే, అసలు తావే లేదు.

అదికేవలం బ్రిటిషుప్రయోజనాలకి ఉపయోగపడే కట్టుకథలలో— ఆర్యుల దండయాత్ర, బైబిలుగీతనుంచికాపీ. లేక క్రీస్తుచరిత్రని హిందువులు "కాపీ"చేసి కృష్ణకథ అన్నారన్న "జోన్సు"వాదంలాంటిదే ఇదీను.

కృష్ణుని కథలంతా క్రీస్తుకథ బైబులులోంచి మన దేశస్థులు కాపీ కొట్టిందేననీ - "సర్ విలియం జోన్సు"(Sir William Jon(s)దొరవారు రాసిన వాక్యాల వంటివి, అంతకన్న అధ్వాన్నం అయినవీ, కొల్లలు.* ఈ వాక్యాల అర్థం స్థూలంగా ఇది:-

---

*The celebrated poem entitled Bhagawat, Which contains a prolix account of his life, is filled with narratives of a most extrordinary kind, but strange of variegated and intermixed with poetical decorations . This motley story must induce an opinion that the spurious Gospels which abounded in the first age of Christianity had been been brought to India, and the wildest part of them repeated to the Hindus. Who ingrafted them in the old faole of Caesara, the APollo of Greece."

On the Gods of Greece, Italy and India' by Sir William Jones:

"పేరుమోసిన గ్రంథమైన "భాగవత్" అతని (కృష్ణుని) జీవితంలోని సంఘటనలతో గజిబిజిగా అల్లుకున్న అద్భుతమైన అసాధారణమైన కవితా కల్పనలతో కూడివుంది.. ఈ అతుకుల బొంతవంటి కథని చూస్తే ఏం తోస్తుందంటే—పూర్వపురాణాలలో' అంటే బైబిలులోని క్రీస్తు కథలు తెలిపే 'గాస్పెల్సు'—సరిగా తెలియనివారి నోళ్ళలోబడి మారి, భారత దేశానికి వచ్చి వుంటాయి. ఆ కాలంలోనే ఇక్కడ హిందువులకి ఆ పాదరీలు చెప్పినవే విని హిందువులు, వాళ్ళ మతంలోని గ్రంథాలలోకి ఇరికించుకొని వుండటం, ఆ క్రీస్తుకథలే వాళ్ళ 'కేశవ' అన్న (తప్పుడు స్పెల్లింగు) గ్రీకు దేవుడు 'అపోలో' కథతో మారి కృష్ణ కథ అయ్యిం" వట. ఇది జోన్సుదొరగారి కవిత్వం, కల్పనకాదు. ఆనాటి బ్రిటిషు చరిత్రకారులకుండే భారత సంస్కృతి అంటేవున్న ద్వేషం. అది ఇంకాస్పష్టంగా "Hostility to Hinduism in the 1790 extended beyond Evanjelical circles .....Joseph Priestly had a low opinion of Hinduism..... In priestly's opinion, the general character of the devotion of the Hindus is that of debasing, superstition" అన్న పి. జె మార్షలు మాటలు ధృవపరుస్తాయి—ఇంకా ఋజువులు కావలిస్తే!

## అనేక బుద్ధులు—గౌతమబుద్ధుని పూర్వజన్మ :-

'బుద్ధుడు' ఒకడేకాదు. అనేకమందివున్నారు. బౌద్ధమతం యీ 'గౌతమ' బుద్ధుడితో పుట్టిన 'కొత్త మతం' ఏమీకాదు మనలో చాలామంది అనుకునేట్టు. కేవల పాఠ్యగ్రంథాలలోని చరిత్రమీద పెరిగిన మనలెక్చరర్లకీ అధ్యాపకులకీ తెలియని అంశాలలో ఇది ఒకముఖ్యమైన కొత్త విషయం. గతంలో అనేకమంది బుద్ధులు గతించారు-అందులో అధునాతనుడే, శుద్ధోదన పుత్రుడైన గౌతముడు. మొదటి బుద్ధుడు త్రేతాయుగంప్రాంతం

లోని బౌద్ధావతారుడు. కపిలమహర్షి సాంఖ్యం ఉపదేశించిన తదుపరి. ఈయన తన బౌద్ధమతం ఉపదేశించాడు.

సంస్కృతంలో 'బుద్ధుడు' అంటే జ్ఞాని: బుద్ధిని ఆశ్రయించి— జ్ఞానయోగ మార్గంలో 'ధ్యానం' ఆధారంగా సిద్ధిని పొందే విధానమే యీ 'బుద్ధుల' మార్గం. అదికూడా తాను చెప్పిన 'కర్మ' 'యోగ మార్గాలతో పాటు శ్రీకృష్ణుడు 'బుద్ధియోగం'గా వివరించాడు. దీన్నిబట్టి యీ బుద్ధుల "మతం" హిందూదర్శనాలూ, బ్రాహ్మణాలూ అరణ్యకాలలోని అనేకవిధాలైన మోక్షమార్గాలతోపాటు, ఇదికూడా వొకటి అని తెలుస్తోంది. దీనికి ఋజావులు సూక్ష్మంగా ఇవి :—(1) భగవద్గీతలో—అంటే 3138 B.C- నాటికీ—'బుద్ధమతం' బుద్ధియోగంగా వున్నది, హిందూమతంలోని యోగ, కర్మ, భక్తి మార్గాలలాగే. (2) అవి ఎలాగ వేరే 'మతాలు' కావో, బుద్ధుల మార్గం కూడా వేరుపంథాయేకాని వేరు 'మతం' కాదు (3) వేదవ్యాస మహర్షి వ్రాసిన 'బ్రహ్మసూత్రాల'లో కపిల సాంఖ్య 'బౌద్ధ' మతాల ఖండన వున్నది. వేదవ్యాసుడు శ్రీకృష్ణుని కాలంవాడు.* దీన్నిబట్టి బుద్ధ మతానికి బౌద్ధం అన్నపేరుతో చార్వాకుల మతంలాగే (ఇది నాస్తికం కాని హిందూ "దర్శనాల"లో ఒకటి) వున్నది—మహాభారత కాలంనాడేనని రుజువవు తున్నది. (4) చార్వాకుడు భారతకాలంవాడు (5) టిబెట్టులోనూ నేపాలు, థాయ్‌లాండు వంటి యితరదేశాలలోని బౌద్ధంలో యీ గౌతమ బుద్ధునికి పూర్వపు బుద్ధులూ రానున్న బుద్ధుడూకూడా వర్ణింపబడివున్నారు.

---

Foot Note :- *కొందరు బ్రహ్మసూత్రాలు వ్యాసమహర్షి పేరిట తర్వాత వాళ్ళెవరో వ్రాసి వుంటారని పాశ్చాత్యులలాగ సందేహించ వచ్చు. కాదని శ్రీకృష్ణుడు 'భగవద్గీత' లోనే స్వయంగా "బ్రహ్మసూత్ర పదైశ్చైవ" అని పేర్కొనటంవల్ల వ్యాసుడు శ్రీకృష్ణుని సమకాలికుడని తెలుస్తుంది. లేకపోతే కృష్ణుడెలాగ ఉదహరిస్తాడు 'బ్రహ్మసూత్రాలను?

ఇతని పేరు 'మైత్రేయ' బుద్ధుడు. ఇతడు యుగాంతానికి జన్మించడంకోసం 'తుషిత' స్వర్గంలో వేచివున్నాడు. బౌద్ధుల గ్రంథాల ప్రకారమే! అలాంటప్పుడు గౌతమబుద్ధు డెలాఅవుతాడు బౌద్ధమార్గ విద్వేషి?

పై మార్గాన్ని ఖండితంగా ఋజువుచేసేకథ ఒకటి—గౌతమబుద్ధుడే స్వయంగా చెప్పినది వున్నది. అదీ తన జన్మలలోని ఒక జన్మలో (అప్పటి కాయన 'బుద్ధుడు'కాలేదు) తాను అనాటి బుద్ధుడైన "దీపంకర బుద్ధుని" కలసి ఆయన ఆశీస్సులను పొందిన ఉదంతం చెప్పారు శాక్యముని:

అది పూర్వం అనేక 'యుగాల'నాటి గాథ. అసలు చెప్పాలంటే బౌద్ధ పురాణాలయిన 'లలిత విస్తరం' మహా పురాణాదులలో పూర్వబ్రహ్మ 'కల్పం'లో జరిగిన గాథ యిది :—

నగరంలో ఎంతో కోలాహలంగా వుంది. జనసమర్ధం ఎటుచూసినా అందరూ ఆ నం దో త్సా హం తో ఉ రు కు లూ, పరుగుల మీద వెళుతున్నారు కోలాహలంగా, అందులో కొత్తగా నగరంలో ప్రవేశించిన 'గౌతముడు' (అప్పటికింకా 'బుద్ధుడు' కాలేదు!) 'ఏమిటీ కోలాహలం?' అంటే: బుద్ధదేవుడయిన "దీపంకరులు" వేంచేస్తున్నారు మననగరానికి. అనేక జన్మలలో గాని ఒక సారైనా సమకూడని దివ్య సన్నివేశం. దీన్ని జారవిడుచుకోకుండా ప్రజలు ఆయన దర్శనానికి పోతున్నారు." అని చెబుతారు.

అదివిని గౌతముడు ఆయనని దర్శించాలనే కుతూహలంతో చెరువులో శుచిగా స్నానంచేసి కమలాలు (తామర పుష్పాలు) తీసుకుందామనుకుంటే అందరూ కొనేసుకోవటంవల్ల దొరకవు. ఊళ్లో ఎక్కడ చూసినా ఎవరూ అమ్మరు అందరూ ఆయనకి తామే సమర్పించాలని! అప్పుడొక బాలిక 'కొన్ని తామరపూలు తీసికెళుతూంటే గౌతముడు ఆమెను ఎంతో ప్రాధేయపడి ఆమెనుంచి తీసుకుంటాడు' మూడు పూలు. ఆమె ఒక్క షరతుమీద యిస్తుంది. అదేమిటంటే—తన పూలను త్యాగంచేసి అమూల్య

మైన తరుణం గౌతమునికిచ్చింది గనుక, అమెకు మోక్షం వొచ్చేదాకా గౌతముడే జన్మజన్మకీ భర్త కావాలి, అవి. చేసేదిలేక సమ్మతిస్తాడు. యిద్దరూ వడివడిగా జనసమ్మర్ధాన్ని తోసుకుంటూ చేరారు.

ఇంతలో జనంమధ్యనించి "దీపంకర బుద్ధుడు" దివ్య తేజస్సుతో వేలాది జనాన్ని పునీతంచేస్తూ నడుస్తున్నాడు. అటూ యిటూ జనం, ఎడమిచ్చి ఆయనపాదాలకు శిరస్సులానించి మొక్కుతున్నారు. ఆయన దగ్గరకి చేరడానికి జనం అడ్డున్నందువల్ల దూరాన్నించే గౌతముడు తన చేతులలోని మూడు తామరపూలనూ ఆయన సమీపించగానే, ఆయనపైకి విసిరాడు కాని అవి పైకెగిరి క్రిందపడకుండా ఆకాశంలోనే నిలిచిపున్నాయి. బుద్ధదేవుని కిరుప్రక్కలా రెండుపూలు! తలపైగా యింకొకటి—అలా గాలిలో తేలుతూ నిలిచాయి. అందరూ ఈ ఆశ్చర్యాన్నిచూసి దిగ్భ్రాంతు లయ్యారు. అప్పుడు "దీపంకర"బుద్ధుడు చిరునవ్వుతో గౌతముడిని ఆహ్వా నించి ఆశీర్వదించారు.

"రానున్న కల్పంలో ఒకానొకనాడు నీవూ నాలాగే బుద్ధుడివవు తావు. కాని యీ లోపున అనేక జన్మలెత్తవలసి వుంది. కానీ నీ కడపటి జన్మలో నువ్వు బుద్ధుడివైన తర్వాత నీకీ విషయం మనమిద్దరి సన్నివేశం —గుర్తొస్తుంది. అన్ని గత జన్మల గాథలూ నీ కప్పుడు జ్ఞప్తికివస్తాయి అనేకమంది జీవుల్నినువ్వు తరింపచేస్తావు" అని దీపంకర "బుద్ధుడు" ఆశీర్వదించారు. ఆయన ఆశీర్వచనం తనకి ఎన్ని జన్మలో అండగా వున్నది—అని గౌతమబుద్ధుడు తన శిష్యులకు స్వయంగాచెప్పాడు. ఒక 'బుద్ధుని" దర్శనపుణ్యం ఎంతపనిచేస్తుందో ఉదహరిస్తూ.*

ఈ కథపై* అనేక అంశాలనుగురించిన సందేహాలకు, తావులేకుండా ఋజువుచేస్తుంది.

---

*చూ "Buddhist Scriptures" అన్న పాశ్చాత్యులు వ్రాసిన ఇంగ్లీషు గ్రంథం. ఇది బౌద్ధపురాణాలలోనూ వుంది.

**గౌతమ బుద్ధుని కాలనిర్ణయం :-** భారతదేశ చరిత్రలో నిర్దుష్టంగా కాలనిర్ణయం చెయ్యటానికి మనకీనాడు ఉపయోగపడే మైలురాళ్ళవంటి చరిత్రాత్మక ఘట్టాలలో బుద్ధదేవుని అవతారం, ఆయన 'మహాపరి నిర్వాణం' చెందిననాటి కాలమూ అతిముఖ్యమైనవి. అందుకని ఆయన నిజంగా ఏ కాలంలో జీవించారో తెలుసుకోవాలంటే యీ రెండుతేదీలు అతిముఖ్యమయిన ఆధారాలు.

అంతేకాదు బుద్ధునికాలం ఆధారంగా విదేశీయులు కల్పించిన* యితరరాజుల తర్వాత చరిత్రను సరిదిద్దటానికి కూడా ఉపయోగపడుతుంది. ఎందుకంటే అనేకమంది విదేశీయులు 'స్మిత్' (V. A Smith) నుంచీ 'జోన్సు' వరకూ ఎవరికి తోచినట్టువాళ్ళు క్రీస్తుపూర్వం 1000 సం।ల నుంచీ 486 B. C వరకు వేరువేరు కాలాలు యిచ్చారు! అందరూ విదేశీయులే! అందుకని ఇవన్నీ కూడా బుధునికాలంగా తీసుకోలేముగా! అందుకనికూడా బుద్ధదేవుని సరియైనకాలం నిర్ణయంచెయ్యటం చాలా అవసరం.

---

Foot Note* డా. రాయ్‌చౌధురి :- "The date of Asoka has sometimes been determined on the basis of Buddist tradition regarding the Nirvana and the interval of 218 years between that memorable event and the Coronation of the Mauryan monarch. But as the date of Buddha's death is itself uncertain, and the correctness of the interval of 218 years between that event and Asoka's Coronaton is also doubted, we cannot solve the problem of Asoka's date in this way"—Ray Choudhuri.

(The date of Ashoka is made the basis to fix the date of Sandrocottos)

పురాణాలు బుద్ధదేవుని అవతారమూర్తిగా ఎంచి మనదేశ చరిత్రలో చాలా ప్రాముఖ్యమైన ఆయన కాలం, ఆ సమయంలో మనదేశంలోవున్న సమకాలికులయిన యితరరాజులూ అన్నీ యిచ్చారు.

ఇలాగ మనదేశ చరిత్రని మార్చటానికిచేసిన దురన్యాయం సరిదిద్ద టానికి మనకుపయోగపడేవి ఐదు 'మైలురాళ్ళు' అవి.

1. కృష్ణ నిర్యాణం.
2. బుద్ధదేవుని జననం.
3. బుద్ధదేవుని నిర్యాణం.
4. అలెగ్జాండరు దండయాత్ర.
5. 'శక'కర్త అయిన సార్వభౌమ విక్రమాదిత్యుని శకకాలము లేక "విక్రమశకం."

అందులో ప్రస్తుతానికి బుద్ధదేవునికాలం తక్కిన శ్రీకృష్ణకాలం కలియుగారంభకాలం తర్వాత అంతటి ముఖ్యమైన మెట్టు. అందుకని ఈ విషయాన్ని మనం కొంచం విపులంగానే చర్చించాలి.

**బుద్ధుని సమకాలికులు :-** సామాన్యంగా చరిత్రలో గౌతమబుద్ధుని స్థానము నిర్ణయించాలంటే ఆయన ముందుకాలంలోను, ఆయన తర్వాత ఉదహరింపబడిన రాజులనుబట్టి ఆ రాజులకాలము పురాణాలలోను, ఖగోళ గణితం ఆధారంగాను ఏకాలంవారో నిర్ణయించి, తద్వారా బుద్ధుని సమకాలి కులను తెలిసి కొనవచ్చును.

బుద్ధుడు ఇక్ష్వాకు వంశస్థుడైన శుద్ధోదనమహారాజు కొడుకని అంద రికి విదితమే. ఈ ఇక్ష్వాకువంశమే శాక్యవంశముగా ఏవిధంగా మారిందో తెలిపే ఆధారాలుకూడా ఆనాటి చరిత్రనుండి మనము తెలిసికోవచ్చును.

Kshatriya Clans in Buddhist India' అనే గ్రంథములో 'విమల చరణ్‌లా' అనే పండితుడు, శాక్యులు, లిచ్ఛవీ రాజవంశము రెండూగూడా ఒకేరాజవంశముయొక్క శాఖలని వ్రాసియున్నారు.

"The Sakyas and the Lichchavis are branches of the same people " (i. e. The Ikshvakus.) (Vide, Kshatriya clans in Buddhist India' by Bhimala Charan, Law-)

అంటే ఇక్ష్వాకు వంశంలో నుంచిరెండుశాఖలు చీలిపోయినవి. అందులో ఒకటి శాక్యవంశము, రెండవది లిచ్ఛవీరాజవంశము. ఇదే విషయాన్ని పండిత శ్రీ కోట వెంకటచలంగారు ఈ విధంగా ధృవ పరుస్తున్నారు.

The 92nd Sakya, King of the Ikshvaku dynasty, after the Mahabharata War (3138 B. C.) became the ruler of North-Western portion of Kosala- Kingdom lying at the foot of the Himalaya Mountains adjoining Nepal, Kapilavastu was its Capital (Age of Buddha, Milinda. Amtiyoka and Yugapurana. P II·)

ఇక్ష్వాకులు శ్రీరామచంద్రుడు జన్మించిన సూర్యవంశపు రాజులు. ఇందులో రామునితర్వాత లక్ష్మణుని (లచ్మన్)పేరుపొందిన వికృతి ఆధారముగా లిచ్ఛవాయి లేక "లిచ్ఛవీ" వంశము వచ్చినట్లుగా ఈ క్రింది ఆధారమువల్ల ధృవపడుతున్నది.

"The famous word 'Lichchavi' with its various forms is only a corruption of 'Lakshmanuja' i e. belonging to the dynasty of Lakshmana. In some Sanskrit works

also like 'Divyavadana' and Mahavastu Avadana the terms Lichchavi were respectively used. (Vide Mahavastu by E Sirart, PP 1, 254 and Kshatriya Clans in Buddhist India, By Bhimala Charan Law M. A; B. ED: 1922 PP. 2, 3.)

ఈ ఇక్ష్వాకుల రాజవంశావళి "విష్ణుపురాణం" మత్స్యపురాణం మొదలుగాగల ప్రాచీనగ్రంథాలలో, భవిష్యత్ కాలజ్ఞానమును వర్ణించే అధ్యాయాలలో వివరించ బడ్డది. అంతేగాక ఈ ఇక్ష్వాకులయొక్క రాజ వంశావళి "సుమిత్ర" అనేరాజుతో అంతమవుతుందని పురాణాలలోని ఈక్రింది శ్లోకంవల్ల తెలుస్తున్నది.

"ఇక్ష్వాకూణా మయంవంశః సుమిత్రాంతో గమిష్యతి."

బుద్ధుని తండ్రియైన శుద్ధోదన మహారాజు ఇక్ష్వాకువంశజుడని పైనే తెలుపబడ్డది. ఇదేవిషయం"ఇక్ష్వాకురాజుల పట్టిక" List of Kings of Ikshavaku Dynasty)చూచినట్లయితే అందులో 23-వ రాజు' శుద్ధోధనుడు 'ఈ శుద్ధోధన మహారాజే మన గౌతమబుద్ధునితండ్రి, ఔనా! కాదా అని అనుమానించిన కొందరు ప్రబుద్ధులు చారిత్రకులలో ఉండవచ్చు. కాబట్టి ఆ సంశయనివారణ కోసం విష్ణుపురాణంలోని ఈక్రింది శ్లోకాలే ప్రమాణం.

"మాయా మోహస్వయాపో౽సౌ శుద్ధోధన సుతో౽భవత్।
మోహయామాస దైత్యాం స్తాంస్త్యాజితాన్ వేదధర్మకమ్।
తేన బౌద్ధా బభూవుర్హి తేభ్యో౽న్యే వేదవర్జితాః।"

అనగా "తన పూర్వజన్మలో మాయామోహు"డని పిలువబడే అతను శుద్ధోధనమహారాజుకు పుత్రుడుగా జన్మించెను. అతని బోధనలు, ఉపన్యాసములవలన చాలమంది తమ పూర్వాచారమునుండి వస్తూవున్న వైదికమతము విడనాడి బుద్ధుని క్రొత్తమతమును స్వీకరించి బౌద్ధులుగా మారినారు అని.

ఇదే విషయాన్ని ఇతరపురాణాలుకూడా తెలుపుతున్నాయని పండిత కోటవెంకటచలంగారు ' The Ikshvaku dynasty terminated with 'Sumitra'. This is known from the Matsya, Vayu, Vishnu, Brahmanda and other Puranas. The Puranas declare that the Lord Buddha was the son of 'Suddhodana' (the 23rd King in Ikshvaku dynasty.)"

(Vishnu Puranam, Amsa IV. Ch. 22.)

అని తెలుపుతున్నారు.

బుద్ధదేవుడు దేశమంత పర్యటించి తన ఎనభైయ్యవ సంవత్సరం వరకు విరామములేకుండా జ్ఞానబోధ చేసినట్లుతెలిపే ఆయనమాటలే మనకి ఆధారము. ఆయన ఒకసారి తన ప్రియశిష్యుడైన ఆనందునితో ఈ విధంగా అన్నాడు :—

"ఆనందా ! నేనిప్పుడు చాల ముసలివాడినయ్యాను. నా కిప్పుడు ఎనభై ఏళ్ళు. నా దేహం శిధిలమై పాతబండిలాగ మేకులు, బండులు, ఊడి పోయి ఎప్పటికప్పుడు అతుకులు పెట్టితే నడుస్తున్నది." అంటూ చలోక్తిగా తననుగురించి చమత్కరించాడు. "Anarda, replied Buddha,...... I am now very old, my years number eighty. I am like an old cart, the iron wheels and wood of which are kept together by constant repairing." (Ibid Vol. II. P. 9.)

ఆయన ఇంకా ఇలా అంటున్నాడు. "నా ఇరవై తొమ్మిదో సంవత్సరంనుంచీ ఈ నాటివరకూ నిర్విరామంగా శ్రమపడి పరిపూర్ణజ్ఞానం కోసమే శ్రమించాను. అంతేగాదు. మనప్రాచీనఆర్యులు (పెద్దలు). ప్రయాణించిన మార్గాన్నే శ్రమించి 51 సంవత్సరములు గడిపాను."

"Buddha said, O ! Thoubat, I will preach to you the Law :- listen with attention to my. words, and treasure them in your heart :— ... ... ... O Thoubat from the age of twenty nine years up to this moment I have striven to obtain the supreme and perfect science, and have spent to that end, fifty-one years following the Ways of Ariohs, that lead to Niebban." (Ibid. P. 64 )

ఈ విధంగా నిరంతరకృషితోటి జ్ఞానానికి అంకితమైన తన పునీతమైన దేహాన్ని శాంతిగాను, ఇచ్ఛాపూర్వకంగాను విసర్జించి బుద్ధదేవుడు తన తాతగారి పరిపాలన శకము 148 సంవత్సరమునకు సరియైన పౌర్ణిమ మంగళవారము, సూర్యోదయానికి కొద్దినిమిషాలముందే మహాపరినిర్వాణాన్ని ప్రవేశించి విజయపదాన్ని పొందాడు. ఆరోజు 27-3 1807 B C.

బుద్ధదేవునిజీవితమే ఆధ్యాత్మిక చరిత్రలో ఒక నూతనశకారంభాన్ని వెలయింపజేసింది. బౌద్ధధర్మం పేరిట "అహింసా సత్యమస్తేయః త్యాగశ్శాంతిః" మొదలైన అంశాలతో భగవద్గీతలో వివరింపబడిన సనాతన ధర్మం స్థాపించబడింది. పేరు ఏదైతేనేమి? ధర్మంయొక్క స్వరూపం ఎప్పుడూ ఒకటే ఆది సనాతనము ఆ ధర్మాన్ని స్థాపించటానికి అవతరించి. నందువల్లనే బుద్ధదేవుడు ధర్మసంస్థాపనార్థము భూమికి అవతరించిన తొమ్మిదవ అవతారముగా చరిత్రలో ఆచంద్రార్కమూ నిలిచిపోయాడు.

"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే."

బుద్ధుడుచేసిన ఈ "ధర్మసంస్థాపన"మే బౌద్ధులభాషలో చెప్పాలంటే ధర్మచక్ర ప్రవర్తన" అంటారు. అంటే చక్రంవలే అనాదిగా కాలంలో

తిరుగుతూ మళ్ళిమళ్ళి అవనిమీద అవతరించేదే "ధర్మచక్రము". ఇది మానవులు తాము చేసికొన్న చెడుకర్మ అనే "ధర్మచక్రా"న్ని వెనుకకు త్రిప్పుతుంది.

ఇదే ధర్మచక్ర ప్రవర్తన, లేక ధర్మసంస్థాపన.

**బుద్ధుని జీవిత విశేషాలు :-** ఈనాడు మనకు లభ్యమయ్యే ఆధారాలనుబట్టి చూడగా బుద్ధదేవుని జీవితవిశేషాలలో ఇదమిద్ధమని నిశ్చయంగా తేలే విషయాలు ముఖ్యంగా ఐదు. అవి బుద్ధజననం, ఆయన సంసారపరిత్యాగం. లేక "మహాభినిష్క్రమణము". బుద్ధదేవుని తపశ్చర్య లేక ఆధ్యాత్మికసాధన: తదుపరి బోధివృక్షంక్రింద పరిపూర్ణజ్ఞానోదయం, మతబోధ, దేశాటనము, చివరికి 80-వ సంవత్సరములో ఆయన నిర్యాణము. యీ కొద్దివిషయాలే మనకు ఈనాడు తెలుస్తున్న నిర్వివాదవిషయాలు. బుద్ధదేవుడు జీవించిన ఆయుష్షు మొత్తంలేక జీవితకాలం 80 సంవత్సరాలు.

బుద్ధుని సమకాలికుడు 31-వ మగధరాజైన "క్షేమజిత్తు"* ("శిశునాగ వంశస్థుడు") పురాణాలనుబట్టి ఈయనకాలం 1892-1852 B. C. ఇక పోతే ఇక్ష్వాకువంశంలో—"ఆ వంశవృక్షములోని 22-వ రాజు" శుద్ధోధన మహారాజు ఈయన తర్వాత 23-వ వాడుగా సర్వార్థసిద్ధుడు లేక "సిద్ధార్థుడు" అనే పేరున గౌతమబుద్ధుడు జన్మించాడు. పై వివరాలు ఈ విధంగా చూపవచ్చు :—

---

Foot Note :- * ఇక్ష్వాకు వంశము. మగధరాజు (శిశునాగ) వంశావళి "Chronology of Kashmir History" అన్న గ్రంథం (1955) పండిత శ్రీ కోట వెంకటచలంగారు రచించినది. (చూ. పుటలు 34, 131, 135, 128, 140. 169)

బుద్దజననం — 1887 B. C.
సన్యాసము — 1858 B. C.
తపస్సు — 1858 - 1852 B. C.
మతబోధ — 1852 - 1807 B. C.
నిర్యాణము — 1807 B. C.

ఆయుష్షు లేక జీవితకాలం, వెరసి 80 సంవత్సరములు

* బుద్ధుని సమకాలికుడు క్షేమజిత్తు. ఈయన — 31-వ మగధరాజు శిశునాగ వంశస్థుడు.

ఫాహియాన్ (Fa - Hien) :— ఫాహియాన్ అనే చైనా యాత్రికుడు బౌద్ధమత ధర్మాన్ని ఆ మత మూలగ్రంథాలనూ పరిశోధించడం కోసం భారతదేశానికి వచ్చేడు. ఆయన బుద్ధుని జీవితవిశేషాలు, ఆ నాటికింకా మనదేశంలో విదేశీయుల హస్తగతమై నశించిపోని గ్రంథాలు, ఆధారాలూ, ఎన్నో ఆయన సేకరించాడు.

అఫ్ఘనిస్థాన్ "దర్డ్" లేక "దరదా" అనేదానికి ఫాహియాన్ తాను సేకరించిన వివరాలను ఈ విధంగా తెలియజేశాడు.

"నా పరిశోధనలనుబట్టి తేలినవిషయం—బౌద్ధశ్రమకులు బుద్ధదేవుని బోధనలను ప్రాశ్చాత్యదేశాలకు మొదటిసారిగా తీసుకువెళ్ళిన కాలంలో సింధునది దగ్గర "మైత్రేయ బోధిసత్త్వుని" విగ్రహం ఒకటి స్థాపించః బడింది. ఈ విగ్రహం బుద్ధదేవుని నిర్యాణం తర్వాత 300-సంవత్సరాల అనంతరం, అనగా "చౌ" (Chow) రాజవంశస్థుడైన "పింగ్" (Ping) చైనారాజు పరిపాలన కాలంలో స్థాపించబడింది. (770 - 719 B. C.)"

పైవిషయాలనుబట్టి చూడగా క్రీ॥పూ॥ 770సంవత్సరాల నాటికే బుద్ధదేవునివిగ్రహం స్థాపించివుందంటే విదేశీచారిత్రకారులుచెప్పేబుద్ధునికాలము

(400—500 B. C.) అసంబద్ధమని నిశ్చయంగా ఋజువవుతున్నది. అంతేకాదు "ఫాహియాన్" పై వాక్యాలనుబట్టిచూడగా బుద్ధదేవుడు (770 + 300 = 1070 B. C. కాలమునకు పైవాడు, అన్నది నిశ్చయంగా ఋజువౌతున్నది.

పై ఆధారములనుబట్టి గౌతమబుద్ధుని జాతకం గుణించబడి ఈ క్రింద చూపబడినది.

| | | | |
|---|---|---|---|
| బు 10°-30'<br>శు 28°-24' | ర 4°-54'<br>కు 23°-24' | శ 16°-48' | రా 15°-38' |
| | బుద్ధ జాతకం<br>10-3-1887 B. C.<br>మంగళవారం మ। గం. 12-00<br>వైశాఖశు. పౌర్ణ॥విశాఖనక్షత్రం | | ల |
| | | | |
| కే 15°-38' | | | గు 8°-12'<br>చ 28°-6' |

ఆయన, వైశాఖశుద్ధ పౌర్ణమి, మంగళవారం మద్యాహ్నం 12గంటలకు—అనగా, కర్కాటక లగ్నంలో జన్మించినట్లు బౌద్ధపురాణం యితర రచనలందిల్లి సుస్పష్టంగా తెలిపే గ్రహకుండలి, ఇంగ్లీషుతేదీ ప్రకారం 10-3-1887 B. C. నాటికి సరిగ్గా సరిపోతున్నది. (ఇది ప్రఖ్యాత జ్యోతిష పత్రిక సంపాదకులు 'B V. రామన్ సరిచూసిన గ్రహస్థితిలో సరిపోతుంది.)

జాతకవిషయ పరిశీలనలో కుతూహలమున్నవారికోసం ఆయన జాతకం, ఇతర వివరాలు కూడా దిగువ చూపబడినాయి :—

## జీవితవిశేషాలు :-

a) 16-వ సంవత్సరం 'యశోధర'తో వివాహం,

b) 'రాహులుడు' అనే కుమారుని జననము-29-వ సంవత్సరము

c) కుమారుడు జన్మించిన రోజునే గౌతమబుద్ధుని సన్యాసాశ్రమ స్వీకారమూ అరణ్యవాసం.

d) ఆరు సంవత్సరాలకాలము ఘోరతపస్సు.

e) 35-వ సంవత్సరంలో 'గయ' వద్ద, బోధివృక్షంక్రింద సమ్యక్యం బుద్ధస్థితి అనబడు పరిపూర్ణజ్ఞానము పొందిన సమయము కూడా వైశాఖశుద్ధ పౌర్ణమి. (ఆయన జన్మదినం.)

f) బుద్ధనిర్యాణము — బుద్ధుని 80-వ సంవత్సరములో. ఇదే 'మహాపరినిర్యాణం.'

## జాతకవిశేషాలు :-

(i) శ్రీరాముడు మొదలైన అనేకులు మహాపురుషులు జన్మించిన కర్కాటకలగ్నంలో జననము.

(ii) లగ్నాధిపతియైన చంద్రుడు పూర్ణబలంతో పౌర్ణమి సమయంలో బలవంతుడై వుండడం గమనించదగ్గ విషయం.

(iii) రాజ్యస్థానంలో సూర్యుడు పరమోచ్చ స్థితినిపొంది మేషరాశిలో ఉండడంవల్ల—ఆయన, "మహాసామ్రాట్టు"గానో ఆచంద్రార్కం కీర్తి నిగడించే మహత్తరయోగపురుషుడుగా గానీ, అవుతాడని ఆయన జన్మించినప్పుడు "అసితుడు" అనే ఋషిచెప్పిన వాక్యాలను ఋజువు చేస్తున్నదీస్థితి.

(iv) లగ్నాధిపతి చంద్రుడు తపస్థానాధిపతియైన గురువుతో సంయోగం పొందివుండడం ఒక "రాజయోగము" మహత్తర ఆధ్యాత్మిక యోగమూ తెలిపే గ్రహస్థితి.

(V) తపస్థానాధిపతియైన గురువు తపస్థానమైన స్వస్థానమైన మీనరాశిని వీక్షించడంవల్ల తపస్సిద్ధిని, బ్రహ్మజ్ఞానాన్ని సూచిస్తుంది.

(Vi) రాజ్యస్థానాధిపతి బుధుడు తపస్థానములో ఉండడం — తపస్సు కోసమై రాజ్యాన్ని త్యాగంచేయడాన్ని సూచిస్తుంది.

(Vii) శని లాభస్థానంలో ఉండటం తన స్వలాభాన్ని వదులుకొని సన్యాసి యైపోయే యోగమును సూచిస్తున్నది.

(Viii) ఈ శని భార్యస్థానమునకు, మృత్యుస్థానమునకు కూడా అధికారి అవడం గమనార్హం. గౌతమబుద్ధుడు మానవుడి జరామరణములు చూచి ఆ సమస్యను పరిశోధించే నిమిత్తమే సన్యసించిన విషయము చరిత్ర స్వర్ణాక్షరాలతో లిఖించిన సత్యము.

(iX) విక్రమస్థానాధిపతి బుధుడు బలహీనుడై నీచనుపొంది ('మీనం') తపస్థానంలో ఉన్నాడు. ఫలితం—విక్రమము, యుద్ధము. రక్తపాతాన్ని, పరిత్యజించి అహింసాధర్మాన్ని బౌద్ధరాజులకు గూడ నేర్పిన మనస్తత్వాని ఈయన జాతకంలో చూడవచ్చును.

(X) ఈ విక్రమహీనత్వం(విక్రమస్థానాధిపతినీచ) పిరికితనం వల్ల కాదని ఆధ్యాత్మిక కారణాలవల్లనని తెలిపేది బుద్ధుని తపస్థానములోని, నవమస్థితి యింకనూ అనేక రాజయోగములు, దశావివరాలు, విఘ్నాలు గుణించు కొనగలను. గ్రంథవిస్తరణ భీతిచే వివరించడంలేదు.

**బుద్ధ నిర్యాణము**:— కల్హణుడు తనురాసిన "రాజతరంగిణి" అనే గ్రంథములో బుద్ధదేవుడు పరనిర్యాణం చెందిన కాలాన్ని ఈ విధంగా వర్ణించాడు :-

"తదా భగవతః శాక్య సింహస్య పరనిర్వృతే',
అస్మిన్ మహీలోకధాతౌ సార్ధం వర్షశతం హ్యగాత్."

(రాజ. 1-172)

అనగా కనిష్కుడు పరిపాలించిన కాలంనుంచీ 150 సంవత్సరము లకు పూర్వము బుద్ధదేవుని నిర్యాణకాలం వస్తుంది. కాని ప్రస్తుత చరిత్ర కారులు బుద్ధదేవుని నిర్యాణము 483 B. C. లో జరిగినట్లుగా నిర్ధారణ చేశారు.

కనిష్కునికాలము పాశ్చాత్య చరిత్రకారుల ప్రకారము 78 AD. కాబట్టి పై శ్లోకాన్ని బట్టిచూడగా బుద్ధదేవుని నిర్యాణకాలము 78 AD. నుంచి (150 B C. తీసివేయగా) 228 B. C. అని తేలుతుంది. ఇది పాశ్చాత్యులు చేసిన కనిష్క కాలనిర్ణయంతో కూడా సరిపోదు. కాబట్టి పాశ్చాత్య చరిత్రకారులు చేసిన యీ కాలనిర్ణయం, వారేచేసిన కనిష్కుని కాలంతోనూ, బుద్ధదేవుని కాలంతోనూ సరిపడలేదు.

కాబట్టి వారునిశ్చయించిన బుద్ధదేవుని నిర్యాణకాలంగానే. కనిష్కుడి కాలముగానీ తప్పు. (రెండుకాలములు తెల్లదొరల ఊహలమీదనే ఆధార పడ్డవి గనుక.) ఈ విషయము గురించి రాప్సన్ (Rapson) పండితుడు ఈవిధంగా *వ్రాస్తున్నాడు.

"చరిత్రకారులు ఇప్పటివరకూ వ్రాసిన వ్రాతలు చూచినతరువాత కూడా, బుద్ధుని జననకాలము ఆయన నిర్యాణసమయము ఇంకా అనిశ్చ యంగావున్నాయి. ఆయనకాలము 483 B.C అని నిర్ణయించిన తేదీకూడ కేవలము ఊహలమీద ఆధారపడినదే" ఈవిషయం స్పష్టంగా తాను వ్రాసిన కేంబ్రిడ్జి 'హిందూదేశ చరిత్ర'లో 'రాప్సన్'కూడా అంగీకరించక

Foot Note :-* Unfortunately, even after all that has been written on the subject of early Buddhist Chronology. We are still uncertain as to the exact date of Buddha's birth. The date 483 B. C. Which is adopted in this history must still be regarded as provisional."

— History of India by E. J. Rapson (Vol. I. P. 171)

తప్పలేదు. ఈ బుద్ధుని కాలం అనిశ్చయంగా వుండటానికి కారణము పై వివరించిన రాజతరంగిణిలోని శ్లోకప్రమాణమే తెలుపుతోంది. వి. ఏ. స్మిత్ అనే పాశ్చాత్య చరిత్రకారుడుకూడా బుద్ధునికాలం (తాము నిర్ణయించిన) మీద తమకే నమ్మకంలేనట్లు వ్యక్తంచేస్తూ వ్రాసిన యీ వాక్యాలే మనకు ప్రమాణం.

"The date of Buddha's death is uncertain, but there is good reason for believing that the event happend in *or about* 487 B. C., possibly four or five years later."*

"బుద్ధదేవుని నిర్యాణకాలము ఇదమిద్ధమని నిశ్చయంగా చెప్పుట వీలుకాదు. అయినప్పటికీ, ఈ సంఘటన క్రీస్తుపూర్వము 487 న గాని లేక తదుపరి నాలుగు లేక అయిదు సంవత్సరముల తరువాత కాని జరిగి వుండవచ్చు." — వి. ఎ. స్మిత్.

## పాశ్చాత్యుల వాదము అసంబద్ధము :-

పైన చెప్పిన "రాజతరంగిణి" సాక్ష్యమువల్ల విదేశీచరిత్రకారులు నిర్ణయించిన బుద్ధనిర్యాణకాలము (483 B. C.) అసంబద్ధమని ఎటువంటి మూర్ఖులకైన తెలిపే సాక్ష్యాలు, ఈనాటికి మనకు లభిస్తున్నవి. అవి ఏవనగా :—

1) A. V. త్యాగరాయ్యర వ్రాసిన 'భారతీయవాస్తు' (Indian Architecture) అనే గ్రంథంలో గ్రీకుదేశపు పట్టణము ఏథెన్సు నగరంలో క్రీ. పూ. 1000 సంవత్సరముల (1000 B. C) నాడు ఒక బౌద్ధభిక్షువు

* The Oxford Student History of India"
— by V. A. Smith. (1915 p. 44.)

యొక్క సమాధి త్రవ్వకాలలో దొరకినట్టుగా మనకు ఎ. సోమయాజులు గారి ప్రాచీన భారతదేశ చరిత్రవల్ల తెలుస్తున్నది.

అందులోని వాక్యాలు :—

"Here lies Indian Sramanacharya from Buddha Gaya a Sakya monk taken to Greece by his Greek pupils and the tomb marks his death at about 1000 B. C."

If Buddhist monks have gone to Greece in 1000 B. C. the date of Kanishka must be at least 1100 B. C. and that of Asoka 1250 B. C. and that of Chandragupta Maurya 1300 B. C."

బుద్ధదేవుని నిర్యాణము గనుక మన విదేశచరిత్రకారులు చెప్పినట్లు 483 B. C. గనుక నిజముగా అయితున్నట్లయితే అంతకుముందుగనే అంటే 1000 B. C. నాడే బౌద్ధమతముండటము అసంభవము. బౌద్ధమత అనుయాయి అయిన శ్రమణాచార్య యొక్క సమాధి ఏథెన్సునగరంలో ఉండాలంటే (1000 B. C. నాటికే) అంతకు ఎంతోముందే బౌద్ధమతము విదేశాలకు వ్యాపించటానికి కొన్ని శతాబ్దాలైనా పట్టిఉండాలి. బుద్ధనిర్యాణకాలం పాశ్చాత్యులచేత బుద్ధిపూర్వకముగా తగ్గించబడిందనటానికి ఇంతకంటె స్పష్టమైన ఆధారాలు ఏమికావాలి ? ఈ విషయం గురించి.

"బౌద్ధభిక్షువులు 1000 B. C. లోనే గ్రీసుకువెళ్ళి ఉండాలంటే కనిష్కుడు కాలము కనీసము 1100 B. C. అన్నా అయిఉండాలి. దాన్నిబట్టి అశోకుని కాలము 1250 B. C. చంద్రగుప్తమౌర్యుని కాలము 1300 B. C." అని ఎ. సోమయాజులుగారు త్రవ్వకాలఆధారంగా వారి గ్రంథంలో నిర్ధారణచేశారు.

డాక్టరు ఫ్లీట్ తాను చేసిన పరిశోధనల నాధారముగా బుద్ధనిర్యాణము 1631 B C. అని, అశోకుడు 1260 B. C అని నిర్ధారణ చేశారు

We should that findh the Rajatarangini would place Asoka somewhere about 1263 B. C. We should prefer to select the date B. C. 1260. And then we should set about arranging the sucession of the Kings of India itself from the Puranas. With B. C. 1260 for the approximate date of the accession of Asoka as our starting point" (Quoted By M. Krishnamacharya in his history of Classical Sanskrit Literature Intro. P. XCII.)

ఇదే విషయాన్ని శ్రీ యుత M కృష్ణమాచార్యవారి గ్రంథము "ప్రాచీన సంస్కృత సాహిత్య చరిత్ర" లో ఉదహరించారు.

పై విషయాలేగాక సర్ విలియం జోన్సువారు సంపాదించిన ప్రాచీన దబిస్థాన్ పట్టిక (Dabistan Document Vol. IV. P. P. 17 & 42 to 46 Sir William Jones.) ఇదే విషయం చైనా, టిబెట్టుదేశస్థుల పురాతన రచనలబట్టిగూడ ఋజువు అవుతున్నాదని ఆయన అంగీకరించారు.

అక్బరుకు సమకాలికుడైన "అబుల్ ఫజల్" తాను వ్రాసిన అయిన్-ఇ-అక్బరీ (Ain-E-Akbari) అన్న గ్రంథముగూడా బుద్ధుని కాలము 1027 B C. కి సమకాలికమయినట్టుగా నిర్ధారణ చేశాడు.

భారత దేశాన్ని సందర్శించిన 'ఫాహియాన్' అనే ప్రాచీనచరిత్రకారుడు బుద్ధదేవుని నిర్యాణముగూర్చి వ్రాస్తూ అది 1050 B. C. ప్రాంతాల్లో జరిగిందని నిర్ధారణ చేశారు.

పై ఆధారాలనుబట్టి తేలేదేమంటే, బుద్ధదేవుడు క్రీస్తుకుపూర్వము 1000 సంవత్సరాలకి పూర్వముగానే నిర్యాణము చెందినట్లున్నూ ఏ లెక్క ప్రకారము చూసినా ఆయన క్రీస్తుప 1000 ఏండ్ల పూర్వమువాడేగాని తరువాతవాడు అవడానికి సావకాశంలేదని తెలుస్తోంది.

## ఖగోళశాస్త్రము ఆధారముగా బుద్ధుని కాలనిర్ణయం :-

పై విషయాలన్నిటినిబట్టి ఒక్క విషయం మాత్రం స్పష్టంగా తేలిపోయింది. బుద్ధునికాలము నిర్ణయము చేయటానికి కేవలము చరిత్రకారుల మీద, పాశ్చాత్యుల ఊహాతకల్పనలమీద ఆధారపడుట చాలప్రమాద కరమని అందువల్లనే చరిత్ర వ్రాయడానికి ఆధారము—వ్యక్తుల ఊహలు కాకూడదు—ఖగోళశాస్త్రాధారముగా మహాభారత కాలనిర్ణయముచేస్తూ ఈ విషయాన్నే ధృవపరచడం జరిగింది.*

ఖగోళము మనుష్యులు మార్చలేని లెక్కలమీద నక్షత్రాలు, గ్రహాల నడకలమీద ఆధారపడ్డ వైజ్ఞానికసత్యం (Scientific Proof). దీనిమీద ఆధారపడ్డ చరిత్రకారులు కల్పించిన అబద్ధాలపుట్టకంటె ఊహలతోను, కట్టుకధలతోను, ఏర్పడిన కాలనిర్ణయాలకంటె శాస్త్రీయమైనది. కాబట్టి బుద్ధదేవుని కాలంకూడా ఖగోళగణితంమీదనే నిర్ణయం చేయవలసివుంది.

ప్రాచీనకాలంనుంచి గూడ 'బుద్ధపూర్ణిమ' అన్న పేరుతో 'వైశాఖ పూర్ణిమ' పండుగగా జరుపటము మనకందరకు తెలిసిన విషయమే. శ్రీ వి. తిరువెంకటాచార్య అనే జ్యోతిష్కుడు, చరిత్రకారుడు ప్రాచీన జాతక ఆధారాలతో బుద్ధదేవుడు జన్మించిన సమయానికి గ్రహాలు

---

Foot Note :- Mahabaratha war. A red letter day in Indian History by E. Vedavyas, I. A. S., The Astrological Magazine New Series, March '72, Vol. 35. P. 293-296

గుణించారు, దాని ప్రకారము బుద్ధదేవుడు 27-3-1807 B. C. కి సరియైన వైశాఖ శుద్ధపూర్ణిమ మంగళవారము కర్కాటకలగ్నములో మరణించినట్లు తెలుస్తుంది.

పైఅంశాన్ని ధృవపరచే ఆధారాలు ఈక్రిందివిధంగా వున్నాయి.

1) శుద్ధోధన మహారాజు (బుద్ధదేవుని తండ్రి) శ్రావణశుద్ధ పౌర్ణమి శనివారము సూర్యోదయ సమయంలో నిర్యాణము చెందారు. సూర్యోదయాత్పూర్వము శనివారము. సూర్యోదయము తరువాత ఆదివారము అయిన పౌర్ణమి తిధికి 27 ఘడియలకు సరియైన తేదీ25/26—జూన్ 1848 B. C

2) బుద్ధదేవుని నిర్యాణము వైశాఖశుద్ధ పౌర్ణమి మంగళవారము విశాఖ నక్షత్రయుక్త సూర్యోదయాత్పూర్వము 37 ఘడియలు12 విఘడియలు అనగా27/28 మార్చి 1807 B.C.

3) బుద్ధదేవునికి మహాపరినిర్యాణము అయ్యేసమయానికి80 సంవత్సరములతో వుండిఉన్నట్లుగా ఆయన క్రింది వాక్యాలనుబట్టే తెలుస్తున్నది.

"ఆనందా! నేనిప్పుడు చాల ముసలివాడినయ్యాను. నాకిపుడు ఎనభై ఏళ్ళు, నాదేహం శిధిలమై పాతబండిలాగ మేకులు, బందులు, ఊడిపోతూ ఎప్పటికప్పుడు అతుకులుపెట్టితే నడుస్తున్నది." అంటూ చలోక్తిగా తనను గురించి చమత్కరించాడు.

Ananda, replied Buddha. ... I am now very old: my years number eighty. I am like an old cart, the iron wheels and wood of which are kept together by constant repairing." (Ibid Vol. II. p. 9·)

పై ఆధారాలనుబట్టి చూడగా బుద్ధదేవుని జననము27-3-1807 B.C. సంవత్సరమునకు 80 సంవత్సరములు పూర్వము జరిగివుండాలి. జ్యోతిష

శాస్త్రరీత్యా చేసిన గణితాన్నిబట్టిచూస్తే బుద్ధదేవుడు వైశాఖశుద్ధ పౌర్ణమి; విశాఖ నక్షత్రం, శుక్రవారమునకు సరియైన 31మార్చి 1886 B. C లోన జన్మించినట్లుతెలుస్తున్నది. పౌర్ణిమ అంతము 59ఘడియల 24విఘడియలు వరకు, కర్కాటకలగ్నము,)

బుద్ధదేవుడు "మహాభినిష్క్రమణము" అనబడే ఇల్లు విడిచిపోవడం సర్వసంగపరిత్యాగియై సంపూర్ణబుద్ధత్వము ప్రాప్తికై దీక్షనుపొందిన సుదినము ఆషాఢశుద్ధ పూర్ణిమ(వ్యాసపౌర్ణమి) (ఆదివారము పూర్వాషాఢా నక్షత్రము పౌర్ణిమకాలము సోమవారము 16 ఘడియల 48 విఘడియల వరకు ఉత్తరాషాఢ సూర్యోదయాది 59 ఘడియలకు సరిపోవుచున్నది). ఆరోజు 29-5-1859 B. C. కపిలవస్తునగరాన్ని బుద్ధదేవుడు విసర్జించిన దినము,

ఇదే విధముగా బుద్ధదేవుని జీవితచరిత్రనుంచి చూస్తే గౌతముడు బోధివృక్షంక్రింద పరిపూర్ణజ్ఞానముతో సంయ్యక్ సంబుద్ధుడై విశ్వజ్యోతిగా వెలసిన శుభముహూర్తము:—

a) వైశాఖశుద్ధ పూర్ణిమ బుధవారము, విశాఖనక్షత్రము, సూర్యోదయాత్పూర్వము అనగా 3-4-1851 B. C. (విశాఖనక్షత్రము 1ఘడియ8 విఘడియలవరకు, పౌర్ణిమ సూర్యోదయాత్పూర్వము11ఘడియలకంతము).

b) పై విషయములు క్రైస్తవపాదరీయైన బిషప్ బిగాడెట్ Bishop Bigaudet)వ్రాసిన'Life of Goudama' అనే గ్రంథములోను నేపాళ రాజ వంశావళివల్ల, కల్హణుడు రాజతరంగణివల్ల, స్వామికన్నుపిళ్లైసూర్య సిద్ధాంతమురీత్యా తయారుచేసిన ఖగోళపంచాంగము Indian Ephe— meris by Swamykannu Pillai)వల్లని తిరువెంకటాచార్య వ్రాసిన జ్యోతిషశాస్త్రాధారమైన రచనమూలకంగానూ, మరింత బలపడుతున్నాయి.

c) డా॥ డి.యస్. త్రివేదిగారు వ్రాసిన వ్యాసము ఆధారముగా బుద్ధనిర్వాణము 1793 B. C. ప్రాంతమని నిర్ణయించారు.*

d) ఖగోళశాస్త్రాధారముగా పైనున్న అంశాలను ధ్రువపరుస్తున్న ఈ క్రింది వాక్యాలు పై లెక్కలను సత్యమని ఋజువుచేస్తున్నవి.

"There lived a celebrated hermit or Rathee named Deveela, well versed on the science of calculation. After several consultations held on this important subject in the presence of the King, it was agreed that the Kawdza Era of 8640 years should be done away with on a Saturday, the first of the moon of Tabsaong (Phalguna), and that the new era should be made to begin on a Sunday, on the 1st day of the waxing moon of the month Tagoo (Chaitra). This was called the Eetzana era" (Vide Bishop Bigandet's Life or Legend of Buddha."

(III Ed Vel. I. P. 13)

"Phralaong (Budha) was form on the 68 th year of the Eetzana Era. (1887 B C.) on the 6th after the full moon of the month Katsong Maia was therefore fifty six years old." (Ibid Vol. I. P. 47. foot-note)

e) పై విషయాన్నే పండిత శ్రీ కోట వెంకటచలంగారు తమ 'యుగ పురాణము' అన్న గ్రంథములో నిర్ధారణచేస్తూ వ్రాసిన ఈ క్రింది వాక్యంతో పై కాలనిర్ణయం సరియైనదని తెలుస్తుంది :—

---

Foot Note :— * (భారతీయ విద్య) Bharatiya Vidya Bombay Vol. VIII. Pages. 220–238.

*Conclusion* :- It has been proved on astronomical grounds that 27-3-1807 B.C., is the true and correct date of death of Buddha. It falls in the eighth year of the reign of King Ajatasatru. This date explains the possi" bility of the existence of Buddhism in the second millinnium B.C. as mentioned in Kalhana's Rajatharangini and Nepal Vamsavali.

All the dates given in Bishop Bigandet's "LIFE OF GAUDAMA" in the Kauz a and Eetzana Eras have been verified with the dates in Christian Era. The dates tally accurately with 27–3–1807 B.C. as the date of Nirvana of Lord Buddha."

"బుద్ధుడు నిర్యాణము చెందినరోజు సరిగా క్రీ.పూ. 27-3-1807 అని ఖగోళశాస్త్రము మూలకముగా నిర్ధారణ చేయబడినది. ఆదినము రాజు 'అజాతశత్రు' పరిపాలన చేయుచున్న ఎనిమిదవ రాజ్యవర్షమునకు చెందియున్నది. కల్హనుడి రాజతరంగిణి మరియు నేపాళ రాజవంశావళియందు పేర్కొనబడిన విధముగా బౌద్ధమతము క్రీస్తుపూర్వము రెండువేల సంవత్సరములనాడు వ్యాప్తిచెందియుండెనని తలంచుటకు దోహదము కలుగజేయుచున్నది."

బిషప్ బిగాన్‌డెట్ వ్రాసిన గౌతముని జీవితము Life of Gaudama) నందు కౌడ్జా మరియు ఏట్జానా శకము (Kauzda and Eetzana Eras) నకు సరియగునట్లు ఇవ్వబడిన దినములన్నియు క్రీస్తు శకముతో గమనించి చూచిన అవి బుద్ధదేవుడు నిర్యాణముచెందిన దినము క్రీ. పూ, 27-3-1807 నకు సరిపోయినది.

## బుద్ధదేవుని జీవితంలో విశేషాలు తెలిపే చారిత్రక ఆధారాలు :-

(1) పురాణాలలోను, బౌద్ధమతగ్రంథాలైన దీపవంశ, మహావంశ, లంకావతార, మొదలైన పురాతన గ్రంధాలలోను బుద్ధదేవుని జీవితమును గూర్చిన వివరాలు వర్ణించబడినవి. పాశ్చాత్య చరిత్రకారులలో బుద్ధదేవుని గురించి విశేషంగా పరిశోధనచేసినవాడు క్రైస్తవ మిషనరీ, బిషప్ బిగాన్‌డెట్ (Bishop Bigandet) ఆయన బుద్ధుని జీవితంలోని ఘట్టములు ఎన్నింటినో ప్రాచీన చారిత్రకగ్రంధాలనుంచి సేకరించారు. ఆయన రచించిన 'Life of Gaudama' అను గ్రంథంనుంచి కొన్ని వివరాలు మచ్చుకు పరిశీలిద్దాము.

బుద్ధుడు జన్మించినవేళ 'దేవలుడు' అనే మహర్షి ఆయనను దర్శించటానికి వచ్చారని ప్రతీతి. ఈయన బుద్ధదేవుని జాతకముచూసి ఆ బుద్ధదేవుడు (అప్పటికి) రాగలకాలములో జగద్గురువై లేదా మహా చక్రవర్తియై విలసిల్లు తారని పురాణగ్రంధాలనుంచి తెలుస్తున్నది.

ఉదా :— ఆదిపురాణం, లలితవిస్తరణము, మహాపురాణము ఇత్యాది.

"There lived a celebrated hermit or Rathee named Deveela well versed in the science of calculation. After several consultations held on this important subject in the presence of the King, it was agreed that the Kauzda Era of 8640 years should be done away with on a Saturday, the first of the moon of Tabsaong (Phalguna) and that the new era should be made to begin on a

Sunday, on the 1 st day of the waxing moon of the month Tagoo (Chaitra). This was called the Eetzana Era." (Vide 'Bishop Bigandets'"Life or Legend of Buddha." III Ed. Vol. I. P. 13)

"Phralaong (Buddha) was born on the 68th year of the Eetzana era, (1187 B. C.) on the 6th after the full-moon of the month Katsong Maia was therefore fifty six years old."

(Ibid. Vol. I. P. 47, foot - Note.)

(2) బుద్ధదేవుని జీవితంలో జరిగిన సంఘటనలన్నీ గూడ ఆయన తాతగారి పరిపాలన సంవత్సరాలలో లెక్కించబడినవి. ఈ శకకాలము 86వ సంవత్సరములో (1869 B. C.) తనకి దగ్గరబంధువైన యశోధరను వివాహంచేసుకొని అదే సంవత్సరంలో మూర్ధాభిషిక్తు డైనట్లు తెలుస్తున్నది.

It was then that Phralaong (Siddhartha or Buddha) was married to the beautiful Yathawdara (Yasodhara) his first cousin, and the daughter of Thereppa-Buddha and of Amitau. It was in the eighty-sixth year (1869 B. C.) of his grand father's era that he was married, and also consecrated Prince Royal by the pouring of the blessed water over his head."

(Ibid. P. 52 )

(3) క్రీ. పూ. 1858 B. C. కి సరియైన 97-వ సంవత్సరకాలంలో (పైన చెప్పబడిన శకం) బుద్ధదేవుడు కపిలవస్తునగరాన్ని విడిచివెళ్ళడం తటస్థించింది. అది జూలై నెలలో ఉత్తరాషాఢ నక్షత్రముతో కలసిన పౌర్ణమిరోజు అనికూడ తెలుస్తున్నది.

"It was in the year 97 (1858 B.C.) when he (Buddha) left Kapilawot.' (Ibid. P. 62)

Buddha left the city of Kapilawot at the full moon of July under the constellation Ootharathan."

(Ibid. P. 63)

4) ఇల్లు విడిచిపోయిన తర్వాత సిద్ధార్థుడు సంపూర్ణజ్ఞానాన్ని అన్వేషిస్తూ అనేక తీవ్రతపశ్చర్యలు, కఠోరనియమాలు ఆచరించాడు. ఈవిధంగా బుద్ధదేవుడు ఆరుసంవత్సరాలపాటు తీవ్రమైన ఉపవాసాలతో శరీరాన్ని కృశింపజేశాడు. భోజనము మానివేయడము వలన బ్రహ్మజ్ఞానము రాదని ఆయన గ్రహించి ఆయన ఉపవాసములు మానివేసినరోజు పౌర్ణమిరోజు అనికూడ తెలుస్తున్నది.

5) ఈవిధముగా ఉపవాసములు మానివేసిన తర్వాత ధ్యానసమాధి నిమగ్నుడైన గౌతమునికి పరిపూర్ణజ్ఞానము గయవద్ద రావిచెట్టుక్రింద(బోధి వృక్షము. అశ్వత్థవృక్షము, చూ॥ భగవద్గీత 15-వ అధ్యాయము) కలిగి ఆనాటినుండి గౌతముడు బుద్ధుడు అయినాడు. ఆయన పూర్వం (ఆర్యుల) మార్గాన్ని అనుసరించినందువల్ల తథాగతుడనికూడ పిలువబడినాడు. అది బుద్ధుని తాతగారి పరిపాలన కాలము 103-వ సంవత్సరమునకు సరియైన 'ఎట్జానా' (Eetzana) శకము. పౌర్ణమి సూర్యోదయానికి పూర్వంబ్రహ్మ ముహూర్తంలో పరిపూర్ణ జ్ఞానోదయమైనట్లు మనకు తెలుస్తున్నది.

"When Phralaong had ended the six years of his fasting and mortification, on the day of the full-moon of the month Katson." (Ibid. P. 79.)

"A little before break of day, in the 103rd, year of Eetzana Era on the day of full of the Katson, the perfect Science broke at once over him, he became the Buddha."

(Ibid. P. 97)

(6) బుద్ధుడికి పరిపూర్ణజ్ఞానము కలిగినతరువాత అనేక అద్భుత దివ్యదర్శనాలూ, సిద్ధులు, అధ్యాత్మికశక్తులూ కలిగినవి. ఇందులో ఆశ్చర్యమేమియులేదు. యోగశాస్త్రం ప్రకారము యోగికి పరిపూర్ణజ్ఞానము కలిగినపుడు (బ్రహ్మసాక్షాత్కారము) అనేక సిద్ధులు, కరతలామలకమై ఉంటాయని భాగవతంలో శ్రీకృష్ణదేవుడు ఉపయోగించిన యోగశాస్త్రంలోనున్నది. పతంజలి యోగసూత్రాలూ, హఠయోగప్రదీపిక మొదలైన గ్రంథాలుకూడ ఇదే విషయాన్ని వ్యక్తంచేస్తున్నాయి. అలాటి శక్తులలో కాలజ్ఞానము ఒకటి. అంటే భవిష్యత్తులో జరగబోయే చరిత్రసంఘటనలు అన్నీ సినిమాలాగ మనదృష్టికి గోచరిస్తాయి. ఇటువంటి శక్తి వల్లనే పూర్వ ఋషులు జ్యోతిష్య శాస్త్రాన్ని, నాడీగ్రంథాలను రచించడమే గాకుండ వ్యాసమహర్షి ఈ విధంగా రచించిన భవిష్యత్పురాణము ఈనాటికి మనకు లభ్యమవుతున్నది. ఈనాటికీ ఎవరూ కాదనలేని సత్యము.

ఇటువంటి సిద్ధి గౌతమబుద్ధునికికూడ కలిగి భవిష్యత్తులో అశోక చక్రవర్తి కొడుకైన మహింద (మహేంద్ర) భవిష్యత్తులో 236 సంవత్సరాల తర్వాత జన్మించిన తనయొక్క అంటే గౌతమబుద్ధునియొక్క బౌద్ధ ధర్మాన్ని సింహళ ద్వీపానికి వ్యాప్తిచేస్తాడనికూడ చరిత్రవల్ల తెలుస్తుంది

"He (Buddha) saw that Mahinda, the son of King of Asoka, would carry his law to Ceylon, two hundred and thirty-six years after his Neibbon. (Niryana)"

(Ibid. P. 99)

దీనినిబట్టి బుద్ధనిర్యాణమైన 236 సంవత్సరాలైన తర్వాత జరిగిన భావికాలగతులన్నియు కూడా బుద్ధునికి కలిగిన దివ్యదృష్టివలన ఆయన కాలజ్ఞానము సిద్ధించినదని చారిత్రక ఆధారాలుకూడా నిరూపిస్తున్నవి.

7) శుద్ధోధనుని నిర్యాణకాలము బుద్ధుని కుమారుడైన రాహులుడు బౌద్ధమతాన్ని గ్రహించినట్లుకూడ ఆ చారిత్రక ఆధారాలు నిరూపిస్తున్నవి.

"About conversion of Rahula (Buddha's son) who was aged eight years. at the time of the said conversion into a Bikku. Suddodhana breathed his last in the day of full-moon of Wakhaon, on Saturday at the rising of the sun, in the year of Eetzana Era 107. (1848 B. C.) at the advanced age of ninety-seven years. (Ibid. P. 208)

గౌతమబుద్ధుని గురించి యింతవరకూ తెలుసుకున్న దాన్నిబట్టి పాశ్చాత్య చరిత్రకారులు బౌద్ధయుగ చరిత్రనే ఎంత తారుమారు చేశారో, ఎన్ని అపార్థాలు కల్పించారో గ్రహించవచ్చు. అందులోనూ ఆయువు పట్టు లాంటివి, వాళ్ళు గల్లంతు చేసిన ఈ క్రింది అంశాలు-

* బుద్ధుడు హిందూ మతాన్ని పునరుజ్జీవితంచేసిన అవతారమూర్తి. హిందూమతంలోని పురాణాలలో శ్రీకృష్ణుని తర్వాతిదైన–తొమ్మి దవది 'బుద్ధావతారం.'

* శ్రీకృష్ణుడు భగవద్గీతలో ఉపదేశించిన సత్యం దయా, తపస్సు, అహింసవంటి-"ధర్మం"యొక్క నాలుగు పాదాలే బుద్ధుని "ధర్మ చక్ర ప్రవర్తన" కూడాను, ఈ రెండూ 'ధర్మసంస్థాపన' కోసం వచ్చిన అవతారాలే! గీతలో "సంభవామి యుగేయుగే" అని చెప్పినట్టు.

* ఆయన వేరే"మతం" స్థాపించాడన్నది. రాజకీయప్రయోజనాల కోసం బ్రిటిషువాళ్ళు ప్రచారంచేసిన అసత్యం. బ్రాహ్మణ–బ్రాహ్మణేతరుల ఉద్యమం. ఇండియా పాక్ల వంటి విషబీజాలే ఇవీను! దేశాన్ని ప్రజల్ని విడగొట్టి బలహీనం చేయడానికై రాసిన చెత్త! బుద్ధుని బోధనలలో యిదేమీ లేదు.

* బుద్ధుని అసలు జీవితం—ఆయనచూపిన మహిమలూ, ఆయన పూర్వజన్మల గాథలూ అన్నీ చరిత్రలో అణచిపెట్టారు. హిందూ దేవుళ్ళ గురించి బుద్ధుని బోధలలో వున్నసంగతే పైకి రాకుండా "బౌద్ధమతం" అంటూ అదేదో వేరే మతంలాగ ప్రచారంచేశారు.

* టిబెట్టులోనూ, జపాన్, నేపాల్ చైనాలలోని బౌద్ధసిద్ధాంతాలూ, మన యోగులూ బ్రహ్మజ్ఞానులూ ఉపదేశించిన యోగవిద్యా— ఒకటేనని నిరూపించే గ్రంథాల సమీక్షతోనే, అసలయిన బుద్ధ చరిత్ర—'జాతీయచరిత్ర'లో ఒక భాగంగా వ్రాయబడాలి—బుద్ధుని నిజమైన కాల నిర్ణయాలతో !

అంతవరకూ, యీనాడు మన పిల్లలకు చెప్పే హిష్టరీనుంచి, ఆ పుస్తకాలలోంచి, యీ అసత్యాలను వెంటనే తొలగించాలి. దానికోసం విద్యార్థులలో ఉద్యమం రావాలి. "జాతీయవిద్య"కోసం, విమోచనకై విద్యార్థులూ మేధావులూ పోరాడి సాధించుకోవాలి—బ్రిటిషువాడిచ్చిన మానసిక దాస్యంనుంచి విముక్తి !



# అలెగ్జాండరు దండయాత్ర
# - గ్రీకు చరిత్రకారులు

మన దేశచరిత్రంతా విదేశీయుల రాతలమీద ఆధారపడినదేనని మన యీనాటి "హిస్టరీ" లేక 'చరిత్ర' చదివినవాళ్ళందరికీ తెలిసినదే. యీ విదేశీయుల రాతలు వేదంలాగ నమ్మటం మన పురాణాలలో రోజులవారీగా కాలగణితంతో యిచ్చినదంతా బూటకమని రాయటమూ—ఇదే యీనాటి మన 'భారతదేశ చరిత్ర!' ఈ విదేశీయుల రాతలలో మొట్టమొదటివి గ్రీకుల రాతలు. వీళ్ళు అలెగ్జాండరు దండయాత్రలప్పుడు అతనితో హిందూదేశాని కొచ్చారు. వచ్చి వాళ్ళ కర్థమయిందీ కానిదీ, విన్నదీ కన్నదీ, వాళ్ళఇష్టం వచ్చినట్లు మార్చి, పేర్లన్నీ తప్పుడు ఉచ్చారణలతో సర్వనాశనంచేసి (అవి అసలుపేరు ఏదోకూడ అర్థంకాకుండా విరిచి) వ్రాశారు. ఇదే గ్రీకుల చరిత్ర'—ఇంగ్లీషు చారిత్రకులకు 'వేదం!'

ఇంత గొప్పగా భావించబడే, యీనాటి భారతీయ చరిత్రకారులకు గురువులైన యీ విదేశీచరిత్రకారుల రచనలుకూడా, స్వయంగా చదవరు మనసోదరులు. వాటిలోని తప్పులగురించి ప్రస్తావించకుండా పొగుడుతూ వ్రాసిన ఇంగ్లీషు చారిత్రకారుల రచనలను దాటిపోలేదు వీరిదృష్టి, అందుకే ఆ నాటి గ్రీకు చరిత్రకారుల స్వంతరచనలనుంచి యధాతథంగా మచ్చుతునకలు తీసి మీ ముందుంచుతాను. దానితో వాళ్ళ రచనలు ఎంతనమ్మతగ్గవో వాటి చారిత్రక విలువ ఎటువంటిదో, అది మీకే తెలిసిపోతుంది! ఇక నేను వేరే చెప్పనక్కర్లేదు!

**గ్రీకు చరిత్రకారులు :-** ఈనాడు గ్రీకుచరిత్రకారులని పేర్కొంటున్న వారి రచనలు చాలవరకూ అలెగ్జాండరు దండయాత్రకు సంబంధించినవి.

కొన్నికొన్ని 'సెల్యూకసు' ఇండియాలో చంద్రగుప్త చక్రవర్తి చేతిలో చావుదెబ్బలుతిని ఈ దేశాన్నించి వెంటాఎత్తివేసిన కాలంనాటి గ్రీకురచయితలని (మెగస్తనీసులాగ!) వారి రచనలు చాలావరకూ అభూతకల్పనలు. అసలు 'చరిత్ర' భాగం అందులో కనపడదన్న నిజాన్ని యిప్పుడే ప్రత్యక్షంగా చూద్దాం. ఈ గ్రీకు చరిత్రకారుల రచనలలో * ఎక్కువగా "అర్రియన్" (Arrian) మెగస్తనీసు (Megasthanes) దయోదోరసు (Diodorus) జస్టినియసు (Justinius) కర్టియసు (Curtius) అప్పియానసు (Appianus) స్ట్రాబో (Strabo) ప్లినీ (Pliny) రెండవప్లినియసు Plinius II) ఎలియానసు (Elianus) మొదలగువారి రచనలున్నా, అక్కడక్కడ "ప్లూటార్క్" (Plutarch) వ్రాతలే-ముఖ్యంగా యీనాడు మనకి లభ్యం అవుతున్న ఆధారాలు.

వీటి ఆధారంతో మనదేశం, ప్రజలు, పల్లెలు పర్వతాలు రాష్ట్రాల పేర్లు జంతువులు వృక్షాలు ఇత్యాది విషయాలన్నీ, యీ గ్రీకులు ఎంత చక్కగా అపార్థం చేసుకున్నారో మనం యిక్కడ కొంచెం పరిశీలిద్దాము.

**ఎందుకు విదేశ చరిత్రకారుల "చరిత్ర" ? :-**

భారతీయులకు చరిత్రలేదని తెల్లదొరల అభిప్రాయం. కాబట్టి ఈ విషయంలో ప్రొఫెసరు మాక్టోనెలు వ్రాసిన వాక్యాలు భారతీయుడైన ప్రతివాడికి తలవంపుచేసేవి! ఈ క్రిందివిధంగా వున్నాయి ఆయనమాటలు

---

Foot Note :- * గ్రీకు చరిత్రకారుల రచనలు యథాతథంగా ఇంగ్లీషులో ప్రచురించబడినాయి అవి :—

(1) ప్రొ॥ ష్వాన్‌బేక్ గ్రంథం (1846) నుంచి ఉదహరించబడినాయి.

చూ, 'Megasthanes Indica'—By Dr. E. A. Schwanbeck

(2) మిగతావన్నీ "Ancient India as described by Megasthenes and Arrian" By J. W. Mc Crindle. (1926)

"History is the one weak spot in Indian Lateratüre. It is in fact, *non-existent*. The *total lack* of the *historical sense* is so charectoristic, that the whole course of Sanskrit Literature is darkened by the shadow of this defect suffering, as it does, from an *entire absence of exact chronology*. In the first place Early India *wrote no history* because *it never made any*. The ancient Indians never went through a struggle for life, like Greeks in the Persian and the Romans in the Punic Wars"*—

పై వాక్యాలకు అర్థం ఏమిటంటే స్థూలంగా—భారతీయుల రచనలో కల్లా "చరిత్ర" చాలా బలహీనమైనఅంశం. అసలు నిజంగాచెప్పాలంటే—చరిత్రఅన్నదే లేదు వీరికి. అసలు సంస్కృతంలో రాయబడ్డ సాహిత్యం మొత్తం చూస్తేనే యీపెద్దకళంకం—మచ్చఅనేది కనబడుతోంది. అదేమిటంటే, నిర్దుష్టంగా కాలాన్ని తెలిపే లెఖ్ఖలు బొత్తిగా లేకపోవటమే...."

..."ప్రాచీన భారతీయులకి చరిత్రఅన్నది వుండకపోవటానికి గల కారణం—వారు చారిత్రాత్మకమైన పనులేవీ చేయలేదు." (చరిత్రని సృష్టించే పనులు చెయ్యలేరుకాబట్టి ప్రాచీన భారతదేశం చరిత్రని వ్రాసుకోలేదు—అట!) ఈ మాటలు ఎంత సంకుచిత, ఈర్ష్యా, ద్వేషభావాలతో నిండి వున్నాయో -అంతకంటే ఎక్కువ అబద్ధాలతో నిండివున్నాయి. "భారతీయులకి చరిత్రలెఖ్ఖలు లేవన్నది" అబద్ధాలని వేరే అధ్యాయాలలో బట్టబయలు చేశాము. ఇక్కడ భారతీయులు "చారిత్రాత్మకమైన పనులు చేయలేదు" అన్నమాటలు దృష్టిలోవుంచుకొని గ్రీకుచరిత్రకారులకున్న గొప్ప

---

Foot Note :— * Dr. A. A. Macdonell. (*Italics mine*)

తనం విషాృషికత, వివేకం, ఎంతశూన్యమో! అయినా, వాటిని కప్పిపుచ్చి మాక్డానెలువంటి విదేశీ చరిత్రకారులు తమ బూటకాలతో మన చరిత్ర పాఠ్యగ్రంథాలెన్నలా వింపారో చూద్దాం—కళ్లారా! .

ఇక ఒక్కొక్క విషయంలోనూ గ్రీకు "చరిత్రకారుల" విజ్ఞానం తిలకిద్దాము:

**పెద్దపులి :**—"అర్రియన్" అనే గ్రీకుచరిత్రకారుడు తానుచూచినట్టుగా రాసిన వర్ణన. "The Tiger, the Indians regard, as a much more powerful animal than the Elephant. Nearchos tells us that he had seen the skin of a tiger, though the tiger itself he had not seen. The Indians however, informed him that the tiger equals in size the *largest horse*...... When it encounters the Elephant, leaps upon the head of the elephant and *strangles* it with ease."

అంటే అతని అర్థం—"హిందువులు పెద్దపులిని ఏనుగుకంటె బలమైందిగా భావిస్తారు. వియార్కస్ అనేవాడు ఏంరాస్తున్నాడంటే తను పులి తోలుమాత్రం చూశాను. పులినిమాత్రం చూడలేదు అని. కాని ఇండియనులు ఏంచెప్పారంటే పెద్దపులి సైజులో—బాగా పెద్దసైజులోని భారీ గుఱ్ఱమంత వుంటుందని ! అది ఏనుగును చూచినప్పుడేంచేస్తుందంటే. దాని తలపై కిదూకి ఆ ఏనుగు పీక పిసిగి (Strangles)చంపుతుంది."

అంటే ఈ విజ్ఞాని, చరిత్రలో పెద్దపులిగురించి రాసిన 'అధికారపూర్వకమైన చరిత్ర' లోని పులులు "గుఱ్ఱంకంటె పెద్దవట"—అందులోనూ ఏనుగును పీక పిసిగి చంపుతాయట!

**నక్కలంత చీమలు**- అంతేకాదు. ఆయన 'చీమల' చర్మాలు: గూడా చూశారట! ఆ చీమలు బంగారం త్రవ్వి ఇస్తాయట గూడా—గ్రీకు చరిత్రకారుల చరిత్రలో వున్నాయేమో! అలాంటి చీమలచర్మాలూ, బంగారు తవ్వే చీమలూను! నమ్మకపోతే వారి వాక్యాలు చూడండి. మరి!!

"In the same way, with regard to ants also, Nearchos says that he had himself seen a specimen of the sort which other writer's declared to exist in India, though he had seen many *skins* of them which had been brought into the Makedonian camp. But Megasthenes avers that the tradition about the ants is *strictly true*—that they are Gold diggers .....only those in India being *larger than foxes*, make their burrows proportionately larger."

పై వాక్యాలలో "అర్రియన్" నియార్కసు, మెగస్తనీసులు కలసి 'నక్కలంత చీమల్ని' చూశామని రాస్తున్నాడు!!! రాయటమేగాదు ఆ "చీమల" చర్మాలుకూడా చూశారట! చూడటమేకాదు. గ్రీకుల శిబిరానికి చర్మాలు కూడా తీసుకొచ్చారనీ, ఆ చీమలు బంగారం తవ్వియిస్తాయనీ రాస్తున్నారు పై వాక్యాలలో !!! మరి యీదేశంలో పుట్టిపెరిగిన మనకు చీమలు చిన్నవిగా కనపడటం భారతీయుల దురదృష్టం. నక్కలంత చీమలు ఆ గ్రీకులకుతప్ప. ఏ భారతీయుడికి కనబడవు. వ్యాస వాల్మీకులుకూడా వర్ణించలేదెక్కడా కలుగులలో వుంటూన్న నక్కలకంటె పెద్ద చీమల్ని!!

ఇటువంటి విషయాలే - విదేశచరిత్రకారులకి పనికివచ్చే చారిత్రక సామగ్రి—మరి పురాణాలనెలా నమ్మగలరు?

**భారతీయ స్త్రీల శీలం .:** "భారతదేశంలో స్త్రీలు యితర మగవాడితో వ్యభిచరించరు—ఒక్క ఏనుగైనా ప్రతిఫలంలేవిదే ! సామాన్యంగా శీలం కలవాళ్ళే అయినా ఒక ఏనుగును గనక బహుమానంగా ఇస్తే ఆమెను ఎవరైనా అనుభవించవచ్చు." అంటూ రాసినవాక్యాలు * చూస్తే రామాయణంలోని సీతాదేవి పుట్టిన ఈ దేశపు స్త్రీలగురించేనా ? ఇలా ఈ గ్రీకు 'చరిత్రకారులు రాసే పిచ్చిరాతలు ! అనిపించక మానదు.

"క్లీటార్కస్" అనేవాడు 'మాంది అనే ప్రాంతంలోని భారతీయుం గురించి వ్రాస్తూ అక్కడి స్త్రీలు 7–వ సంవత్సరంలోనే పిల్లలను కంటారని ఆ స్త్రీలు నలభై సంవత్సరాలకల్లా ముసలివారై పోతారని వ్రాశాడు ! వీడు రాసేది చరిత్ర ! ! !

"Clitarcus and Megasthenes call them Mandi and reckon the number of their Villages at three hundred. The females bear children at the age of seven, and are old women at forty"

**నోరులేని మనుష్యులు :-** "క్లీటార్కసూ" మెగస్తనీసూ, భారతదేశంలో నోరులేని ఒకతెగ మనుషులను చూసారట. వారికి "సైర్కిరిదే" అని

---

Foot Note : – * "Indian women if possessed of un. common discretion, would not stray from virtue for any reward short of an elephant, but on receving this a lady ets the giver enjoy her peison."

పేరు తగిలించారు. ఈనోరులేని మనుషులు రకరకాల పువ్వులనూ చెట్ల పండ్లను వాసనచూస్తూ అవాసనే ఆహారంగా బ్రతుకుతారట! ఎక్కడికైనా ప్రయాణమై వెళ్ళేటప్పుడు *సువాసనగల పండ్లనుకూడాతీసుకువెళ్ళి, ఆకలయినప్పుడు అవి వాసనచూసి బ్రతుకుతారట! ఏదైనాదుర్వాసన తగిలితే ఈ నోరులేనిభారతీయులు చచ్చిపోతారట! వారిపేరు"ఏస్టోమై"(Astomi)అని వ్రాసాడు. ఇదంతాగూడా భారత దేశంగురించి వ్రాసిన "చరిత్ర" క్రిందే వస్తుందికాబోలు.* *ఈగ్రీకు చరిత్రకారుల రచనలను ఇటునుంచి అటు తిరగవేస్తే, మనకి ఉన్నమతి కూడా పోతుంది!

ఈ చెప్పిన ఈ బుద్ధితక్కువ వ్రాతలేకాకుండా భారత దేశంగురించి ఇంకా ఎన్నో అర్థంలేని పిచ్చిపిచ్చి వ్రాతలు ఈ గ్రీకు చరిత్రకారుల రచనలు నిండా ఎక్కడబడితే అక్కడ కనబడతాయి.

**కుక్కతలగల మనుష్యులు** ___కుక్కతల గల మనుషులూ, పాదాలు వెనక్కితిరిగి, మనిషి ముందుకు తిరిగివున్న మనుషులూ భారతదేశంలో

---

Foot Note ·— * ' He speaks also of a race living on the very confines of India on the east, near the source of the Ganges, the Astomi, who have no mouth They eat nothing, and they drink nothing. They require merely a variety of odours of roots and of flowers and of wild apples. The apples they carry with them when they go on a distant journey that they may also have something to smell. Too strong an odour would readily kill them."

** చూ. Fragm 30, Page 79, 80.

తాము చూచినట్టుగా వ్రాసిన గ్రీకురాతలన్నీ ఇలా అంతకంటే అసందర్భ విషయాలతో కూడానిండివున్నాయి. అవన్నీ యిక్కడ ఉదహరిస్తూ పోతే ఇదే ఒక గ్రంథం అవుతుంది. పెద్దపెద్ద చెవులున్న మనుష్యుల గురించి గూడా "అర్రియను"మెగస్తనీసు, జస్టినియసు, ప్లినీ, రచనల్లో మనం యీ నాటికీ కళ్ళారాచూసి- గ్రీకుల చారిత్రకదృష్టిని గ్రహించవచ్చు. ఆగ్రీకుల రచనలనే ప్రమాణంగా తీసుకుని—పురాణాలలోని చారిత్రక కాలగణనాన్ని త్రోసిపుచ్చే విదేశ చరిత్రకారుల గొప్పతనం ఎలాంటిదో ఈనాటికైనా తెలుసుకోవచ్చు మనం!

ఈ చెవులున్న మనుష్యులట—రాత్రి ఆ పెద్ద పెద్ద చెవులు పరచుకొని యింకోచెవిని పైనకప్పుకొని, నిద్రపోతున్నారట* కూడా!! కొందరు భారతీయజాతులు కుక్కలా మొరుగుతూ కుక్కలవంటి గోళ్లూ, బొచ్చూ, చర్మం ఉండటంకూడా చూచారట, ఈ గ్రీకుచరిత్రకారులు! ఇవన్నీ వీళ్ళు రాసిన సిసలైన "భారతచరిత్ర"లోని స్వల్పవిషయాలే—ఇంకా యింత కన్న విడ్డూరాలు కూడా కల్పించి వీళ్ళు యదార్థచరిత్రగా రాశారు! ఈ వాక్యాలు చూడండి నమ్మకపోతే !

"Of others, the Monomatoi, who have the ears of a dog, their *one eye*, set in the middle of their fore- head hair standing erect; and their breasts shaggy."

పై వాక్యాలకు అర్థం ఏమంటే "మొనామేటోయ్"అనే జాతివాళ్ళు కుక్క చెవులతో, ఒక్కటేకన్నుకలిగి వుంటారు. అదిగూడా నుదురు మధ్యగా వుంటుంది. అకన్న! వొంటిమీద బొచ్చుకూడా నిటారుగా నిలుచునివుంటుందట!

---

Foot Note :— * Fragm. XXX (P. 7?)

ముక్కు రంధ్రాలులేని మనుషులూకూడా మనదేశంలో వున్నట్లు రాశారు గ్రీకులు. అంతేగాదు, మెగస్తనీసు రాస్తున్నాడు—తాను బైట బజార్లలో స్త్రీ పురుషులు ప్రత్యక్షంగా సంభోగించే భారతీయుల గురించి! వారు చనిపోయిన వాళ్ళ బంధువుల మాంసం తింటారటకూడా! ఇదిగో చూడండి.

"—Megasthanes states that the tribes inhabiting the Kaukasos have intercourse with women in public and eat the bodies of their relatives.'' (Fragm XV P. 71)

ఈ అసహ్యకరమైన కట్టుకథల పుట్ట యింకచాలు! ఇక గ్రీకులు మనదేశపు పర్వతాలు, నదులూ, రాజులూ, రాజ్యాలూ వాటిపేర్లు—ఎలాగ భ్రష్టుచేసి తప్పుడు ఉచ్చారణతో ఆ పేర్ల అసలురూపాలుకూడా తెలియకుండాచేసారో ఆ ముచ్చట చూద్దాం.

**పేర్ల వికారం** :- గ్రీకు 'చరిత్రకారు'లు ఏమి సాధించినా సాధించక పోయినా—ఒక్క బ్రహ్మాండమైన విజయాన్ని వారు రాసిన 'చరిత్ర'లో సాధించారు! అదేమిటంటారేమో! భారతీయులపేర్లనూ, మనదేశంలోని నదులూ, రాజులు అన్నీ రూపులేకుండా మార్చివేసి ఏది ఏదోకూడా తెలియరాకుండా అంతా ఊహలమీద ఆధారపడాల్సివచ్చే దుస్థితికి తెచ్చి విదేశీచరిత్రకారులకి ఎంతైనా తోడయ్యారు—అనుకోకుండానే!

ఎందులకంటారేమో! వీళ్ళకి నోరుతిరగక భ్రష్టమైన ఉచ్చారణతో మన సంస్కృతంపేర్లు ఉచ్చరించలేక తగలెయ్యటమేగాక, ఆ పేర్లమీద గ్రీకు మేధావుల ఊహలతో—పై రాసిన విషయాలలోలాగే—విచ్చలవిడిగా మూక ఉమ్మడిగా కట్టుకథలు సృష్టించేశారు! వీళ్ళు ఏంవిన్నారో, ఏమి అర్థంచేసికున్నారో ఏంరాశారో ఆ దేవుడికి ఎరుక! అది చదివితే వాస్తవానికెంతదూరంగా వుండాలో అంత అసంబద్ధంగానూ అపహాస్యంగానూ వుంటాయి—భారతదేశంగురించి ఏకొంచెం పరిచయమున్నవాళ్ళకైనాసరే!

1. హిమాలయ పర్వతాలకొచ్చిన తిప్పలు :-

హిమాలయ పర్వతపంక్తి ని గురించి "అ(్రియన్" (Arian) యిచ్చిన అనేకపేర్లు యివి.

అందులో—పరపామిసోస్. (Parapamisos)
హేమోదోస్ (Hemodos)
హిమావోస్ (Himaos)

అనేవి హిందువులు పిలిచే పేర్లట ! గ్రీకులుమాత్రం "కాకశోస్" (Kaukasos) అని పిలుస్తారట—"అర్రియన్" వ్రాతలలో ! !

2. పాటలీపుత్రం :- పాలింబోత్ర (Palimbothra)

3. అభీరుడు :-Omphis 'ఓంఫిస్' లేక 'అంభి' అని మన చరిత్ర కారులు గ్రీకుంపేరే వాడ్తారు.

4. పురీష సేతుడు లేక పురీంద్రసేనుడు లేక పౌరవుడు — అని పేరువున్న రాజుని గ్రీకులు "పోరస్" (Poros) అని వ్రాశారు.

5. తక్షశిల లేక (దక్షశిల) * — 'టాక్సిలా' (Taxila)

---

Foot Note :- * ఈ ప్రదేశం హిమవత్పర్వత పాదం దగ్గరలో నైరుతిగా దక్షునియజ్ఞం ధ్వంసంచేసి మేక తల అతికించిన గాథకు సూచనగా దాన్ని "దక్ష-శిలగా పేర్కొన్నాయి, మనపురాణాలు. అదే తర్వాత గ్రీకుల నోట్లోపడి "టాక్సిలా" (Taxila)గా మారింది.

6. మలయపర్వతం :- మాలిమోస్ (Mount Maleous)

7. చంద్రమసుడు :- "గ్జాంద్రమోసు" లేక "గ్జాంద్రేమ్సు" (Xandrames)

ఇతనే "అగ్రమోసు" (Agrammes) గా కూడా మార్చివేశారు.

8. క్షుద్రకులు :- అన్నిటికంటె విచిత్రం యీ ప్రాచీన భారతదేశంలోని రాజవంశీయులైన క్షుద్రకులని "ఆక్స్డ్రాకై" (Oxdrachi) అనిన్నీ అశ్వకులనే తెగ, లేక అశ్వపతులను "ఆర్సీకాయ్" (Arseikoi) అనీ వాళ్లిష్టము వచ్చినట్టు అపభ్రంశంచేసి పేర్లను భ్రష్టుచేసారీ గ్రీకు చరిత్రకారులు. ఇలాగ నామరూపాలు లేకుండా అసలు పేర్ల రూపులే సర్వనాశనం చేయటం ఈజిప్టు (Egypt) చరిత్రలోకూడా జరిగింది. వాళ్ళ అసలుపేర్లు నామరూపాలు లేకుండా యూరపియను పేర్లుగామార్చి వాటి అసలు స్వరూపాలే గుర్తుపట్టటానికి వీలులేకుండా పోయినాయి. అసలు ప్రాచీన దేశస్తులైన ఈజిప్టు ** పర్షియా చైనా దేశాలలోని పేర్లువాటిఅసలురూపంచూస్తే భారతీయ పేర్లకి వికృతిగానో, మన హిందూ పేర్లుగానో తెలిసిపోతాయి.

యీ మార్పులు చెయ్యటంద్వారా గ్రీకులూ, పాశ్చాత్యులూ అందరి పేర్లు వాళ్ళ దేశీయులేమో ననిపించేలాగు మార్చేయడం చరిత్ర పరిశోధకుల కందరికీ తెలిసినదే! ఎవరూ పైకి మాట్లాడరు దాన్ని గురించి.

---

** మన ప్రాచీన పురాణాలలో ఈజిప్టు (Egypt) మిశ్రదేశం అని పేరు. ఈనాటి చరిత్రకారులు ఈజిప్టు రాజులలో మొదటివాడైన "మిశ్రయమ్" (Mizriam) ప్రథముడుగా చెబుతున్నారు.

వాళ్ళ ఆదిమ చక్రవర్తి "మేనిస్" (Menes) అన్న "మనువు" గ్రీకులలో Minnoas మినోవ్లఅస్‌గా యీనాటికి మారి కనబడుతున్నది.

అలాంటి పేర్లకు బైబిలులోని ముఖ్యపాత్రలే మనకి చక్కని ఉదాహరణ 'మూసా' అనే ప్రవక్త 'మోసెసు' గాను 'ఈశా' (Isa) అనే ప్రవక్త 'జీసను' (Jesus) గానూ, ఇబ్రహీం, అబ్రహాం గానూ మార్చి వేశారీ తెల్లదొరలు. అలాగే ఈజిప్టులోని రాజులందరూ "రాము"లు అన్న పేరుతో పరిపాలించారు. (మన బలరాముడూ, పరశురాముడూ, రఘు రాముడూ లాగ! (ఆపేర్లని "రామసిస్" (Ramesis)గా మార్చారు. మన ఇంగ్లీషుసోదరులు. అల్లాగే 'అసురదేశాన్ని' 'అస్సీరియా' (Assyria) గానూ, సురలదేశాన్ని 'సురియా, లేక ** సిరియా (Syria) గానూ కాంబోజ' దేశాన్ని కాంబోడియాగానూ (Canbodia) గాంధారమనేపేరును, కాంధార్ (Khandar) గాను 'కురు' శబ్దాన్ని 'కైరసు' గాను తర్వాత సైరస్ గానూ (Kyros or Cyrus); ఇదే విధంగా పరాక్రమానికి మారు పేరయిన "కేసరి" బిరుదును కైసరుగానూ (Kaiser) అదే తిరిగి "సీజరు" (Ceaser) గానూ సర్వనాశనం చేసిన యూపాశ్చాత్యపు అలవాటు ఈ గ్రీకు "చరిత్రకారుల"తోనే మొదలైందని మనకి తెలుస్తోంది.

## కొంచంలో చావు తప్పిన "ప్రపంచవిజేత" :-

చాలమంది అలెగ్జాండరును "ప్రపంచవిజేత" అనుకుంటారు. అంతే కాదు, అలెగ్జాండరు భారతదేశాన్నికూడా జయించినట్లూ-అందులోనూ 'పురు

---

* Note : —చూ :- సూర్యదేశమే సురలదేశమై "సురియా", గా మారి, అదే తర్వాత సిరియా (Syriu) అయింది. సురులు 'అదిత్యులనీ' అసురులు దైత్యులనీ దానవులనీ పేర్లున్నాయని మనకు తెలుసు. ఈ అదిత్యుల (దేవతల)ని సురులని "సూర్యదేశం" లేక 'సురులదేశం' అన్నదే సురియా (Surya) లేక సిరియా అయిందని చారిత్రకులు తేల్చారు.

గ్రీకులు "దానవోస్" (Danaus) అన్న 'దానవ'జాతికి వంశీయులైనట్లు ప్రాచీన గ్రీకుచరిత్ర తెలుపుతోంది.

షోత్తము" డనే రాజుని జయించినట్టూ మనలో చాలామంది అభిప్రాయ పడతారు. ఇంగ్లీషువాళ్ళు రాసిన తప్పులతడకలతోనూ అతిశయోక్తుల తోనూ నిండిన "హిస్టరీ" చదివి అలెగ్జాండరు పాశ్చాత్యుడు గనక, అతన్ని గురించి యీ విదేశ చరిత్ర కారులు అతని పరాభవాలనూ, పరాజయాలనూ కప్పిపుచ్చి భారతీయ రాజుల గొప్పతనం, పరాక్రమం, ధర్మబుద్ధి మొద లైన వాటి నన్నిటిని, తక్కువచేస్తూ వేళాకోళపు ధోరణిలో రాశారు. ఇది నిజమా? అనికూడా మనం ఆలోచించం. ఇది శుద్ధ అబద్ధమని తెలుసుకోవ టానికి గ్రీకులు రాసిన చరిత్రే చాలు. అలెగ్జాండరు సమకాలికులు కొందరు గ్రీకులు మనదేశానికి వొచ్చారు అతని సైన్యంవెంట. వీళ్ళు చూసినవి విన్నవి అనేకం రాసిపెట్టారు రచనల రూపంలో. అవే ఆధారం—విదేశ చరిత్రకారులకు. అందులో చాలా విపులంగా అలెగ్జాండరు దండయాత్ర కాలంలో జరిగిన యుద్ధాలూ, అందులో అలెగ్జాండరుకు జరిగిన పరాభవం అతడు తలవెంట్రుక వాసిలో చావుతప్పిగుండెల దాపులో దిగిన బాణంతో భూమికి ఒరిగిపోయి "ధర్మయుద్ధం" అని భారతీయరాజులు చంపక విడిచి వేయగా ప్రాణాలు దక్కించుకున్నాడు. అది రాయరు — ఇంగ్లీషువాళ్ల చరిత్రలో! అది వాళ్ల తెల్లజాతికే పరాభవం గనక !!!

అలాగే అలెగ్జాండరు భారతదేశాన్ని జయించలేక భయపడి వెను తిరిగి పోయాడన్న విషయంకూడా చాలామందికి తెలియదు. అతని సేనలు భారతీయ రాజుల శౌర్యపరాక్రమాలను విని భయభ్రాంతులై "ఒక్క అడు గైనా ముందుకు వేయమ"ని అనటమేగాకుండా భయంతో ప్రత్యక్షంగా ఏడ్చారుకూడా!!! అప్పుడు గత్యంతరంలేక అలెగ్జాండరు వెనక్కి తిరిగి పోయాడని కూడా చాలా మందికి తెలీదు! దీనికంతా కారణం మనం ఆనాటి గ్రీకులు వ్రాసిన అసలైన చరిత్ర చదవం—ఇదేకారణం. ఇంగ్లీషువాళ్ళు ప్రచారదృష్టితో రాసిన చరిత్రపుస్తకాలలో యీ విషయాలు దాచివేసి, రాయకపోవటమే గాకుండా "అలెగ్జాండరు" మనదేశాన్ని జయించినట్టుగా కూడా **Alexanders Conquest** అన్నమాటలు దొర్లిస్తూ నేర్పుగా తప్పు

లనే శాశ్వతం చేశారు. మన చదువులలోనూ, మన కాలేజీల చదువుల లోనూ కూడా తద్వారా, శతాబ్దంగా అదే చదివిన మనవాళ్ళకి యీనాడు యదార్థం వ్రాసినా నమ్మ శక్యంకాకుండా వుండేలాంటి మనస్తత్వం ఏర్ప డింది. అందుకే యదార్థంగా జరిగిన చరిత్ర—గ్రీకుల రచనల్లోంచే యధాతథంగా మీముందుంచుతాను. అప్పుడు తెలుస్తుంది — అసలు నిజంగా జరిగిందేమిటో—మనపుస్తకాల్లో ఇన్నాళ్ళూ మనం చదువుకుం టున్న దేమిటో !!!

అదేకారణంగా—అంటే నిజమైన చరిత్ర తెలుసుకోక విదేశీయుల దొంగచరిత్ర చదువుకున్న దౌర్భాగ్యం—కారణంవల్లనే అప్పటి భారతీ యులు గ్రీకులతో చేసిన యుద్ధాలలో అస్త్రాలు ప్రయోగించినట్లూ—దాని వల్ల చూస్తూండగానే గ్రీకులమీద ఉరుములు మెరుపులతో తుపానులు అగ్నివర్షాలు కురిసినట్లు గ్రీకులే వాళ్ళ ఆకాలంనాటి రచనలలోనే వ్రాసి నట్లుకూడా, మన "హిస్టరీ" ప్రొఫెసర్లకూ, అధ్యాపకులకీ (Lecturer) కూడా చాలావరకూ తెలియదు. ఇవన్నీ ప్రత్యక్షంగా ఇప్పుడే వినూ పిస్తాను!

## గ్రీకులు ఎందుకు వెనక్కి తిరిగిపోయారు? :-

ఈప్రశ్న ప్రతి భారతీయుడూ విదేశీయుల చరిత్ర చదివిన మీదట వెయ్యవలసిన సూటిప్రశ్న! ఎక్కడైనా చరిత్రలో ఓడిపోయిన వారూ, భయపడి పలాయనం చిత్తగించిన వాళ్ళు వెనక్కి తగ్గి వెళ్లిపోతారు గాని విజయ పరంపరలు వస్తుంటే దయాధర్మాలకోసం భారతదేశం పొలిమేర ప్రాంతంలోంచే ఎందుకు వెనక్కి తిరిగి వెళ్ళిపోతారు? అలెగ్జాండరు మనదేశానికి ఉత్తర సరిహద్దు దగ్గరి పంజాబూ. సరిహద్దురాష్ట్రం ప్రాంతం (North West Frontier) నించే వెనక్కి పోయాడు. ఎందుచేత ?

దీనికి సమాధానం తెలిపే గ్రీకుచరిత్రకారుల రచనలే వున్నాయి. యిప్పటికీ సాక్ష్యంగా!!!

"అర్రియను" అలెగ్జాండరు తిరోగమనం గురించి XXVIIవ అధ్యాయంలో యీవిధంగా వ్రాశాడు :—

"Next day while his wrath was still hot, he summoned the same men again and told them that he was going forward himself, but would not force any of the Macedonians to accompany him again t their wishes. With these words he withdrew into his tent, and did not admit any of his companions to see him on that day, not even till the third day after, waiting to see whether a change in mood...would manifest.. and as everything indicated that to return was his most expedient course. he intimated to the army that he resolved to march back."

"మర్నాడు తను ఇంకాకోపంగానే వున్న తన సైనికులందరిని పిలిపించి తను ముందుకే సాగిపోతున్నాననీకాని ఇష్టం లేనివాళ్ళను తనతో పాటు రమ్మని ఎవరినీ బలవంతం చేయదలచుకో లేదనీ చెప్పాడు.... ఈ మాటలని తన గుడారములోకి పోయి మూడురోజులదాకా ఎవరినీ కలవకుండా లోపలే ఉండిపోయాడు. వాళ్ళు తమ నిశ్చయం ఏమన్నా మార్చుకుంటారని. కాని అన్ని వైపులా పరిస్థితులు చూడగా వెనక్కితగ్గటమే ఉచితమూ తగిన కార్యమూ అని అతనికి తోచి తనసైనికులతో తాను కూడా వెనక్కితిరిగి వెళ్ళిపోవటానికే నిశ్చయించి నట్లు తెలియజేసాడు."

ఈ వెనుతిరిగిపోవటానికి కారణం—భారతీయుల పరాక్రమం. వారితోటి యుద్ధాలలో ఇంతకు ముందు పోరాడిన దేశాలలోకంటె ఇక్కడ అసౌకర్యంగా వుండటమే! ఇదికాక సైనికులవొత్తిడివల్లే వెనక్కిపోయాదని ఎవరైనా అనుకోకుండేందుకై యుద్ధంలో అలెగ్జాండరుకు కొంచెంలో చావుతప్పిన వైనంకూడా ఈ క్రింద వర్ణించింది* చదివితే2ఎందుకని అతను

---

* Foot Note :—"The king was now near the coping of the wall and resting his shield against it, was pushing one of the Indians within the Fort, and had cleared the parapet by killing others with his sword.

తిరిగి వెళ్ళిపోవటానికి అన్ని విధాలా అదే మంచిదని నిశ్చయించుకోవలసి వచ్చిందో తెలుస్తుంది అనుమానానికి తావులేకుండా.

"He then perceived that if he remained where was, he would be exposed to danger without being able to achieve anything noteworthy, but if he leaped down into the citadel he might perhaps, by this very act paralize the Indians with terror, and if he did not necessarily incur danger, he would in that case not die ignobly, but after performing great deeds, worth being remembered by men of after times."

"—Alexander himself was also struck by one (arrow) which pierced though his cuirass into his chest above the pap so that as Ptolemy says, air gargled from the wound along with tne blood. But sorely wounded as he was, he continued to defend himself as long as his blood was still warm. Since mueh blood. however, kept gushing out with every breath he drew, a dizziness and faintness seized him and he fell where he stood in a collapse— There when they saw the king fall prostrate, they all raised loud lamentations and outcries of grief." (Chapt X)

"The City belonged to the Mallios, and the men who wounded Alexander were Mallios."

"Some say that Alexander received a blow on his helmet from a bludgeon and fell down in an excess of dizziness, and that on regaining his feet he was hit by a draft which pierced through his breast-plate into his chest"—"The first news which reached the Camp whence he had started to attack the Mallios was that he had died of his wound. There arose at first a loud lamentation

from the whole army—"they gave way to despondency and anxious doubts about the appointment of a commander to the army."

"The hypasists are *alarmed beyond measure for the king's safely.* pushed each other in *their haste up* the ladder and *broke it*, so that those who were already mounting it *fell down.*"

"Alexander while standing on a wall, was then assailed on every side from the adjacent towers. He was assailed also by men who threw darts at him from no great distance off.—"

"రాజు(అలెగ్జాండరు) కోటబురుజుకి దగ్గర్లో విల్చొని తనడాలును అడ్డంపెట్టుకుంటూ దానిసాయంతో శత్రుపైనికుల్ని నెట్టుతున్నాడు. తన కత్తితో కొందర్ని గోడమీదనిలబడ్డవాళ్ళని చంపాడు."

హైపాస్టిషులు ఇప్పుడు అలెగ్జాండరుకు వాటిల్లిన ప్రమాదంగురించి భయపడసాగారు. ఆతొక్కిడిలో ఒకళ్ళనొకళ్లు తోసుకోవడంతో ఆ నిచ్చెన విరిగి అందరూ కిందపడ్డారు, కిందనుంచి పైకెక్కుతున్నవాళ్ళతో సహా.

"అలెగ్జాండరుగోడమీద నిలబడివున్నాడు. అన్నివేపులనుంచీఅయు ధాలువొచ్చిపడి ఆతన్నితాకినాయి-ఈ ప్రక్కనవున్న కోట బురుజులోంచి కిందనున్నసైనికులుకొందరు అతనిమీదకు యీటెలూ, బరిశెలూవిసిరారు"

"ఆ పరిస్థితిలో ఇంకఅలెగ్జాండరు అక్కడవుండేప్రమాదం; పైగా తాను ఏమీ సాధించటంకూడా సాధ్యంకాదని గుర్తించాడు. కాని తాను గనక కోటగోడదూకి శత్రువుల్లోకి దిగితే భారతీయులు తనుచూసి భయపడి

పారిపోవచ్చుననుకున్నాడు. అలాపోకపోతే ఒకవేళ వాళ్ళచేతుల్లోగనక తాను చచ్చిపోయినా. కీర్తి—అంటే అనేక గొప్పపనులుచేసి, వీరుడిలాగ చచ్చిన ప్రతిష్ఠ—రావచ్చును, అని లోపలికిదూకాడు.''

''అప్పుడు అలెగ్జాండరుకు ఒకబాణంవొచ్చి తగిలింది అదిరొమ్ముపై నున్నకవచాన్ని బద్దలుకొట్టుకుంటూ ప్రక్కగా రొమ్ములోతుకు దిగింది. అతడుఊపిరిపీలుస్తుంటే గాలివిడిచినప్పుడల్లా రక్తం బుడ బుడ మని పైకి చిమ్మటం ఆరంభించింది, "టాలెమీ"(Ptolemy)ఏమని రాస్తున్నాడంటే గాలి పీలుస్తూంటే బుదబుదమని ధ్వనివచ్చి దాంతోరక్తం బైటకు ఒలికి పోవటంమొదలు పెట్టిందని! గాఢంగా గాయపడినందువల్ల తనను తాను వీలయినంతవరకూ రక్షించుకొనసాగాడు. రక్తంలో వెచ్చదనం తగ్గనంత వరకూ! కానివాలారక్తం పోయింది. ఆలాగ ఎంతో సేపులేకుండానేకళ్ళుబైర్లు కమ్మి కిందకు పడిపోయాడు. తక్కిన సైనికులు,అలెగ్జాదరు] పడిపోవటం చూసి, పెద్దగారోదనంచేస్తున్న ఏడ్పుల ధ్వని ఒక్కసారిగా మిన్నుముట్టింది

....ఆడీరు'మాలియ్యోయ్'లకు సంబంధించినది. అలెగ్జాండరును గాయపరచిన సైనికులుకూడా ఈ "మాలియ్యోయ్"*తెగకు సంబంధించిన వాళ్ళే! "

"కొంతమంది ఏంచెబుతారంటే అలెగ్జాండరుకు తలమీద గదవంటి ఆయుధంతో కిరీటంపై దెబ్బతగిలి కిందపడ్డాడని—కొంచెం తేరుకొని కష్టంతో లేచి తనకాళ్ళమీద నిలబడగానే బాణంవచ్చి రొమ్ములో దిగ బడిందని, రొమ్ముకువున్న కవచాన్ని భేదించుకుంటూ వొచ్చి,''

---

*Note:–గ్రీకుల అపభ్రంశ ఉచ్చారణలో మనపేర్లు ఎల్లా నాశనం అయి నాయో వేరేచోట వివరాలిచ్చాను. ఇంగ్లీషువాళ్ళతర్వాత మళ్ళీ అంతవాళ్ళు ఈ గ్రీకులు—పేర్లరూపాల్ని నాశనం చెయ్యడంలో! "మాలీయ్యోయ్" అన్నది మాళవకూరుల కొచ్చిన ఇబ్బంది!

..."ముందుగా సైనికులకు, వొచ్చిన వార్త ఏమంటే, మాళవ శూరుల్ని ఎదిరించి యుద్ధంచేస్తుండగా దెబ్బతగిలి చచ్చిపోయాడని అప్పుడే ఒకపెద్దరొదతో ఏడుపులు గ్రీకు సైన్యంలోంచి బైలేరాయి............ఇది అయిన వెంటనే నిరుత్సాహం నిరాశ అంతటా అలుముకున్నాయి. ఇక తర్వాత సేనలకి నాయకుడు ఎవరా, ఎలాగా అన్న సందేహాలు పొడచూపాయి."

అంటూ గ్రీకుచరిత్రకారుల రచనలలోనే ఇలా ఎంతో స్పష్టంగా రాయబడివుంది. అలెగ్జాండరు ఎంతకొంచెంలో చావు తప్పించుకున్నాడో! నిరాయుధుణ్ణి గాయపడి మూర్ఛిల్లినవాళ్ళనూ చంపకూడదని భారతీయులు "ధర్మయుద్ధం" అనే నియమాన్నితలచి దయతలచి చంపలేదు. లేకపోతే కొద్దికాలంతర్వాత గ్రీకుసేనాని "సెల్యూకస్" (Seleucus) భారతదేశాన్ని జయించటానికి ప్రయత్నించితే అతనికేంగతి పట్టిందో అదే జరిగేది అలెగ్జాండరుకూ. లేదా దిక్కుమాలిన చావు చావలసివుండేది మనదేశంలో. ఇవన్నీ రాయకుండా ఏమి జరగనట్టు కప్పిపెట్టి, విదేశచరిత్రకారులు అలెగ్జాండరును' జగజ్జేతగా పోరసును దయతలచి అతనిరాజ్యం తిరిగి యిచ్చేసాడని వ్రాస్తారు! అది చరిత్ర! ఇదీ—అసలు సత్యం!

## అలెగ్జాండరు పరాజయం—
## అజేయులైన భారతీయుల శౌర్యం-:

మనం చరిత్రలో ఎక్కడచూసినా విదేశీయుల చేతుల్లో ఓడిపోయినట్టె వ్రాస్తారు. విదేశీయులు. మన యీనాటి హిష్టరీఅంతా "భారతీయుల పరాజయాలగాథే"! ఈగాథలో మొదటికథ—గ్రీకులు భారతదేశాన్ని జయించారన్నదే. ఇది నిజమా! అంటే సమాధానం:

## "భారతదేశం ఎప్పుడూ విదేశీయులచేత జయించబడలేదు"

ఇక గ్రీకుచరిత్రకారుడైన మెగస్తనీసే పై విధంగా రాశాడంటే దాని అర్థం ఏమిటి? భారతీయులు అజేయులని తెలియచేయటమేగాక-గ్రీకులవరకూ

అంతకుముందెప్పుడూకూడా-ఎవరూ యీదేశాన్ని జయించలేదు: అని నిర్ధారణచేసే యీ వాక్యాలే అందుకు నిదర్శనం:

"Its people, he (Megastheres) says, never sent an expedition nor was their country ever invaded and conquered .... and Semiramis who meditated its conquest died before the necessary preparntions were under-taken" అంటే —"మెగస్తనీసు భారతీయులెప్పుడూ విదేశాలమీద దురాక్రమణ చెయ్యటంగాని, లేదా ఆదేశాన్ని (భారతదేశాన్ని) ఇతరులు ముట్టడించి ఓడించడంగాని ఎప్పుడూ జరగలేదని రాస్తున్నారు ... ....అంతేకాకుండా "సెమీరామిసు" రాణికూడా భారతదేశాన్ని జయించాలని కలలు కన్నప్పటికీ ఆప్రయత్నాలు పూర్తి కాకుండానే చనిపోయింది."—అని పై మాటల తాత్పర్యం.

**భారతీయులు దివ్యాస్త్ర సమన్వితులు:-**

అలెగ్జాండరుతోకూడా వచ్చిన గ్రీకులువ్రాసిన రచనలలో భారతీయులఅస్త్రవిద్యనూ, మంత్రశక్తినీ, ప్రత్యక్షంగా చూశామని భయాశ్చర్యాలతో వ్రాశారు. అయినా ఇంగ్లీషువారు రాసిన! చరిత్ర గ్రంథాలలో గాని, మన విదేశ మానసిక దాసుల "హిష్టరీ" గ్రంథాలలో గాని ఎక్కడా యీ విషయమే ఎత్తరు.

అంతేకాదు, హిష్టరీ M. A లు డాక్టరేటుల్లో కూడా యిలాంటి విషయాలను తెలుసుకున్నవాళ్ళేలేరు. దీనికి కారణం కేవలం అశ్రద్ధ అజ్ఞానం మాత్రమేకాదు. మంత్రాలన్నా జ్యోతిష్యమన్నా ఋషులు భారతదేశ భవిష్యత్తును దివ్యదృష్టితో చూశారన్న ఇటువంటివేవీ నమ్మనట్లు నటించటం, ఒక "ప్యాషను" (Fashion)! పాశ్చాత్యసభ్యతకూ, గౌరవానికీ యిటువంటివి నమ్మకపోవుటం ఒక నాగరికతాలక్షణంగా భావించి విదేశీయుల అడుగుజాడలలో బ్రతికే వెన్నెముకలేని వానపాముల మనస్తత్వం గాని చరిత్రలో జరిగినది జరిగినట్టుగా రాయవలసిన చోటవీరి కుంటి నమ్మకాలు అపనమ్మకాలతో పనేమిటి? అది అడిగేవారు లేక పోవటమే మనచరిత్ర దౌర్భాగ్యత! ఏమయితేనేం—ఇదిమాత్రం నిజం.

ఆనాటి భారతీయుల ఆధ్యాత్మిక శక్తులకూ ఆయుధాలకూ అస్త్రాలకూ ప్రత్యక్ష సాక్ష్యం.-మన చరిత్రకారులు దేవతలుగా నమ్మే విదేశీయుల-గ్రీకురచయితల వ్రాతలలోనే వున్నాయి! మచ్చుకు, ఫిలోస్ట్రేటసు వ్రాసిన *యీ వాక్యాలు చాలు :- "Should an enemy make war upon them, they drive him off by means of tempests and thunders as if sent down from heaven. The Sages remained unconcirned spectators until the assault was made when it was repulsed by fiery whirl winds and thunders which being hurled from above, delt destruction on invaders."

అంటే "ఎవరయినా వాళ్ళమీదకు యుద్ధానికని వెళితే వాళ్ళు తుఫానులు పిడుగులు సుడిగాలులా సృష్టించి వాటితో ఆ శత్రువుని తరిమివేస్తారు. సామాన్యంగా, ఆ ఋషులు వారిపైన దాడిజరిగినదాకా నిశ్చింతగా అంటీ పట్టనట్టు చూస్తూవుండి, ముట్టడిచేసినవెంటనే నిప్పు సుడిగాలులు పైనుంచి కురిపించి, శత్రువులనుపరాభవించి వెనక్కితరిమి కొట్టేవాళ్ళు' అని ఫిలోస్ట్రేటసు అనే గ్రీకు చరిత్రకారుడి పైమాటలు చూచినప్పుడేమంటారు ఈ చరిత్ర పండితులు? ఇదికూడా మన పురాణాలలోని అస్త్రాల మాదిరిగానే పుక్కిటి పురాణమంటారా! గ్రీకుల వ్రాతలు, అని నెత్తిన పెట్టుకొని నమ్ముతారా?

ఇలా రాసినవాడు యీ ఫిలోస్ట్రేటసు ఒక్కడేగాదు. ఇంకా చాలా మంది రాశారు. అదేవిషయాన్ని బ్రహ్మశ్రీ కోట వెంకటచలంగారి వాక్యాలలో ఉదహరిస్తున్నాను.

"అలెగ్జాండరుచక్రవర్తి ఇండియానుండి వెడలిపోయిన పిమ్మట 'అరిస్టాటిలు'కు (Aristotle) యొక ఉత్తరము వ్రాయుచూ అందిట్లు వ్రాసియున్నాడు.

"The terrific fiashes of flame which he beheld showered on his army in India"* అన్న వాక్యాలలో శ్రీ వెంకటచలంగారు అలెగ్జాండరు సొంతమాటలతోనే పై విధంగా ఉదహరించారు.

---

*చూ. Philostrate Vit. Apolion. Lib. H. c. 33.

*చూ. Dantes' Inferno XIV-31.7 (orat XX VII. P. 33.7)

"The Barhmins were fighting at a distance with lightning and thunder."**

ఈ కారణంవల్ల అలెగ్జాండరు తనకు రాజులూ, క్షత్రియుల కన్నా ఋషీశ్వరులూ, బ్రాహ్మణోత్తములే భారతదేశాన్ని జయించటానికి ప్రబల విరోధులని చెప్పి ప్రత్యేకకక్షతో, అవమరచివున్న ఋషులనూ బ్రాహ్మణులనూ, పిల్లలనూ స్త్రీలనూకూడా విడిచిపెట్టకుండా క్రూరంగాచంపి గద్దలూ, రాబందులూ తినేలాగ చెట్లకివేలాడగట్టినట్టుగా కూడా రాప్సన్ అనే చరిత్రకారుడు తెలుపుతున్నాడు ఈ క్రింది మాటలో. "TheEuropeans (Greeks) knew however who were their worst enemies, and their hand fell heavily upon the Brahmins. They were put to death wholesale Their bodies too were lining up for the kites and vultures by the roads to the unspeakable horror, we may beleive, of the people of the land"–Ancient India, by Rapson.

(P. 378)

మంత్రశక్తి వల్లా దివ్యాస్త్రాలవల్లా దేశరక్షణ చెయ్యటం, శత్రువును తరమికొట్టటంలాంటిపనులే గాకుండా బ్రాహ్మణులు ఆనాటిప్రజలలో ప్రబోధం, ప్రచారంద్వారా దేశభక్తి ప్రజ్వరిల్లచేసి రాజులను పురికొల్పి శత్రువులమీదకి మళ్ళీ మళ్ళీ పురికోల్పుతూ దేశము. దురాక్రమణకి తల వొంచకుండా ఉత్తేజ పరిచేవారుగాబట్టే, ఆనాటి గ్రీకులే కాకుండా ముస్లిములు, మొగలులూ, యింకా ఇతర విదేశీయులందరికీ కూడా బ్రాహ్మణులే ప్రబల శత్రువులు. అందుకే ప్రతివిదేశీయ దురాక్రమణదారూ కూడా బ్రాహ్మణుల్ని ఏనుగులతో త్రొక్కించి, "జిజియా" వంటి పన్నులవల్ల ప్రత్యేకంగా హింసించి రూపు మాపటానికే ప్రయత్నించారు.

---

**చూ. A. P. Duten's Origin of the Discoveries attritbuted to the Moderns (P. 196)

దీనికి కారణం వేరే చెప్పక్కర్లేదు. భారతదేశానికి వీరే భారతీయ సంస్కృతీ వేదసాహిత్యం, మంత్రశక్తులు, శాస్త్రాలు, ఆయుధాలతోపాటు హిందూ సంస్కృతిలో జీర్ణించుకొనివున్న "జాతీయత" స్వాతంత్ర పిపాస—మనదేశానికి చాలవరకూ స్వాతంత్ర్యాన్ని నిలుపుకోటానికి శక్తినీ ఉద్బోధాన్నీ ఇచ్చాయి. ఆనాటి అర్జునుడు వెనక్కుతగ్గుతుంటే విజయోత్సాహంతో ముందుకి నడిపించిన "భగవద్గీత" లాగే ఈ విషయం అడుగడుగునా మనకి భారతజాతి చరిత్రలో మళ్ళీ మళ్ళీ ఋజువవుతూ కనిపించే నగ్నసత్యము.

చివరికి బ్రిటిషుసామ్రాజ్యవాదులుకూడా యీదేశాన్ని రాజకీయంగా జయించటం సాధ్యంకాదని ఈజాతిని బానిసగా పాశ్చాత్యసంస్కృతికి తల వొగ్గే బానిసగా చెయ్యాలంటే భారతీయ జీవనవిధానాన్నే పూర్తిగా సర్వనాశనం చెయ్యాలని సంకల్పించి అందుకు తగ్గ విద్యావిధానాన్నీ, తగిన చట్టాలనూ (Law courts) అలాంటి వేషభాషలూ అన్నీ క్రమేణా మార్చి, భారతీయుల రూపంలోవుండె బ్రిటిషు మానసపుత్రుల్నిగా తయారుచేసారు. ఈ క్రొత్తజాతే, మన స్వాతంత్ర్య సమరానికి వెన్నుపోటు పొడిచిన "జస్టిస్‌పార్టీ" "పీపుల్సుపార్టీ" పేర్లతో బ్రిటిషువారికి సాయంగా నిలిచింది. విదేశ నియంతృత్వానికి స్వదేశీయుల మానసిక దాస్యమేగదా ఆధారం? అలాంటి జాతి యీనాటికీ కనిపిస్తారు మనమధ్యలో భారతీయ సంస్కృతిని ఎగతాళిచేసి నిరసించే భారతీయులే వీరు!

అందుచేత ఆనాటి గ్రీకులయిన ఆర్రియన్ 'స్ట్రాబో' జస్టినియన్‌ల రచనలనిండా: ఆశ్రమాలమీద, సాధువులమీద, బ్రాహ్మణఆశ్రమాలమీద గ్రీకులు జరిపిన అమానుష హింసా క్రూర హత్యాకాండల కథలే! నిరాయుధులైన మునుల స్త్రీలు, పిల్లలూ క్రూరంగా "యాహ్యాఖాన్" బంగళాదేశంలో జరిపిన హత్యాకాండవంటి హింసద్వారా, దేశస్వాతంత్ర్యం కోసం పోరాడే ధైర్యాన్ని నాశనం చెయ్యాలని అలెగ్జాండరు ప్రయత్నించి విఫలుడైనాడు యాహియాఖాన్ లాగే. అందుకే సింధునది దాటిరాకుండా పలాయనం చిత్తగించాడు. కాస్తలో చావు తప్పించుకొని!! ఇదంతా

మనచరిత్ర గ్రంథాల్లోకి ఎక్కకుండా దాచారు. విదేశీయులూ మన గుడ్డి అనుయాయులూను!

### అలెగ్జాండరు సైనికులకు హడలు :-

ఇంకా ఇలాటి దురాగతాలు ఎన్నో జరిగాయి. ఈ భారతజాతి చరిత్రలో!! ఈ కథంతా అలావుంచి, అలెగ్జాండరు వెనుతిరిగి పోవటానికి గల నిజకారణాలు తెలీకుండా వుంచారు. ఇప్పుడు మనకేమీ కష్టంకాదు గ్రీకు సైనికులు ముందుకి నడవకుండా ఎందుకు వెనక్కుపోతున్నారో తెలుసుకోవటం. వాళ్ళరాజుకి పట్టినగతి వ్రాశాడుగదా. ఇక సామాన్య సైనికుల కష్టాలు. భారతీయులఆయుధాలవల్ల వాళ్ళకుకలిగిన అసౌకర్యమూ మనమే ఊహించుకోవచ్చు. దీనికి "గ్రీకుచరిత్రకారుడే" సాక్ష్యం!!

"The officers, however. paralysed with terror, kept their eyes steadfastly fixed on the ground and remained silent. Then there arose, no one knew how, first a sighing and then a sobbing, until, little by little. their grief began to vent itself more freely in streaming tears, so that their the king, whose anger having been turned into pity, could not refrain form tears, anxious though he was to suppress them."

అతని సేనాధిపతులు మాత్రం భయంతో బిగుసుకుపోయి నేలవైపు చూపులు నిలిపి మాటా పలుకూలేకుండా స్తంభీభూతులై వున్నారు. అందు లోంచి, ఎలాప్రారంభమైందో తెలియదుకాని, నిట్టూర్పులు ముందుగా మొదలయి నెమ్మది నెమ్మదిగా వెక్కివెక్కి ఏడ్పుకింద పరిణమించి చివరికి కట్టలు తెంచుకొని దుఃఖం ధారాపాతంగా కళ్ళనీళ్ళప్రవాహంలోకి దిగింది. చివరికి, అలా అంతా దుఃఖంలో మునిగివుండటం చూసిన రాజుకు (అలెగ్జాండరుకు) కూడా దుఃఖం ఆగలేదు. ముందువున్న ఆతనికోపం జాలికింద మారి చివరికి ఎంత ఆపుకుందామన్నా ఆగకుండా ధారాళంగా.

దుఃఖంగా వెలికిపొంగి వచ్చింది." అంటూ అలెగ్జాండరు సేనానులతో మన దేశానికొచ్చిన గ్రీకుచారిత్రకుడు ప్రత్యక్షంగా చూసి రాసిన సాక్ష్యపు మాటలు. దీనికేమందాం? ఇదే. 'జగజ్జేత' అయినవాడూ—మనదేశాన్ని జయించినవాడూ అయితే సేనలకి అంత దుఃఖం పొంగివొచ్చేటంత ఏడుపెందుకొచ్చింది? అంత భయం ఏల కలుగవలె? పోనీ సైనికులేమన్నా చిన్నపిల్లలా? వాళ్ళతోకూడా అలెగ్జాండరుగూడా ఎందుకు ఏడవాలి. "terror" (భీతాహం) "paralyzed" (భయంతో పక్షవాతంలాగ బిగుసుకుపోయిన.") అన్న పై వాక్యాలు ప్రత్యేకంగా గమనించవలసినవి భయమే—యీ దుఃఖానికంతటికీ కారణం!! అదే అలెగ్జాండరు వెనక్కి తిరిగిపోయేట్టు చేసింది.

దీన్నిబట్టి అలెగ్జాండరు పలాయనం గ్రీకుచరిత్రలోనే సువర్ణాక్షరాలతో లిఖింపబడిన—విదేశీయులుకూడా కాదనలేని, చారిత్రక సాక్ష్యంగావుంది. ఇక్కడ వొక్క ప్రశ్న అడగవలసి వున్నది. యీనాటి చరిత్రకులనూ, "హిస్టరీడిపార్టుమెంటు"లో పొట్టపోసుకుంటున్న పండితంమన్యల్నీను. "ఇంత స్పష్టంగా గ్రీకుల మాటల్లోనే అలెగ్జాండరు పరాజయం తెలిపే చారిత్రక సత్యాన్ని ఎందుకు ఇంతవరకూ దాచారు? ఇది మీ అజ్ఞానానికి ఋజువా—లేక తెలిసి తెలిసి భారతీయుల్నించి ఈ చారిత్రక సత్యాలను దాచటం, మన హిస్టరీ పుస్తకాలలోకి ఎక్కకుండా మనపిల్లలు తప్పుడుచరిత్ర చదువుకొనేందుకా?" 'అలెగ్జాండరు జయించినట్లు, (Alexandr's Conquest.) లేక Alexander the Great అన్న అబద్ధాలకు కారకులెవరు? ఇందులో చారిత్రక ఉపాధ్యాయుల బాధ్యత ఎంత? దీనికి వారి సిగ్గుతోకూడిన మౌనమే సమాధానమని మనకందరికీ తెలుసు. ఏం చెబుతారు—యీ పరదేశ మానస పుత్రులు?

## అలెగ్జాండరు మోసం :—

భారతదేశంలోని ఎల్లలలోనే, సింధునదిని పంజాబునూ దాటిరాకుండానే పరాజయంతోను, భయంతోను : వెనక్కి తిరిగిపోయిన అలెగ్జాండరు

తన తిరుగు ప్రయాణంలో కుక్కాలుకూడా పడరాని పాట్లు పడ్డాడు. లెక్కకు మీరి అతని సేనలు జబ్బులతోను, ప్రయాసలోనూ తిండిలేక చచ్చిపోయారు. దోవలోనే ! అలెగ్జాండరుకూడా తిరిగి ఇల్లుచేరలేదు. మధ్య దారిలోనే 'బాబిలన్' వద్ద అక్కడి సాధువుల శాపానికి గురిఅయి కన్ను మూసాడు. ఇదంతా గ్రీకు చరిత్రకారులే రాశారు ! ఇదంతా చూసి ఆశ్చర్య పడనక్కరలేదు. కాని భారతదేశంలోని రాజులచేతుల్లో చాలాసార్లు చావు దెబ్బలుతిని చావు తప్పించుకొని వెనక్కి పలాయనమంత్రం పఠించి. మళ్ళి బయటికి గెలిచినట్లుగా మోసంచేసే పోజులు ఇచ్చాడంటే. అసహ్యం ఆశ్చర్యం వేస్తుంది. అతని సంకుచిత స్వభావానికి !! "కర్టియస్‌రూఫస్" అనేగ్రీకు, అదే విషయాన్ని రాసిన మాటలు మాత్రం ఉదహరిస్తాను.

Siege and capture of the Rock eternis : Then Alexand-der mindful alike of his name and his promise in fighting with more spirit than judgment. fell pierced by with many darts. Charus seeing him lying dead made a dash upon the enemy······he sank lifeless on the body of his friend."

"అరోనిస్ గుట్టపైదాడి :—అలెగ్జాండరు తనపేరూ, తానుచెప్పిన వాగ్దానాలూ, తలచుకొని, వివక్షణకంటె రోషంతో హెచ్చుగా యుద్ధం చేసాడు. చాలా బాణాలుతగిలి నేలకొరిగిపోయాడు. అదిచూచి "చారస్" అనే సైనికుడు ప్రతీకారంతోను పగతోనూ శత్రువులమీద దూకాడు.... అతనూ ప్రాణంవొదిలిన తన స్నేహితుడి ప్రక్కనే కిందపడిపోయాడు"

ఇలాగ చావుదెబ్బలు తిని ఓడిపోయిన గ్రీకులు తాముగెలిచినట్లుగా నటనచేసి పెద్దపెద్ద "చిహ్నాలు" తర్వాతిప్రజలు—వాళ్ళని మహా విజేత లని భ్రమింపజేయాలనే ఉద్దేశంతో కట్టించి వెళ్ళారని—ఏవరోకాదు ! "కర్టియస్ రూఫస్" రాస్తున్నాడు ! చిత్రం !

"Although it was the position rather than the enemy he had conquered; the king gave this the appearence of a great victory by offering sacrifice and worship to the gods. The defence of the rock and the country surrounding was entrusted to Sisicottus."

"నిజానికి చూస్తే శత్రువులే గ్రీకులకన్నా జయించినా, అలెగ్జాండరు దీన్ని ఒక మహావిజయంలాగ చిత్రించాడు. దేవతలకి పెద్ద బలులూ పూజలూ చేసాడు. గుట్టచుట్టూరా వున్న దేశం "శశిగుప్తుడి"కి వాదిలి పెట్టబడింది." అంటే సూటిగా చెప్పాలంటే పై విధంగా బాహాలుతగిలి నేలకొరిగిన "జగజ్జేత" పండుగలుచేసుకుని (బ్రతికున్నందుకా?) ఆదేశాన్ని శశిగుప్తుడికి వాదిలి (వాడలకచేసేదేముంది?) వెళ్లారట ధైర్యంగా! యిదిచూసి విసుగెత్తి కాబోలు గ్రీకుసైన్యాలుసముద్రగుప్తుడి (Sandrcottus) పేరుగురించి విని వెనక్కిపోదామని పట్టుబట్టారు. అలా పలాయనం చేస్తూ కూడా అలెగ్జాండరుచేసిన మోసంచూడండి!'

He ordered also the fortifications to be drawn over size and Couches of a larger size than was required for men of ordinary stature, he left; so that by making things *appear in magnificient proportions*, he might *astonish posterity* by deceptive wonders" ఆతడు అగర్తలను మామూలుకంటె పెద్దవి తవ్వించాడు. వెనక విడిచి వెళ్ళేందుకు కుర్చీలూ అవీ మామూలు మనుషులు ఉపయోగించే వాటికంటే ఎంతో పెద్దవి కావాలని చేయించాడు. ఎందుకంటే తర్వాతితరాలవారు వాటి సైజుచూసి ఆశ్చర్యపడి మోసపోవాలని' (ఎంత సైజులో వుండేవారో యీ "భారతదేశాన్ని జయించిన" "మహా కాయులని-అట. ఇదీ జగజ్జేత అలెగ్జాండరుగారి గుర్తులతీసేసిన అసలు రూపం, ఇదీ "జగజ్జేత" అలెగ్జాండరుగారి అసలు సైజు !!!

## భారతీయుల పరాజయం నిజమా?

ఇంతటి చారిత్రక సాక్ష్యాలున్నా చొప్పతప్పి కన్ను లొట్టపోయిన పంజాబు దండయాత్ర (భారతదేశవిజయం అని రాస్తారు మామూలుగా ఇంగ్లీషువారి శిష్యులు, హిస్టరీలో) మనలో చాలామంది భారతీయులే ఓడిపోయారని అనుకోవచ్చు. ఇంకా అలెగ్జాండరు దెబ్బతిన్న ముచ్చట—గ్రీకులే వ్రాసిన వ్రాతల్లో పైనచూశాం. ఇది విజేతల చరిత్రగా కనపడుతున్నాదా? లేదు అని గ్రీకుల రాతలే చెబుతున్నాయి.

సరే, భారతీయులగురించిన వర్ణనచూద్దాం. అది పరాజితుల వర్ణనలాగుందా? చూద్దాం! పౌరవుడు (Porus):- అలెగ్జాండరు తనపేరువినగానే పోరస్ భయపడిపోతాడనుకొని క్లియోకాంటిస్‌ద్వారాలొంగిపోయి 'కప్పము' సమర్పించేందుకు తనరాజ్యం సరిహద్దుదగ్గరికి రమ్మని వార్త విచ్చిపంపాడు కాని పౌరవుడు మీ రాజు రెండో కోరికమన్నించి రాజ్యంసరిహద్దుకు వస్తాను కాని కప్పంతోకాదు. పోరాడటానికి—ఆయుధాలతోటి! అని గంభీరమై సమాధానమిచ్చి పంపాడట !

"ఈ పౌరస్" పెద్దఏనుగుమీద ఎక్కి చుట్టూవున్న అందరికంటె ఎత్తుగా ఒక పెద్దశిఖరం లాగున్నాడు. ధగధగ మెరిసే ఆయన కవచంతో ఎంతోగర్వంగా రాజఠీవితో తులతూగుతున్నాడు." అంటూ రాస్తున్నాడు కర్టియస్! అంతే గాదు: ఆయన నాగరికజాతివాళ్ళలో ఎంతవీలుందో అంత జ్ఞానమూ పరాక్రమం కలవారు" అని కర్టియస్‌మాటల్లో అనాగరికజాతి (Rude Com-munity) అంటే గ్రీకులుకాని లేక భారతీయు లని అర్థం ! "The Macedonians were intimidated not only by the appe-arance of the enemy...' మాసిడోనియన్లు (గ్రీకులని) ఆ శత్రువులు ఎదిర్చి నిలవటంచూసి భయభ్రాంతులవడమే గాక··· అంటూ భారతీయుల్లో ఎక్కడా పిరికి తనం లేకపోగా గ్రీకుల్ని తరవ తరవకీ అ లె గ్జా ం డ రు తాను ఉ ప న్యా సా లిచ్చి

పింబెడుతూ తీసుకొచ్చారని రాస్తున్నాడు. రథాలూ, ఏనుగులూ పదాతి దళాలూ, ధానుష్కులూ కదలిరాగా ఎంతభయంకరంగా గంభీరంగా 'పోరస్' యుద్ధానికి కదలివచ్చాడో చక్కగా వర్ణించారు గ్రీకులు. పోరస్ విసిరిన శూలానికి అలెగ్జాండరు ఎక్కిన గుఱ్ఱం చచ్చి కింద*పడితే-తర్వాత దీనికో చక్కటి సమాధి కట్టించుకున్నాడట, ఆ గ్రీకు విజేత! పోరవుడు గ్రీకుల సాయపడిన 'ఆభీరుడు' కనపడగానే ఆదేశద్రోహి మీదను శూలం విసిరితే అది వాని వీపులో దిగి గుండెలమీద కవచాన్ని కూడా భేదించుకుంటూ బైటికి వచ్చిందట! 'and flung it too with such force that it pierced right through his back to his chest ' ఇవన్నీ చూస్తే అది ఓడిపోయిన వారి వర్ణన కాదు. ఓడిపోయి గెలిచినట్టు మోసగించే చిహ్నాలు అలెగ్జాండరు కట్టటం చూడగా భారతీయుల "ఇతిహాస" గ్రంథాలలో గాని శాసనాల్లో గాని ఎక్కడా ఈ 'విజేత' అలెగ్జాండరు యొక్క నామమాత్రమైనా కూడా స్మరించబడక పోవటం ఎందుకో తెలుస్తుంది. —ఇతడు విజేత కాడు, పలాయితుడు. లేకపోతే మనదేశాన్ని జయించిన ముస్లింలు, ఇంగ్లీషులూ, మొగలులూ అందరూ పేరు పేరునా ఉన్నారు మన చరిత్రలో- కాని అలెగ్జాండరు మాత్రం లేడు! ఇదే నిదర్శనం! ఇంకేం గావాలి?

## హిందువుల ప్రతిఘటన ఫలితం—అలెగ్జాండరు పలాయనం:—

ఈ విషయం ఎన్నాళ్ళుగా చరిత్ర పుస్తకాల్లోకి రాకుండా దాచబడిన దంటే విషయం నేను యీనాడు రాసినా మనదేశీయులకే నమ్మకం కలగదు. అందుకని అలెగ్జాండరుతో వచ్చిన ఆనాటి గ్రీకుల మాటలలో నే ఉదహరిస్తాను. ఏమి జరిగిందో యథాతథంగా, భయం ఎంతగా సైనికుల్ని కదిలించేసిందో ఎంతగా

చూ.* "Alexander pursued, but his horse, being pierced with many wounds fainted under him and sank to the ground" అని కర్టియస్ వాక్యాలు.

భారతీయుల మంత్రాలూ, అస్త్రాలూ, ఏనుగులూ. శౌర్యంలవన్నీ తలుచుకుంటే అభయం సైనికుల్నికూడా అరపిల్లలాగ ఏడ్పేటట్టు చేసిందో ఆనాటి గ్రీకుచరిత్రకారుల వాళ్ళమాటలతోనే! ఇండియాకు రాజైన "గ్జాండ్రేమ్సు" (xandrames)సైన్యం ఆయన బలపరాక్రమాలు విని గుండెలు జారిపోయిన స్థితిలో వాళ్ళు తమరాజైన అలెగ్జాండరుతో ఈవిధంగా మొరపెట్టుకున్నారు.

"Among *how many of us* is there to be found a single coat of mail? Which of us has a horse? Cause it to be inquired, *how many have servants to follow them*, how much of his booty each one has now left...Can you think of exposing *such a noble army as this*, all naked and *defenceless*, to the *mercy of savage beasts*, whose numbers though purposely exagerated by the barbarians, must yet as I can *gather from the lying report itself, be very considerable*."

"Being thus quite at a loss what to do, he leaped down from the tribunal and shut himself up in the roy. I pavilion into which he forbade any one to be admitted. On the third day he emerged from his seclusion...He orderd also the fortifications around the camp to be *drawn wide* and *couches of a large size, than was required for men of ordinary stature* to be left, so that *by making things appear in magnificient proportions, he might astonish* by deceptive wonders."

"గ్రీకుచరిత్రకారులు ఇంత విపులంగా వర్ణించిన అలెగ్జాండరు ఉపన్యాసాలదానికి జవాబుగాభయంతో వణికిపోయే గ్రీకుసైనికులఆక్రందనాలూ, అన్నీచూస్తే గ్రీకులుభారతదేశాన్ని—మన చరిత్ర ప్రొఫెసర్లు రాసి

నట్టుగా వదలి, విజేతలుగా వెనుతిరిగిపోలేదని యీ క్రిందివాక్యాలే తెలుపుతున్నాయి! పై ఇంగ్లీషువాక్యాలు తెలుగులో చెప్పాలంటే.

"ఇవాళ మాలో ఎంతమందికి వొంటిమీద కవచం (విరగటుంచా) వున్నదో చెప్పండి! ఎవరికి గుర్రంవున్నది? కావాలంటే విచారించండి మాలో ఎవరికి నౌకర్లుగాని, బంట్లుగాని వున్నారో! మాలో ఎంతమంది దగ్గర డబ్బువుందో-కొల్లగొట్టిన దాంట్లో-ఇలాగ రక్షణలేని, యీపరిస్థితిలో వున్న మమ్మల్ని నీ సైన్యాన్ని, శత్రువుకి ఎరగా చేస్తావా? క్రూరంగా పిశాచాల్లాంటి ఆ ఆడవి మృగాల (అంటే ఏనుగులు—గ్రీకులెరుగురు!)కు బలి చేస్తారా? రక్షణలేని మమ్మల్ని ఆ జంతువుల దయాదాక్షిణ్యాల కెర చేస్తారా? ఎంత భారతీయులు మనల్నిభయ పెట్టటానికి వాటిసంఖ్య కావాలని పెంచిచెప్పినా—అవి చాలా ఎక్కువేవున్నాయని మేమూ విన్నాం!"

అదివిన్న అలెగ్జాండరు ఏమిసమాధానమూ చెప్పటానికీ తోచక ఆ వేదికమీంచిమాకి క్రిందికిపోయి తన గుడారంలోకిపో — ఇతరు లెవ్వరినీ లోపలికి రానివ్వలేదు ...అలాగ మూడురోజులు ఏకాకిగా గుడారంలో గడిపి బైటికి వొచ్చాడు.. గుడారాలచుట్టూ అగడ్తలు కావలసినదంటే ఎంతో పెద్దదిగానూ, కుర్చీలూ, ఆసనాలూ, మామూలు మనుషులసైజుకీ చాలారెట్లు పెద్దవి చేయించి వదలివేశాడు.. అలాచేయడంవల్ల రానున్న తరాల వాళ్ళు ఆ సైజునుచూసి ఆశ్చర్య పడటంద్వారా మోసంచేయవచ్చు అని అతని (అలెగ్జాండర్) ఉద్దేశ్యం" అంటూ వివరంగా—అంటే అనుమానానికి తావులేకుండా ఆ గ్రీకుల "చారిత్రకమోసం" (Historical frauds) చేసే అతిముఖ్యగుణాన్ని తెలుపు తున్నాయి యీరాతలు.

ఇక గ్రీకులకు ఇంతభయం కల్పించిన "అడవి జాతుల రాజులు" (Barbarians) ఉన్న అతిశమైన్యాలు అంటే ఏమిటో (ఏనుగులూ. సైన్యాల సంఖ్య) చూద్దాం—గ్రీకులమాటల్లోనే.

సముద్రగుప్త చక్రవర్తి లేక సాండ్రొకొట్టసు సేన, 80,000 గుర్రములు. 2,00,000 పదాతిదళం. 8000 యుద్ధరథాలు

(war-chariots) 6000 పోరాడటానికి తరకలు వేస్తున్న ఏనుగుల కొండలు 'గజ దళం—' ఇది ఏమీ అతిశయోక్తి కాదని "Nor war this army an exaggeration, for not long afterwards, Addrokottos who had by that time mounted the throne, presented Selucus with 500 elephants, and overran and subdued the whole of India with an army of 6,00,000 men అంటాడు. అర్థం :

అలెగ్జాండరు తర్వాత చాలా అనతికాలంలోనే 'అంద్రకోటస్' (సాంద్ర కోటమకు 'స' లోపించి) సెల్యూకసుకు 500 ఏనుగులను. తను సింహాసనం ఎక్కిన తర్వాత, ఇచ్చాడు. అంతేగాకుండా 6,00,000 మంది సేనతో దేశాన్ని జయించి దిగ్విజయం చేశాడు! అని రాస్తున్నాడు. ఈ సముద్రగుప్త మహారాజు దిగ్విజయ, 'అలహాబాదు శాసనం'లో శ్లోకాలలో వర్ణించబడి వుంది.* ఇదీ, భారతీయుల ప్రతిఘటన అంటే—అలెగ్జాండరు పలాయనం ఇందుకే !!

## భారతీయుల ప్రతిఘటన-సముద్రగుప్తుడు —

అలెగ్జాండరు దండయాత్రకు బ్రాహ్మణుల ప్రతిఘటనగురించీ, గ్రీకులు మనదేశంనుంచి పలాయనం చిత్తగించటానికి గల కారణంగురించీ) (బ్రహ్మశ్రీ కోట వెంకటాచలంగారి) ఈ క్రింది మాటలు గమనార్హము :

"శకులు, హూణులు మొదలుగాగల విదేశీయ దోపిడిజాతులు పశ్చిమము నుండి పంజాబుప్రాంతములోనికివచ్చి దేశమునుకొల్లగొట్టుచు, గ్రంథాలయముల నగ్నికాహుతి చేయుచు, స్త్రీల నవమానించుచుండిరి. అల్పరాజ్యములు తమలోతాము కలహించి యుద్ధములస దిగుచుండిరిగాని శక,హూణాది విదేశీ

చూ. * యీ సాంద్రకోటసే,| సముద్రగుప్తుడు' శశిగుప్తుడె (శశి చంద్ర) చంద్రగుప్తుడు, సముద్రగుప్తుని తండ్రి— ఈయననే Amidrachetus అమిత్రచేత్త అని అలహాబాదు శాసనం— "సర్వరాజోచ్ఛేత్త" అని పేర్కొన్నది.

చూ. Is Indian Chronology Correct? Mother India (1957-58)

యుం నెదిరించుటకు ఏకీభవింపజాలరైరి. ఇట్టిస్థితిలో ఆంధ్ర శాతవాహన రాజులలో ఆఖరువాడగు "చంద్రశ్రీ" మైనరుగా నుండెను. అతని సంరక్షణ భారము వహించిన ఆంధ్రరాజ్య సేనాపతియైన చంద్రగుప్తుడను నేపాళ దేశపు గుప్తవంశస్థుడైన క్షత్రియుడు మగధచక్రవర్తుల యధికారమును తన చేతులలో నుంచుకొని రాజ్యమును నడుపుచుండెను. ఇట్టిస్థితిలో క్రీ॥ పూ॥ 327 సంవత్సరమున అలెగ్జాండరుదండయాత్ర వచ్చినది. ఆ దండయాత్ర కాలమున గుప్తచంద్రగుప్తుడును నాతనికుమారుడు సముద్రగుప్తుడును, గొప్పసైన్యముతో తన్నెదుర్కొనుటకు వచ్చుచున్నట్లు విని అలెగ్జాండరు దండయాత్రను విరమించుకొని స్వదేశమునకు మరలెను. ఆ సందర్భమున గ్రీకుచరిత్రకారులు ముగ్గురు హిందూరాజులను పేర్కొనిరి. వారిచేవ్రాయబడిన పేర్లు. 1. శాతవాహన వంశంలోని ఆఖరురాజు మైనరు చంద్రశ్రీ. ఇతనినే గ్రీకుచరిత్రకారులు "గాంద్రేమ్స్" అని వ్రాసియుండిరి. 2. మైనరుచంద్రశ్రీకి గార్డియన్‌గా నుండిన "చంద్రగుప్తుడు." ఇతనే గ్రీకులచే వ్రాయబడిన శాండ్రోకోట్టస్." 3. యీతని కుమారుడు "సముద్రగుప్తుడు." యీతడే గ్రీకులచేవర్ణింపబడిన "శాండ్రోశిప్టసు"

"—ఇట్టికాలమున క్రీ॥ పూ॥ 327 సంవత్సరమున అలెగ్జాండరు అను గ్రీకురాజు దేశముపైకిదండెత్తి వచ్చిపంజాబు ప్రాంతమునగల అల్ప రాజ్యములను జయించుచుండెను. ఆ దండయాత్రలో నాతని నెదిరించుటకు రాజులను, సైన్యములను సన్నద్ధపరచుచూ అవసరమైనచోట్ల తాముకూడ యుద్ధములలో పాల్గొనుచు బ్రాహ్మణులు దేశమును పరరాజుదండయాత్ర నుండి కాపాడుటకెచ్చుగా పాటుబడుచుండిరి. అలెగ్జాండరుసైన్యములనెదిర్చి బ్రాహ్మణులు ఆగ్నేయ, వారుణాస్త్రములచే అలెగ్జాండరుసైన్యమును చిందరవందరగావించినట్లు అలెగ్జాండరుతోవచ్చిన చరిత్రకారుడు'తెమిస్టస్' (Themistus) వ్రాయుచున్నాడు." (కలిశకవిజ్ఞానం).

దీన్నిబట్టి మనం యీనాడు చదువుకునే చరిత్ర ఎంత అసత్యమో తెలుస్తుంది. ఎందుకంటే క్రీ॥ పూ॥ 327 B. C. నాడు మనదేశంపాలించిన

సముద్రగుప్తుడి కాలంలో మనదేశానికొచ్చిన అలెగ్జాండరుతో మౌర్య చంద్ర గుప్తుడిని సమకాలికుడుగా మార్చారు—ఇంగ్లీషు చరిత్రకారులు. దీనివల్ల 1537 B C.నాటి మౌర్యులకాలం 327 B. C. కు తగ్గించి—అలెగ్జాండరు నాటి (327 B. C. సముద్రగుప్తుడిని 400 B. C కి ముందుకి లాగారు. ఇది అబద్ధంఅని —పై గ్రీకులరాతలే*గాక స్టెయిన్ (Stein) ట్రాయరు (Troyer), కుప్పయ్య. డా॥ త్రివేద(Dr. Triveda), సేత్నా (Sethna) వంటివారేగాక కోటవెంకటచలంగారి పై నుదహరించిన వాక్యాలు కూడా ఋజువుచేస్తున్నాయి. ఇలాగ విష్పాక్షికంగా చరిత్ర పరిశోధించటంవల్ల అలెగ్జాండరుకుజరిగిన పరాభవమే కాకుండా సముద్రగుప్తుడి విజమైన కాలంకూడా తేల్చుకొనడం జరిగింది. దీనివల్ల తారుమారుచేయబడ్డ మౌర్యుల కాలమూ, తద్వారా తగ్గించబడిన బుద్ధదేవుని కాలమూ కూడా సరిచేయడం జరుగుతుంది—ఇంగ్లీషుదొరల తప్పులనించి ! అదీ ఇన్నాళ్లకు!!

దీన్ని జాగ్రత్తగా చదివితే యీనాటిచరిత్రలోని'జగజ్జేత'—భారత దేశ విజేతగా రాయబడిన అలెగ్జాండరు అసలురూపంతెలుస్తుంది! మనదేశములో ఈయన ఎంతభాగం జయించాడో (పలాయనం) కూడా ఈ ప్రక్కన చూపిన దేశపటంచూస్తే మీరే ఊహించుకోవచ్చు—ఈ సత్యాలు మన విద్యార్థులకి తెలిసే దెప్పుడో.

ఇదంతా మన చరిత్ర టెక్స్టు (Text) లలో కెక్కినప్పుడే గదా !

---

*సముద్రగుప్తుడితో 'కాచగుప్తుడినీ' "అమిత్రఘాత" 'అనేకొడుకునీ' భారత దేశదిగ్విజయాన్ని(ఇవి మౌర్యచంద్రగుప్తుడికి సరిపోని వివరాలు!) కలిపి గ్రీకులు వర్ణించడంవల్ల యీ విషయాన్ని స్పష్టంగా తేల్చారు. అంతేగాకుండా మౌర్యచంద్రగుప్తుడి గురువైన చాణక్యుడినిగురించి ఎక్కడా గ్రీకులు రాయకపోవటంకూడా యీవిషయాన్నే ఋజువుచేస్తుంది! (వివరాలు:—"గుప్తరాజులు" "మౌర్యుల గురించి అధ్యాయంలో—యీ గ్రంథం 2—వ భాగంలో చూడనగును).

అలెగ్జాండరు దండయాత్ర → మార్గం →



# విరామం

మన చరిత్రని తెలుసుకొనేందుకు మనం బైల్దేరిన ఈయాత్రలో ఒక మజిలీ చేరాము—అలెగ్జాండరు దండయాత్రవద్దకు రావడంతోనే ఇది ఒక మైలురాయి—ఒక 'విరామం' అంటే సినిమాలోని "ఇంటర్వెల్"వంటిది.

కారణం—భారతజాతి జీవనస్రవంతి నిర్మల గంగా ప్రవాహం లాగ కాలప్రవాహంలో నడిచి ముందుకి సాగిపోతూన్న తరుణంలో—నదిలో అడ్డతగిలిన బండరాయి ఇది! నదిని పాయలు పాయలుగా అనేక చీలికలుగా ఎలా చేస్తుందో అలాగ, చీలికలుచేసింది! విదేశీయుల దండయాత్రల పరంపరలకి నాందిగా 'అలెగ్జాండరు' మనగడ్డమీద చేసిన ఈ దురాక్రమణ ప్రయత్నం మన సంస్కృతికి జీవనాధారమైన హిందూ ధర్మసత్య పవిత్రతలనే గంగావాహినిలో మొదటి అడ్డురాయిలాగ పడింది. ఈ అడ్డురాయే ఈనాటి పాశ్చాత్యచారిత్రకులకో మైలురాయి!

క్రీస్తుపూర్వం 327 సంవత్సరాలనాటి యీ అలెగ్జాండరు దురాక్రమణ-ఒక పరాజయగాథే అయినా, ఇది, మనదేశాన్ని కొల్లగొట్టి, మన శిల్పసంపదని ధ్వంసంచేసి, ప్రాచీన తాటియాకుల గ్రంథాలను వేలసంఖ్యలో తగులబెట్టి, హిందూ స్త్రీలనూ పిల్లలనూ బ్రాహ్మణులనూ క్రూర హింసల పాలుచేసిన కన్నీటి యుగానికి—నాందిపలికింది! ఇలాగ మొదటి విదేశీ శూలం, భారతమాత గుండెలకు గురిపెట్టబడిన ఈరోజు-327 B.C. మనం మరువరాని—మరువగూడని అవమాన దినం, మనజాతి చరిత్రలోనే.

మనచరిత్ర వ్రాయడంలో కూడా యిది ఒక మైలురాయి. ప్రాచీన రాజవంశావళులలోనూ "నాడీగ్రంథాల" లోనూ పురాణాలలోని భవిష్యత్ చరిత్రగా వేలకొలదిశతాబ్దాలుగా రక్షించుకుంటూ వస్తున్న మనజాతి అసలు

చరిత్రను అంతంచేయడానికి-భారతీయుల, నిజమైన సంస్కృతికీ ప్రాచీన వైభవానికీ సమాధి కట్టడానికీ బ్రిటిషు సామ్రాజ్యవాదులు వేసిన మొదటి రాయే—ఈ అలెగ్జాండరు "విజయం" (Alexander's Conquest)! ఇది అబద్ధాల విజయం—నిజం పైన!!! సత్యాన్ని మరుగుపరచి బైబిలు లెక్కలతో 5000 సం||ల ఇతిహాసాన్ని 2000లకు సం||ల పరిహాసంగా తిర్చిదిద్దిన, తెల్లదొరలు పూసిన తెల్లసున్నం, మనజాతి మొఖాన!

ఇంతవరకూ భారతీయుల గాథ మహాభారత ప్రపంచయుద్ధానంతరం ప్రారంభమైన 'కలియుగం' (కలియుగం—18-2-3192 B. C.) నాలుగు పాదాలలో ఇది రెండవపాదం.

మొదటి 'పాదం' శ్రీకృష్ణనిర్యాణంనుంచీ హిందూరాజుల బ్రాహ్మణ ధర్మం మనదేశాన్ని నడిపించినదే! అది బౌద్ధయుగంతో సన్నగిల్లి, బౌద్ధశకంలో రెండవపాదం మొదలయింది. మూడవది "మ్లేచ్ఛయుగం" అంటే మనసంస్కృతిని మన సాంప్రదాయాల్ని మన సాహిత్యాన్ని నాశనం చెయ్యాలని కక్షపూనిన 'విదేశీ దండయాత్రల' శకం. ఇందులో గ్రీకులు నాందిపాడారు.

ముస్లిములది మూడవ పాదం! తెల్లదొరల దొరతనం నాలుగవ పాదం!! అందుకే మనజాతీయ చరిత్ర నదిలో మొదటి అడ్డుపాయ, ఈ అలెగ్జాండరు దురాక్రమణ. తర్వాత హిందూసమాజం ధర్మం. సంస్కృతి, దేశం బ్రతుకే అనేక పాయలైపోయింది. చిలవలు పలవలుగా బండరాయి తాకుపడిన నదీ ప్రవాహంలాగ!

ఈ గ్రంథంలో రానున్న '2 వ భాగం'—విక్రమాదిత్య శాలివాహన, కాళిదాస, శంకర రామానుజ కృష్ణదేవరాయ శివాజీల పువ్వుల తావిని గుబాళించు చుంటుంది. రానున్న 'ఆమని' తీయని వాసనలు ముందే గుబాళిస్తాయి. ఈ పరిమళాన్ని ఆఘ్రాణిస్తూ భారతజాతిపడ్డ పరాభవాలనూ

రక్తపాతాలనూ, అన్యాయాలనూ, బానిసత్వాలనూ మర్చిపోదామా? లేక మన బానిసత్వానికి — కాదుఅనేకపాట్లు పడిన "బానిసత్వం"కి కారణమయిన గుణపాఠాలు, అనేక గుణపాఠాలను నెమరు వేసుకుందామా? రామన్న కాలంలో మళ్ళీ మన భారతమాతకు సంకెళ్ళుపడకుండా?

ఎందుకైనా కొంచం ఆగి ముందుకుపోవాలి — ఈ సింహావలోకనం చేసి! అందుకే ఈ "విరామం"! ఇది ఈ సంపుటానికి జాతీయగీతిక — రామన్న ద్వితీయ సంపుటానికి నాంది శ్లోకమూను!

ఇక వుంటాను, సెలవు!

—O—



శ్రీ కొండపల్లి ప్రింటింగ్ వర్క్స్, రాజమండ్రి-2




## భారతీయ సంస్కృతి సముద్ధరణకు
## (యుస్కేఫీ) ప్రచురణలు

1. Hinduism in the space age — రూ 50.00
   (సభ్యులకు రు. 25.00 మాత్రమే)
2. యుగపురుషుడు (తెలుగు—కన్నడ భాషల్లో)... — రూ 6.00
3. మనదేశము—మనసంస్కృతి. — రూ 7.00
4. పురుషసూక్త రహస్యము — రూ 7—00
5. అమృతానుభవములు — రూ 7.00
6. విష్ణుసహస్రనామం—నారాయణ తత్వం — రూ 5—00
7. వేద—ఆయుర్వేద (ఇంగ్లీషు) — రూ 7—00
8. నిత్యజీవితంలో యోగసాధన — రూ 2—00
9. నేటిసమాజంలో భారతీయ మహిళలకార్యక్రమం — రూ 1—50
10. గణేశ పురాణం (అచ్చు)
11. భగవాన్ వేదవ్యాస (అచ్చు)
12. ప్రాచీన భగవద్గీత (అచ్చు) (లోపించిన 43 శ్లోకములతో)

అన్ని జిల్లాలలో ఏజంట్లు కావలెను:

వివరములకు:

Secretary,
USCEFI
6. 3-240/6 Prem nagar
Kheirta bad, Hyderabad- 500004



పేరు వేదవ్యాస. జననం 1935. వీరు ఆంధ్రప్రభుత్వంలో విశాఖ తూర్పుగోదావరి, ఖమ్మం జిల్లాలకు అధికారిగా గిరిజనులకు భూమిపంపకం సంబంధించిన ఉద్యోగంలోవున్నారు. గతంలో వీరు 1964లో హైదరాబాదు జిల్లాకు జాయింటు కలెక్టరుగా, 1967లో కర్నూలు స్పెషల్ కలెక్టరుగానూ మద్రాసులో ఆంధ్రప్రభుత్వం రిప్రజెంటేటివ్‌గానూ ఇంకా ఇతర ఉద్యోగాలనూ నిర్వహించారు.

బాల్యంనుంచి యోగాభ్యాసం,సంస్కృతం వేదాలలో,పురాణశాస్త్రాలలో ప్రవీణత, జ్యోతిష ఆయుర్వేద, చరిత్రలలో పాండిత్యమూ వీరికి వెన్నతో పెట్టిన విద్యలు. ఉపన్యాస వేదికలలో పేరెన్నికగన్న మహావక్తలు. ఐ.ఏ.ఎస్. కు ఇంగ్లీషుసాహిత్యం, చరిత్రజీవశాస్త్రంలలో M.A., స్థాయిలో పరీక్ష నిచ్చారు.

వీపదవిలోవున్నా వీరు భారతీయసంస్కృతికి, సంస్కృతం, వేదశాస్త్రాలప్రచారంకోసం. ప్రజలలో మనదేశమన్నా, మన ప్రాచీన విద్యలన్నా ఆసక్తి పెంచటానికి కృషి నిర్విరామంగా చేస్తున్నారు. క్రొత్త విద్యావిధానం ఒకటి-"జాతీయ విద్యావిధానం" (National Education) కోసం వీరు కృషి చేస్తున్నారు.